# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపఁబడిన

శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

సచిత్రము

ఆఱవ భాగము




సంపాదకుఁడు :

విద్యా భూషణ

ఉపన్యాసక రత్న - కవితా విశారద

ధనకుధరం వరదాచార్యులు




ప్రకాశకులు :

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథ మాల

శ్రీ లక్ష్మీ నారాయణ పురము

గుంటూరు - 6

శ్రీ రామానుజాక్షర కౌముది
ఆఱవ భాగము

మొదటి ముద్రణము
వేయి ప్రతులు

క్రోధన - బోధన ఏకాదశి
నవంబరు - 1985

రామానుజ శకము ౯౬౮

మూల్యము :
ముప్పది రూపాయలు

ముద్రణము :
వెల్‌కం ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్
బ్రాడీపేట : గుంటూరు

# సమాలోచన సమితి

మహా కవి - సరస్వతీ పుత్ర - కళా ప్రపూర్ణ

డాక్టర్ : పుట్టపర్తి నారాయణాచార్యులు

కడప

*

వ్యాకరణ విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ

శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులు, M.A.

విశాఖ పట్టణము

*

సాహిత్య రత్న - భాషా ప్రవీణ

శ్రీమాన్ కె. టి. యల్. నరసింహాచార్యులు

శ్రీ గోదా గ్రంథమాలా సంపాదకులు

ముసునూరు

*

సంగీత సాహిత్య కళానిధి

శ్రీ మాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

విజయవాడ

*

చతుర్విధ కవితా చతురానన - మహా కవి

శ్రీమాన్ విక్రాల శేషాచార్యులు

కలికివాయ

*

భాషా ప్రవీణ - విద్వాన్ - లలిత కవి

శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులు

కందుకూరు తాలూకా రచయితల సంఘాధ్యక్షులు

ఉలవపాడు

*

న్యాయవిద్యా ప్రవీణ
డాక్టర్. యస్. బి. రఘునాథాచార్యులు, M.A, Ph.D.
సంస్కృత రీడర్ : శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము
తిరుపతి

*

సాహిత్య విద్యా ప్రవీణ
శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యులు
సంస్కృతోపన్యాసకులు :
శ్రీ వేంకటేశ్వర వివేకవర్ధినీ సంస్కృత కళాశాల
హైదరాబాదు

*

శ్రీమాన్ చిలకపాటి విజయ రాఘవాచార్యులు, M A
లెక్చరర్ :- ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్ కాలేజి
నాగార్జున సాగర్ — విజయపురి సౌత్

*

శ్రీమాన్ శ్రీపెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, M A
ఉపన్యాసకులు :- శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్య కళాశాల
పాలెమ్

*

కవి కోకిల - విద్వత్కవి - కావ్య కళానిధి
శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులు
సిద్దిపేట

*

డాక్టర్ : కె. సుప్రసన్నాచార్యులు, M A, Ph D.
తెలుగు ప్రొఫెసర్ : కాకతీయ విశ్వ విద్యాలయము
వరంగల్

# ప్రముఖులు - ప్రశంసలు

కె. టి. యల్. నరసింహాచార్యులు　　　　మ సునూరు

శ్రీ రామానుజ కీర్తి కౌముది అయిదవ భాగము చదివినాను. గ్రంథ మంతయు రమ్యతమము.

కె. వి. నారాయణరావు, ప్రధాన సచేతక్ A P　　　　హైదరాబాదు

శ్రీ రామానుజ కీర్తి కౌముది సంపుటాలలో ప్రచురిత మవుతున్న వ్యాస పరంపర విజ్ఞాన దాయకంగాను, సంశయ విచ్ఛేదకంగాను ఉన్నది ఉభయ వేదాంతాలకు సంబంధించిన మౌలిక సిద్ధాంతాలను లబ్ధప్రతిష్ఠులైన పండితులు సులభమైన శైలిలో ప్రచురించడం అత్యంత ముదావహము. ముఖ్యంగా - ఆళ్వారుల రచనలను గురించిన వ్యాసావళి ద్రావిడ భాషా విజ్ఞానం లేనివారికి అత్యంతోపయోగకరంగా ఉన్నవి. వేదాంత దేశికుల రచనలను, పాంచరాత్రాగమాలను కూడా క్రమశః రాబోయే సంపుటాలలో పరిచయం చేయగల రని ఆశిస్తున్నాను మీరు చేపట్టిన ఈ బృహత్ కార్యక్రమ పరిసమాప్తికి శ్రీ శ్రీనివాసుని కరుణా కటాక్షం తప్పక లభింపగలదు.

వేముగంటి నరసింహాచార్యులు,　　　　సిద్దిపేట

శ్రీ రామానుజ కీర్తికౌముది విశిష్ట స్థాయిలోనుండి, శ్రీ విశిష్టాద్వైతసిద్ధాంతమును చక్కగా వెల్లడించుచున్నది.రచయిత లందరు పండిత ప్రకాండు లగుటవలన, రచనలు ఉదాత్తమైన, ఉన్నతమైన, స్థాయిలో నుండి, శ్రీమద్రామానుజుల కీర్తి చంద్రికలను విస్తరింపజేయుచున్నవి.

ఆచార్య: యస్వీజోగారావు, M. A; ph. D.　　　　వాల్తేరు

భగవద్విషయమున మీది భల్లూకపు పట్టు. చాల గొప్ప సారస్వత వరివస్య చేయుచున్న మహాభాగులు మీరు.

చించాకట్టణం శ్రీ రంగాచార్యులు, M A;B Ed జడ్చర్ల

శుక్లపక్ష చంద్రుడు క్రమవికాసము నంది, తన శీత కిరణములచే జనులకు మహానందము నొదగూర్చునట్లు, సంప్రదాయ వైశిష్ట్యమును విశేషముగ నెరుగగోరిన మహోదయు లందరికీ శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వ సంపుటములు ఒకదానికంటె మరొకటి మిక్కిలి కుతుకమును, పరితృప్తిని అశేషసంప్రదాయ పరిజ్ఞానమును గలిగించుచున్నవి.

బులుసు వెంకట రమణయ్య, మద్రాసు

శ్రీవైష్ణవ సంప్రదాయానికి సమ్మాళ్వారులు మున్నగు పన్నిద్దరాళ్వారులు, నాథమునులు మున్నగు ఆచార్య పురుషులు మూలస్తంభాలు వారు ప్రతిపాదించిన భక్తి ప్రపత్తులు, ఆధ్యాత్మిక విషయాలు అమోఘాలు. ఆ సంప్రదాయాలకు సుస్థిరత్వం సమకూర్చే విశిష్టాద్వైత సిద్ధాంతాలు భగవద్రామానుజుల మూలంగా విశ్వవ్యాప్తమయినవి ఆ సిద్ధాంతాలను వ్యాప్తికి తెస్తున్న వారిలో - భవకుధరం వరదాచార్యులుగారు, శ్రీ గోదా గ్రంథమాల సంపాదకులు కె టి యల్. నరసింహాచార్యులుగారు ఎన్నదగిన వారు. శ్రీ వరదాచార్యులుగారి సంపాదకత్వంలో వెలువడుతున్న శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపుటాలలో, తమ సంప్రదాయమునందు లబ్ధ ప్రతిష్ఠులైన విద్వాంసుల గద్య పద్యవ్యాసాలు సత్సంప్రదాయాభిజ్ఞుల నాకర్షిస్తున్నవి. శ్రీ వైష్ణవ సంప్రదాయ జిజ్ఞాసువులకు ఈ సంపుటాలు ఎంతో ఉపయోగపడగలవు. ఈ గ్రంథాలకు ఆదరం లభింపగలదని ఆశిస్తున్నాను.

*(ఆంధ్రపత్రిక సమీక్ష : 1985 మార్చి 12)*

Dr: Piena NandaKumar, VisaKhapatnam

Thank you very much for the kind gift of the fifth volume of Sri Ramanuja Keerthi Kaumudi.

The volume is indeed a rich mine for those interested in Sri Ramanuja Darsana as well as those who are inclined towards as devotional way of life Your own article touches]the thorny upon the wonderful manner in which the Alwars transcended the thorny fence of caste and made all Vaishnavas one vast, holy brother hood.



శ్రీనివాసాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

# కౌముదీ ప్రకాశము

భక్తి ప్రచార మహోద్యమమునకు ఆళ్వారులు ఆద్యులు గుటయే గాక, అపూర్వములైన తాత్త్విక విషయములను సైతము వారు తమ తమ దివ్య ప్రబంధములలో వెలువరించి, ఆస్తికులకు మార్గదర్శకులై యలరారుచున్నారు.

వారి యనంతరము శ్రీవైష్ణవ మత స్థాపనకై దీక్ష వహించి, తమ తమ జీవితములను అంకితము గావించిన మహనీయులు ఆచార్యులు.

ఆచార్య పరంపరలో - నాథ, యామునులు అగ్రగణ్యులు శ్రీ సంప్రదాయ పరివ్యాప్తికై, వారు చేసిన పరిశ్రమము నిరుపమానము.

వారి యనంతరము శ్రీమద్రామానుజులు చేతనోజ్జీవనార్థమై తమ శక్తి యుక్తులను ఏకోన్ముఖముగా వెచ్చించి, శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతమును పునరుద్ధరించి, జగదాచార్యులుగా పేరు గాంచిరి.

జగన్మిథ్యా వాదమును నిరసించుచు - 'ఈశ్వరుఁడు, జీవుఁడు, జగత్తు - ఈ మూఁడును సత్యములే' యని యెలుగెత్తి చాటిన శ్రీమద్రామానుజుల తత్త్వత్రయ వివేచనము - ప్రపంచము నందలి తాత్త్విక ప్రముఖులను ఉఱ్ఱూత లూగించినది.

భక్తి రూపాపన్న జ్ఞానమే మోక్ష సాధన మని వివరించుచు, శ్రీమద్రామానుజులు రచించిన బ్రహ్మసూత్ర భాష్యము - 'శ్రీభాష్య' మను పేర, విశ్వ విఖ్యాతి గాంచినది

'శ్రీ వేంకటాచలము వైష్ణవ క్షేత్రమే' యని నిరూపించుటే గాక, తిరుమల తిరుపతి దేవస్థానములలో పెక్కు కట్టుదిట్టములు గావించి, ఆ క్షేత్ర వైభవమును ఇనుమడింపఁజేసిన ఘనత - శ్రీ భగవద్రామానుజులకే దక్కినది.

నిమ్న జాతులనుండి అగ్ర వర్ణముల వఱకును, నిరుపేదలు మొదలు మహారాజుల వఱకును అనేకులు శ్రీ రామానుజ శిష్యులై, వారిని భక్తి ప్రపత్తులతో భజించి తరించిరి.

ఆళ్వారాచార్యుల అవతార వైశిష్ట్యమును వ్యాస భగవానుఁడు భవిష్య ద్వృత్తాంతముగ కొన్ని పురాణములలో నుల్లేఖించి యున్నాఁడు

అదియునుఁ గాక, కృష్ణో పనిషత్తునందును శ్రీ రామానుజ అవతార వైభవాదులు అభివర్ణింపబడినట్లు విశేషాచార్య (విక్రాల శేషాచార్య) వివరణము మనకు విస్పష్టము చేయుచున్నది.

ఇట్లే, శ్రీ రామానుజ భక్తులు కొందఱు - శ్రీవారి తత్త్వ మహత్త్వములను విశేషముగ వర్ణించుచు, అనేక గ్రంథములను రచించి యున్నారు

ఆళ్వారాచార్య వైభవము అనన్యాదృశము. వారి ప్రభావము వర్ణనాతీతము.

అయినను, వారి యవతార వైభవాదులను 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' యను దర్పణమున, పదునాఱు కళలుగా - తెలుఁగు వెలుఁగులో ప్రతిబింబింపఁజేయవలె నని మా తలంపు.

అట్టి తలంపుతో - ఇంతకు మున్ను మేము వెలువరించిన సంపుటము లైదును - పండిత ప్రశంసలకు, పత్రికా ప్రశంసలకు పాత్రము లైనందులకు మేము పరమ హర్షము నొందుచున్నాము.

ఇపు డీ భక్తి కౌముది యందలి విశేషములను సాధు హృదయులు గ్రహించి, సంతుష్టాంతరంగులు కాగల రనుటలో — మాకు లేశ మాత్రమేని సంశయము లేదు.

ఇట్లే, ఇక మున్ముందు రావలసిన సంపుటములందును - ఆళ్వారాచార్య విషయక వ్యాసములేగాక, సిద్ధాంత పరము లగు వ్యాసములును మఱి కొన్ని వరుస వరుసగా ప్రచురణము కావలసి యున్నవి. అట్టి వానిలో - ముఖ్యమైన వ్యాస శీర్షికలను ఈ క్రింద పొందు పఱచుచున్నాము

*1 అవతార తత్త్వము - దశావతారములు
2 లక్ష్మీ పురుషకార వైభవము
*3 శ్రీ వైష్ణవ మతము - శ్రీ పాంచరాత్ర వాఙ్మయ ప్రభావము
4 పరమ భాగవతులు - భక్తి విశేషములు
5. దివ్య ప్రబంధములు - సంగీత సాహిత్యములు
*6. దివ్య ప్రబంధ ప్రభావము
7. భగవ ద్విషయము - త ద్విశేషము
*8. వ్యాఖ్యాన చక్రవర్తి - పెరియవాచ్చాం పిళ్ళై
*9 శ్రీ రామానుజ వైభవము
*10. శ్రీ రామానుజ సూక్తి రత్నములు
*11. శ్రీమ ద్రామానుజులు — భక్తి తత్త్వము

12. శ్రీమద్రామానుజులు — విశిష్టాద్వైతము
13. శ్రీమద్రామానుజులు - వేదార్థ సంగ్రహము
14. శ్రీమద్రామానుజులు - వేదాంత సారము
15. శ్రీమద్రామానుజులు - వేదాంత దీపము
16 శ్రీమద్రామానుజులు - శ్రీభాష్యము
17. శ్రీమద్రామానుజులు - భగవద్గీతా భాష్యము
18. శ్రీమద్రామానుజులు - గద్యత్రయము
19 శ్రీమద్రామానుజులు - నిత్య గ్రంథము
20. శ్రీమద్రామానుజులు - జప ధ్యాన పారాయణములు
21 శ్రీమద్రామానుజులు - యోగవిద్యా రహస్యము
22 శ్రీమద్రామానుజులు - వర్ణాశ్రమ ధర్మములు
23. శ్రీమద్రామానుజులు - కలా వైశిష్ట్యము
*24. శ్రీమద్రామానుజులు - శ్రీవైష్ణవ మతము
*25. శ్రీ వేదాంతదేశిక వైభవము
26. శ్రీ పిళ్ళలోకాచార్య వైభవము
27 శ్రీ మణవాళ మహామునుల వైభవము
28. అష్టాదశ రహస్యములు - తద్విశేషములు
*29 శ్రీవైష్ణవ సాహిత్య ప్రభావము
30. తిరునామములు - వైష్ణవ తత్త్వము
31. శ్రీవైష్ణవ మతము - ప్రపన్నానుష్ఠానము
*32. ఇతర సంప్రదాయములు - వైష్ణవ మత ప్రభావము

33. కన్నడ వాఙ్మయము - వైష్ణవ మత ప్రభావము
34. మలయాళ వాఙ్మయము - వైష్ణవ మత ప్రభావము
35. హిందీ వాఙ్మయము - వైష్ణవ మత ప్రభావము
36 వంగ వాఙ్మయము - వైష్ణవ మత ప్రభావము
37. మహా ప్రభువులు - వైష్ణవ మత ప్రభావము
38. అష్టోత్తర శత దివ్యదేశములు - తద్విశేషములు
39. శ్రీవైష్ణవ మతము - భారత దేశము
40. శ్రీవైష్ణవ మతము - విశ్వ కల్యాణము

ఇయ్యది మేము స్థూలముగ సిద్ధము గావించిన ప్రణాళికా స్వరూపము. ఇందు సమయోచితముగా కొన్ని చేర్పులు, మార్పులు జరుగవచ్చును.

పై పట్టిక యందలి నక్షత్రము (*) గుర్తు గల వ్యాసములు కొన్ని మా కార్యాలయమునకు చేరి, ముద్రణకు సిద్ధమగుచున్నవి. శేషించిన వ్యాసములు ఇక కాలక్రమమున సమకూరవలసి యున్నవి.

ఇట్టి విశిష్ట విషయక వ్యాసములను విద్వన్మణులచే వ్రాయించి తెప్పించవలసి యున్నది. అట్టి వ్యాసములను ముద్రణానుకూలముగ తీర్చి దిద్ది, ఏ సంపుటమున ఏ యే వ్యాసము ఉండవలెనో నిర్ణయించి, వానిని క్రమబద్ధముగ సమకూర్చి, ముద్రణమునకు సిద్ధము చేయవలసి యున్నది. అటుపిమ్మట, ఆ యా సంపుటములను సర్వాంగ సుందరముగా ముద్రణము గావించి, రసజ్ఞులగు పాఠక మహాశయుల కరకమలములలో అలంకరింపజేయవలసి యున్నది.

ఇది యొక మహోద్యమము. బహు వ్యయప్రయాసలతోఁ గూడిన ఇట్టి మహోద్యమ నిర్వహణము అత్యంతము కష్టతరము.

ఇది యిట్లుండ, ఒక వైపున నిపుడు కాగితము వే
నది. ముద్రణాదిక వ్యయ మధిక మైనది. మొత్తి యొక వై
మల తిరుపతి దేవస్థానములవారి ఆర్థిక సహాయము సన్నగి
కారణములవలన, ఈ గ్రంథ ప్రచురణ మహోద్యమ మిక
కొక జటిల సమస్యగా పరిణమించినది ఇట్టిచో - ఇక
ప్రకాశము మున్ముందు కొనసాగు టెట్లు?

ఈ గ్రంథ ప్రచురణ మహోద్యమము మున్ముందు
కొనసాగవలె నన్న, రెండు మార్గము లున్నవి.

**ఒకటి :-** తిరుమల తిరుపతి దేవస్థానముల వారి
యను మాకు అతోధికముగా - గరిష్ఠ పరిమాణాముస, స
ప్రతి సంపుటమునకు అందుచుండవలెను.

**రెండు :-** శ్రీ వైష్ణవ సంప్రదాయులు, వైష్ణవా
వైష్ణవ వాఙ్మయ పరిశోధకులు, వైష్ణవ సంప్రదాయ
మన్నగు వారు మా గ్రంథమాలలో సభ్యులుగా చేరు
మున సహకరింపవలసియున్నది (సభ్యత్వ వివరములు చివ
పరిశీలింప నగును)

ఈ రీతిగా మా గ్రంథమాలకు ఇరువైపుల నుండి
చేయూత లభించినయెడల, నిర్ణీత ప్రకారము — శ్రీ రామ
కౌముదీ గ్రంథ పరంపరలో - శేషించిన పది భాగము
సర్వాంగ సుందరముగా వెలువరించి, ఆంధ్ర మహాజన
సంతర్పణము గావించి, కృతార్థులము కాగలము

అర్థించినంతనే, సంప్రదాయ గ్రంథములగు తమ త
గిడ్డ రచనలను శ్రీ రామానుజ కీర్తి కౌముదికి అందజేయ
కోవిదులకు —

ముద్రణ భాగ్యము నందిన కౌముది — భాగములను సమాలోకించి, తమ తమ అమూల్యాభిప్రాయములను అభివ్యక్తము గావించు చున్న రసజ్ఞ శేఖరులగు పాఠక మహాశయులకు —

కౌముది సంపుటములను తమ తమ పత్రికలలో — నిష్పక్షపాతముగ సమీక్షించుచున్న పత్రికా సంపాదకులకు —

సమయ సమయములలో — సముచితములైన సూచనలు చేయు చున్న సమాలోచన సమితి సభ్యులకు —

ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయము గావించిన తిరుమల తిరుపతి దేవస్థానముల వారికిని

ఇందుమూలమున మా కృతజ్ఞతాభివందనము లర్పించు చున్నాము

ప్రకాశకులు



# విషయానుక్రమణిక

చిత్రకూట దివ్య దేశమునకు మంగళాశాసన మొనరించు నటుల ఏర్పాటు చేయుట

మార్గశి మాసమున శ్రీకృష్ణస్వామినే శయ్యా బేరముగ జేయుట.

తిరుమలై నంబి సన్నిధిలో శ్రీమద్రామానుజుల కాలక్షేపము చేయుట, స్వయం వ్యక్తము లగు శ్రీ పాదములను, తత్స్వరూపమైన అళ్వారులను ప్రతిష్ఠించుట

కృపామాత్ర ప్రసన్నాచార్యు లగు శ్రీమద్రామానుజులవారు - గోవింద నామోచ్చారణతో తిరుమల నెక్కునట్లు ఏర్పాటు చేయుట.

శ్రీరామ లక్ష్మణ సీతా విగ్రహములను స్వామివారి సన్నిధిలో ప్రతిష్ఠించుట

'తిరుక్కురవై' గ్రామమున శ్రీ స్వామివారిని, కురువై నంబిని ప్రతిష్ఠించుట

'తన్నీరముదు తిరుత్తల్' అను తిరుమంజన కైంకర్యమును ఏర్పాటు చేయుట.

పరిషద్వేంక టేశ్వరులకు నిత్యారాధనాదుల నేర్పఱచుట

తిరుమలలో ననుష్ఠింపవలసిన ఆచార వ్యవహారముల కట్టుదిట్టము చేయుట.

'సేనాపతి జీయర్' అను ఏకాంగిని హనుమన్ముద్రికాదులతో శ్రీవారి కైంకర్యమును పరిపాలించుటకు ఏర్పఱచుట

తిరుపతి పట్టణమున శ్రీ గోవిందరాజస్వామి సన్నిధిలో - శ్రీ అంటాళమ్మ వారిని ప్రతిష్ఠించుట.

శ్రీ వేంకటాచలపతికిని, శ్రీ గోవిందరాజస్వామివారికిని ఐక్యమును పరిపాలించుట.

శ్రీరామానుజ పురమును నిర్మించుట.

తిరుమల అడివారమైన అళ్వారులను ప్రతిష్ఠించుట.

శ్రీ గోవిందరాజస్వామివారినిగూడ అడివారమున ప్రతిష్ఠించుట

శ్రీ వేంకటాచలపతికిని, శ్రీ గోవిందరాజస్వామికిని ఐక్యమును బోధించు ఐతిహాసిక ప్రకారములు.

౩)

శ్రీ వేంకటాచలపతి దివ్య ప్రబంధముల నాలకించు ప్రకారము.

అధ్యయనోత్సవ కాలములయందు శ్రీ వేంకటాచలపతి - దివ్య ప్రబంధము లను ఆలకించు క్రమము.

బ్రహ్మోత్సవ సమయమున సేవాకాల క్రమము.

తిరుమలలో - 'ఇయల్పా' ప్రబంధమును దప్ప, మిగిలిన యివ్వాయిర ప్రబంధమునందును తిరువేంగడ ముడయాన్ల విషయక మగు పాశురములను రెండుసారులు అనుసంధానము చేయుటకును, ఇయల్పా లోని పాశురముల రెట్టింపకుండుటకును కారణము

తిరువేంగడ ముడయానులు, శ్రీ గోవిందరాజస్వామివారును - ఇద్దఱును దివ్య ప్రబంధము కర్ణపథ విషయములనుగాఁ జేసికొను (విను) నపుడు రెట్టింప వలసిన పాశురముల అనుక్రమణిక.

వెన్నమాళై యిట్టాన్ తిరుమంటప శబ్దమునకు అర్థము

మళై కునియ నిన్ఱ పెరుమాళ్ శబ్దమునకు అర్థము

శ్రీచూర్ణ పరిపాలన సమయమున సేవాకాల క్రమము.

'దేవయాళ్ శిఱన్ ముళై' శబ్దార్థము.

'జీయర్' శబ్దార్థము.

బ్రహ్మోత్సవములో మొదటి దినమున దివ్య ప్రబంధానుసంధానము లేకుండుటకు కారణము.

తిరుమంజన తీర్థ గౌరవము.

చిన్న తిరుమల నంబిగారిని 'తోళప్పర్' అని వ్యవహరించుటకు కారణము

తిరుమలలో వలెనే తిరుపతిలోగూడ శ్రీ రామానుజ దర్శన - ధర్మములను పాలించుట

అధ్యయనోత్సవ విశేషములు.

పీఠోక్తులు సలుపు క్రమము

కట్టియము విన్నపము చేయునపుడు అనుసంధింపవలసిన శ్లోకముల క్రమము.

# శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము

*శ్రీ ప్రతివాదిభయంకర అణ్ణన్ స్వామివారి*
*సంస్కృత మూలమునకు తెలుగు అనువాదము*

'సహజ కవి - విద్యా రత్న'

## శ్రీమాన్ ప్రతివాదిభయంకర వేదాంతాచార్యులు

కౌసల్యా సుకృతోద్భవా! సకల లోకత్రాణ, రామా, హరీ!
ఆసన్నంబు ప్రభాతకాల పరసంధ్యామూర్తి యిప్పట్టునన్
వాసిన్ దైవము నాహ్నిక క్రియను సల్పం బూనఁ గర్తవ్య మెం
తో; సుప్తి స్వీడి లేవవయ్య నరశార్దూలా! మహోత్సాహివై.

* * *

గోవిందా! పరమాత్మ! మేలుకొనుమా! గోపాల! మేల్కాంచుమా!
ఓ విశ్వేశ్వర! లేవవే! గరుడ చిహ్నోపేత చంచద్ధ్వజా!
శ్రీ వేదాత్మక! శ్రీపతీ! కరుణ నిక్షేపించి లెమ్మా, వెసన్
ప్రోవన్ మంగళ సంగతిన్ త్రిభువనమ్మున్ లెమ్ము వీరాగ్రణీ!

అభయాపాదిని! సర్వలోకముల మాతా! దుర్మధు క్రూర కై
టభ సంహారి యురోవిహార సదభీష్టాత్మా! మనోలీన సం
శుభ దివ్యాకృత! ఆశ్రిత ప్రజకు సస్తోక ప్రదానేంగితా!
ప్రభువౌ వేంకటనాథు దేవి! కను విప్పన్ సుప్రభాత మ్మిదే!

అరవిందాంబక! చంద్ర మండల ప్రసన్నాన్యప్రభారంజనా!
అరవిందాసన శంక రేంద్ర వనితాభ్యస్త ప్రపూజావృతా!
హరి రూపాంతర వేంకటాద్రిపతిజాయా! ఓ దయావార్నిధీ!
త్వరలో మేల్కొను మమ్మ పృథ్వి నలరింపన్ సుప్రభాతం బిదే!

నయుతా నత్రిమహర్షి సత్ప్రకము సంధ్యావందన ప్రార్థనన్
నియతిం జేసి సురాపగా రుచిరపు న్నీరేజము ల్దెచ్చి నీ
ప్రియ పాదాంబుజ యుగ్మ పూజ కయి యిడ్డే వేచియున్నారలే!
రయత న్మేల్కొను శేషశైల పరిపాలా సుప్రభాత మ్మిదే!

భవ పద్మోద్భవ షణ్ముఖామరవరుల్ భవ్య ప్రబుద్ధాస్పదుల్
భవదీయంబు త్రివిక్రమాది చరిత్రాప్రావీణ్యమున్ మెత్తురే!
దివసంపుం బరిశుద్ధితో గురున కే దేవుండు పార్శ్వమ్మ యా
యవనీ రక్షక! శేషశైలపతి లెమ్మా! సుప్రభాతం బిదే!

ఒక యింతే వికసించినట్టి కమల వ్యూహమ్ములన్, నారికే
ళ కదంబంబులఁ, బోఁక మ్రాఁకు గమిఁ గ్రమాఁన్ లస ద్గంధ వా
హాకమై వీచెడి మందవాయు విట రమ్యం బయె, మేల్కొ మ్మహ
సకలోర్వీశ్వర! శేషపర్వత వతంసా! సుప్రభాతం మ్మిదే!

కనుదోయిన్ మనసార విప్పి, కదలీ కల్యాణపుం బండ్ల, క
మ్మని దా పాయసమున్ ముదంబు నిగుడన్ శాత్రావశిష్టమ్ములన్
ఘనమా పంకజమందు సిద్ధ మగు చిల్కల్ ప్రాసనముం జేసి పో
యిని బల్కం గనె; శేషశైలపతి లెమ్మా! సుప్రభాతం బిదే!

తంత్రు ల్లాగఁగ మంజుల స్వన వచోధార్యమ్ముగా వీణియన్
యంత్రోపాయముచేత నారదుఁడు గానాలాపముం జేయు నా
మంత్రించంగ భవ చ్చరిత్ర, కర యుగ్మంబున్ లలిన్ ద్రిప్పుచున్
తంత్రంబు ల్గని లెమ్ము శేషగిరి నేతా! సుప్రభాత మ్మిదే!

భృంగానీకములున్ సమీప సరసిన్ బె పొంటు సజ్జాత త్రో
పాంగ తర్యముల స్వయ ల్వడి మరందాస్వాదనా ఝుంకృతిన్
సంగీత ధ్వని సల్పుచున్నవి భవ త్సంసేవనాలోలతన్
అంగీకారత శేషశైలవర! లెమ్మా! సుప్రభాతం బిదే!

ఘోషా ప్రాంతము శ్రేష్ఠమైన పెరు గోహా! చిల్కు చున్నారతే
ఘోషాగారములన్! ప్రతిధ్వనులతోఁ గుంభంబు లుద్ఘోషమై
రోషావేశము గొన్నట్టి కలహారావమ్ముగా నున్నది
గ్యాభషా? అన్నటు లుండె శేషగిరిదేవా! సుప్రభాత మ్మిదే!

అల పద్మప్రియ దిద్రిక్షంజములఁ జాయంజాలు నా పట్టదా
వలు లాత్మీయ తస్సుప్రకాశమున గెల్వంగ గోరి కల్హారపు
న్నీలన త్క్రాంతినిఁ దీప్రమా ధ్వని నటన్ భేరీ నినాదమ్ము నా
నలువున్ మేల్కొనుమయ్య శేషశిఖరీశా! సుప్రభాతం బిదే।

శ్రీమంతుండవు, కోరినట్టి వరముల్ సేకూర్చు లోకాప్త! ఓ
ఆమూలాగ్ర దయారసార్ణవ నిధానా! శ్రీనివాసా! ఉర
స్స్థిమారోపిత మా గృహించి జగ త్క్షేమంకరాకార! వ
క్త్రేమున్ మేల్కొను వేంకటాచలపతీ! వే సుప్రభాత మ్మిదే!

హర వాణీశ సనందనాది యమరా త్యగ్రాధినేతల్, సరోఁజ
చరిత స్నానులు, నిర్మలాంగులను విశ్వ శ్రేయముం గూర్పఁ ద
త్పరులున్ వేత్రములన్ శరమ్ముల ధరింపం జాలి ద్వారంబు ద
గ్గఱ నున్నారలు, వేంకటాద్రిపతి వేగన్ సుప్రభాతం బిదే!

శ్రీ శేషాచల గారుడాద్రు లనియున్ శ్రీ వేంకటాద్ర్యగ్రమున్
ప్రాశస్త్యమ్మును లోక మెల్ల మఱియున్ నారాయణాద్రి స్ఫుర
ద్వైశిష్ట్యంబు, వృషాద్రి కీర్తి, వృషభ ప్రస్తుత్య శైలాఖ్య నీ
దేశంబందుని, వేంకటాద్రిపతి! ఉండెన్ సుప్రభాత మ్మిదే!

సేవాసక్తులు చంద్రశేఖర శచీ జీవేశ వహ్న్యంతకుల్
దేవార్యం బ్యాధినాయకానల ధనాధీశోత్తముల్, దిక్పతుల్
యావద్భక్తి శిరోవరస్థాయులం దర్శించిగే యంజలుల్
దేవం జెల్లును వేంకటాద్రిపతి! చాలిన్ సుప్రభాతం బిదే!

ఖగనాథుండు, మృగాధిరాజు, నటు నాగస్వామి, యా మీద - జై
త్ర గతిన్ సామజ వల్లభుండు, హయ సమ్రాట్టున్ స్వకీర్త్యవ్యయమం
దగుపించంగ ప్రభావ మెక్కువగ నిన్నర్థించియున్నారలే
జగతీపాలక ! లెమ్ము వేంకట నరేశా ! సుప్రభాత మ్మిదే !

రవి చంద్రోర్విజులున్, బుధుండు, గురు-శుక్రాచార్యులున్, సౌరి, దా
నవులౌ రాహువుఁ, గేతువున్, గ్రహ మహానాథుల్ త్వదీయాంఘ్రి కిం
జవి లీ నాఖిల దాస చరమ స్థానుల్ గదా ! లోక త
త్త్వవనా ! వేంకట భూధరేశ ! దయ లెమ్మా ! సుప్రభాతం బిదే!

భవదీయామల పాదధూళి భరిత స్ఫారోత్తమాంగానఘుల్
దివి మోక్షమ్ముల నించుకేని ననురక్తిన్నిల్వంగాలేక వే
అవు కల్పంబునఁ జూచుకొంద మని నీ ధ్యానంబునన్ భక్తులుం
ట విలోకింపుము వేంకటాద్రిప, బిడౌనన్ సుప్రభాత మ్మిదే !

పర భోగావహమైన నాకమునకో, వైకుంఠ ధామంపు టం
క్కణకో పోవుచు నీదు గోపురపు టగ్రమ్ము న్విలోకించు వా
రరయం గోరుదు రీ ధరాతలమునం దందన్ బునర్జన్మమున్
సరసీజేక్షణా ! వేంకటాచల నివాసా ! సుప్రభాతం బిదే !

శ్రీ నారీ ధరణీ మనోఽంబుజములం జెన్నారు నాథుండవే !
దీనత్రాణగుణార్ణవా ! పరముఁడౌ దేవా ! సమస్తార్థి సం
త్రాసైకాత్ర శరణ్యా ! నాగపతియున్ దార్క్ష్యుండు సేవించు పా
దానూనా ! దయ లెమ్ము వేంకట గిరీంద్రా ! సుప్రభాత మ్మిదే !

శ్రీ గంజిల్లు జనార్దనా ! పురుషులన్ శ్రేష్ఠా ! భళీ వాసుదే
వా ! రాజీవ సునాభ ! చక్రధర ! ఓ వైకుంఠ ! శ్రీమాధవా !
శ్రీరమ్యాం బగు వత్సచిహ్నా ! శరణార్థిత్రాణ నాకప్రసూ
నా ! రాగమ్మున లెమ్ము వేంకట నగేంద్రా ! సుప్రభాతం బిదే !

ప్రాతఃకాలమునందు నే నరులు సద్భక్తిన్ ప్రహృష్టాత్ములై
ఏత ద్వేంకట సుప్రభాతము స్వయం బేపార గా నిత్యమున్
జేతః ప్రీతిఁ బఠింతురో వార లని సందీపించెడున్ ముక్తికిన్
జాతుర్యమ్ముగ సూక్ష్మమా ప్రతిభయుప్రాంతంబు విశ్రాంతమై.

## శ్రీ వేంకటేశ్వర స్తోత్రము

లచ్చి చనుమొఱు కుంకుమ రంగు వలన
ఎఱుపు వారిన నీల దేహాద్య, దేవ !
సరసిజ దళోపమ విశాల చారునేత్ర !
వేంకటాద్రీశ్వరా ! నీకు విజయ మగుత !

అజ షడానన పంచాస్యు లాదిగాఁగ
సకల దైవత పరులకు సార్వభౌమ !
శరణుఁ జొచ్చినవారి రక్షక ! బలాఢ్య !
నన్నుఁ గాపాడుమా వృషనగపతి ! దయను.

హద్దు మీఱిన సహియింప నవశమైన
నేరముల నెన్నొ చేసి నేను కుమతి
నీ దయామృత దృష్టి నా మీఁద బఱపి
త్వరగఁ గాపాడుమయ్యా యో వాసుదేవ !

జనుల కోరిక లన్ని విస్తారముగను
దీర్చువాఁడవు వేంకటాధీశ ! నీవు
నిగమములు గొప్ప వేల్పుగ నిన్నుఁ బొగడు
ఎవరు నీకన్న శరణ్యు లెంచ నాకు.

గణనకును మించు గోపికాంగనలు నీదు
వేణు రవమును విని తమి వెంబడింత్రు
వంద కోటులు మరు లంత యందగాడ
నీవు తనియింతు వారి, తే రితరు లెవరు.

సర్వ జగదభిరామ ! దాశరథి ! దేవ !
ధీర ! జగదేక కోదండధారి ! ఈశ !
రఘుకులాధిప ! రామ ! శ్రీరాజ ! స్వామి !
వరముల నొసంగి ప్రోవు కృపా సముద్ర !

శ్రీ ధరాజాత మానస ప్రియుఁడ వీవు
ఇందునిభ సుందరాస్యారవిందుఁడవును
దానవాధిప నిబిడాంధకార భానుఁడవును
రాఘవా ! నన్నుఁ బ్రోవుమా ప్రాభవ యుత !

మంజులాకార ! నవనీతమాన హృదయ
అఖిల జీవాలి కనుపమ సుహృద ధామ !
గుణనిధానానుజన్మ ! అకుంఠితాస్త్ర !
నేను సేవింప నితరుల నిన్నుఁ దప్ప.

నాథులే లేరు వేంకటనాథుకంటె
ఎల్లపుడు వేంకటేశ్వరునే తలంతు
కరుణఁ బాలింపు నన్ను వేంకట నగేశ !
నాకుఁ బ్రీతినిఁ గొల్వ మనారతంబు.

నీ పదాంభోజ సేవకై నేను దూర
సీమయందుండి వచ్చి కొల్చెదను స్వామి !
ఒక్క సేవకే కలిగింపుమో కృపాచ
[illegible]

జ్ఞానహీనుండనై నేను సలిపినాఁడ
నేరముల లెక్కలేనన్ని శ్రీ రమేశ!
నన్ను మన్నింపు, మన్నింపు సన్నుతాంగ!
కరుణఁ గాపాడుమయ్య వేంకట గిరీంద్ర!

## శ్రీ వేంకటేశ ప్రపత్తి

లోకాధీశ్వర వేంకటేశ హరి యారూఢ ప్రియార్థాంగికిన్
ఆ కంజాక్షు నురో నివాసి రసికన్ వ్యాప్తంబుగా దక్షతన్
జేకూర్పంగ వలంతి, సారస కరన్, నీరేజ ధన్యాసనన్
శ్రీకాంతన్, జగదంబఁ బ్రేమమయి నేఁ జేమోడ్చి సేవించెదన్.

కారుణ్యాంబునిధీ! సమస్త జగతీ కర్తృత్వ సంధాయకా!
శ్రీ రమ్యా! నిఖిలజ్ఞ! శక్తిఖని! నిశ్శేష ప్రమాణేశ్వరా!
ధీరోదారగుణా! సమాశ్రితజనోత్తీర్యార్థ్యకల్పద్రుమా!
నీ రాజీవ పదమ్ములే శరణుగా నేఁ గొల్తు భక్తిన్ ప్రభూ!

అందె ల్దాకఁగఁ బుష్ప సౌరభము దేహం బంత వ్యాపించు నీ
చందం బెల్ల మనోహరంబె యగు, ఆబ్రహ్మాండమ్ము సంసేవనన్
బొందం జాలియు నవ్య సేవనకు సంభూతార్థమించఁగ నా
డెందం బుండు భవత్పదాలు శరణంటిన్ బ్రోవుమా మాధవా!

అవు డవుడే వికాసగతి నంది కడు గడు భాసమానమై
వివుల పరిమళంబు గల కింతగు పుష్పము లట్టివంచుఁ దా
మివుడు విశేషనం బొదవి యింపొనగూర్చెడు వేంకటేశు ధ్యే
యవుఁ జరణ ద్వయమ్ము శరణాంత మదీయ సుఖానులబ్ధికిన్.

గీతలచే నెఱుంగఁ దగు కేత సుధా కలశాతపత్రముల్
ఆతత చక్ర, మంకుశము, నంబుజ, కల్ప", శంఖ చక్రముల్
పూతముగా నల కరణి బొందినవై పరమార్థ చిహ్న సం
ప్రీతి నొసర్చు వేంకట పవిత్ర పదమ్ములు నా శరణ్యముల్.

రక్తపు రంగు గల్గు నుదరంబున నిర్జిత పద్మరాగునిన్
వ్యక్తములైన పిక్కలను భంజిలి మయ్యెడు నింద్రనీలు ను
ద్రిక్త నఖాళిచేత నవధీరిత చంద్రకళా ప్రకాండునిన్
భక్తుల ప్రాపు వేంకటుని పాదములే శరణంచు వేఁడెదన్.

చిగురుల బోలు హస్తము- చేత, భయంబున, మెత్త మెత్తగా
ఒగఁశితమైన ప్రేమ గఁదై సిరి యొత్తుచునున్నఁ గందిపో
నగు నని, చెప్పరాని, మన మందున నెన్నగరాని రమ్యతన్
దగిన వృషాచలేశ్వరు పదమ్ములు నే శరణంచుఁ గోరెదన్.

శ్రీ రామామణియున్ ధరాపతియుఁ ద చ్ఛీంబుల న్వల్గు నీ
ళా రాజీవదళాక్షి మున్నగు మహో ంణుల్ సరాగంపు సే
వా రంభమ్ముల నుండ పారికరశోణాభన్ ప్రకాశించు నీ
సారోదార పద ద్వయంబు శరణై సాయమ్ము నా కయ్యెడిన్.

అనుగిన మద్రిజాపతియు నంబుజగర్భుఁడు నాది నిర్జరుల్
వినుతిని నీకు వందనము వేడ్క నొనర్పఁగఁ దక్కి రీట సం
జనిత నవాంక రత్నములు చక్కని కాంతి నివాళిఁ జెందు నీ
ఘన పదములే శరణ్యములుగా ననిశంబును సేవఁ జేసెదన్.

తొలి వేదాంతఁ ప్రశంస సేయఁబడె నంతో విష్ణు పాదమ్ములే
అలఘు ప్రాభవమందు నన్నిటికి మిన్నంచున్ దదాస్వాదనా
ఫలమే యయ్యెడుఁ దేనె యాడి యాయయున్ 'భావ్యంబదే' యన్న నీ
పలుకుల్ హస్త పునః ప్రదర్శితము, త త్పాదంబులే సద్గతుల్.

ఇటి కర్తవ్య విమూఢబుద్ధి ననికై యి ట్రహాత్మజాం డున్నచో
'నతి గావింపు మనన్య మానసుఁడవై నా [illegible]మ్ముల్' నా వచిం
చితి, చూపించితి వర్త్మ సారథిగ , నీ శ్రేయోఽనుసంధానమౌ
హితమే చెప్పితి విప్పుడున్ , శరణు నా కేంటేశ నీ పాదముల్.

నా శిరమందుఁ గాళియ ఫణాగ్రముమీఁద, శరణాగ్రమందు, భ
క్తాశయ వేంకటాద్రి శిఖరాలయమం, ద , వేదసీమ, న
న్నాశలు మాని సంతతము నాస్యల నిన్ను స్మరించునట్టి యో
గీశులయందు వెల్గు భవదీయ పదమ్ములు నా శరణ్యముల్.

నలు దెసల న్వికాసతఁ దనర్చెన, చల్లని, వాఁడని సింతయే
గలుగని పూలు వేంకట నగమ్మునకు న్నగలైన యట్టులే
లలితము లౌచు సర్వ జనులన్ నయనోత్సవదాయకంబులై
యలరుచు నీ పదాలు శరణాగత మదీప్సిత సిద్ధి నిచ్చుతన్.

నిరతము నీదు సంస్మరణ నేర్చెడివారలు ముందు ముందుగా
నెఱుగ నవశ్యమైనదియు నెట్టులఁ దల్లుల చన్నుఁబాలగున్
చిఱుతలకున్ సుధా విధముచే నజె పోలిక లేని నిన్ను, నీ
చరణము లన్య వస్తువులు సామ్యము లేనివి నే భజించెదన్.

నతు లగు సాత్త్వికావలి ననారతి సేవ్య పదాంబుజాతునిన్
వితత భవాబ్ధినుండి ప్రజ వెల్వడఁ జేయు దయాంతసాంబకున్
హితముగ రమ్యయోగి కరుణించుచుఁ జూపిన సుస్వరూపునిన్
మతి నచలంబుగా నిలిపి మానక కొల్చెదఁ దత్పదమ్ములన్.

అపవర్గాప్తికి వేంకటాచలవరా, ఆధారమున్ బొందఁగా
నెప డింతేనియు లేనివాఁడ నెపుడు న్నీ [illegible] డి జే ద్వయైన శ్రీ
యుపయోగం బగునట్లు, ఆమె యెడబా టొక్క న్వ్వాదు నీకు లే
నమార్గుండను, దాసుఁడన్, మనువుమా, ధాత్రిక్ శిలారూపునిన్.

## శ్రీ వేంకటేశ్వర మంగళాశాసనము

మంగళము శ్రీ రమామనోమందిరునకు
సర్వ శుభ గుణ కలిత విశ్వ ప్రభునకు
శరణు గోరినవారి రక్షక నిధికిని
వేంకటాచల శ్రీనివాసాంకునకును.

మంగళము మంగళాకార మా ముఖంబు
అందమైనట్టి కనుబొమల్ విందు గొలుప
నందమునఁ జూచు సుందర నయనునకును
వేంకటేశు నఖిలోర్వి వీక్షకునకు.

వేంకటేశ్వర శృంగార వీధులకును
మంగళాకార భూషణ మండితంపుఁ
బాదునకు, సర్వమంగళవాసునకును
మంగళము శ్రీనివాస శుభాంగునకును.

తనదు సర్వాంగ సౌందర్య ధనముచేత
నిఖిల జీవాలి మోహన నిపుణుఁడైన
వేంకటాచలవాసి సర్వేశ్వరునకు
మంగళము నిత్య మగుత యభంగురముగ.

లయము గానట్టివాఁడు, కళంక రహితుఁ
డనవరత నిత్య మోద చిదన్వితుండు
సర్వ లోకాంతరవ్యాప్తి సాధకుండు
వేంకటేశుండు మంగళ విభవుఁ డగుత!

సర్వ మెఱింగినవాఁడును సర్వశక్తి
యుతుఁడు, సర్వసమృద్ధుఁడు సర్వపతియు,
సులభసాధ్యుండును, సమస్త సుగుణరాశి
వేంకటేశుఁడు మంగళోపేతుఁ డౌత !

మహిత పరమాత్మరూప సమ్మాన్యశీలి
ధ్యేయ పరమాత్మ, పరతత్త్వ దీపితుండు
పూర్ణవాంఛా సమేతుఁడు, భోగుఁడైన
శ్రీనివాసుఁడు మంగళ సిద్ధుఁ డగుత !

నిరతమును గాంచుచుండినఁ గఅవృదీఱఁ
దనివిఁ బొందని యమృతంపు ధారఁ గలుగు
భువన మోహన రూపుఁడౌ నవని పతికి
శ్రీనివాసునకున్ శుభశ్రీ యలరుత !

ఉర్వి గల జీవకోటి కఖర్వమైన
రక్షకుఁడు దాని యాఁచుఁ గరమ్ముచేత
దయను దన పాపమాఁకఁ జూపు ధరకి నేత
వేంకటేశుఁడు జయమును వెల్గుగాత !

కృప యనెడు స [illegible] ప్ర [illegible] హొపుఁ గ [illegible] ంగి
ములను బోలిన చల్లని లలిత వీక్ష
ణముల భువిఁ జల్లఁబఱచు ననంతుఁడైన
శ్రీనివాసుఁడు మంగళాశేషుఁ డౌత !

ప్రసవ మాలయుఁ బీతాంబరంబు నాయు
ధములు ధరియించు దివ్య సుందర మనోహ
రపు స్వరూపుఁడు; వెతల సర్వమును బాపు
వేంకటేశునకును శుభావృత్తి యగుత !

సిరుల విలసిల్లు వైకుంఠపురము వీడి
స్వామి పుష్కరిణీ తీరమందు నిలుగుచు
శ్రీ రమారమణిం గూడి క్రీడాలోలుడై
వెలయు వేంకటపతికి నివ్వేళ శుభము.

మణవాళ మహాముని స్వా
దనమున కెనసి పవిత్ర భావంబున, విశ్వం
బునకగు జీవుని పని కొ
ననికింగను వేంకటేశు డొసగు శుభతన్.

⁜ ⁜ ⁜

మంగళ పరంపర సమ్పత్తి
సంగము గురుపూర్వ గురుల సంతతి యెల్లన్
సంగతు లెవ్వని సేవా
భంగిమ నా శ్రీనివాసు నరుసుగ శుభమౌ !

శుభాకాంక్ష

శ్రీరామోపమ వేంకటేశు కృప వర్థిల్లంగ భక్తాళికిన్
పారంపర్య ఘన ప్రభావ్యత మనోహారంబుగా సేకూర్చుచున్
సారోద్భాసిత లోకసంగ్రహ మనీషా సస్య సంపత్తితో
'శ్రీ రామానుజ కీర్తి కౌముది' యవిచ్ఛిన్నంబుగా సాగుతన్ !



# ఆళ్వారుల తాత్త్విక దృక్పథము

'విద్యా భూషణ - కవితా విశారద'

## శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

### శ్రీ రామానుజ కీర్తి కౌముది సంపాదకులు



అఖండ భూమండలములో మన భారత ఖండము అధ్యాత్మ విద్యకు ఆలవాలమై యున్నది. ఈ ఖండమున బ్రహ్మ జ్ఞానము ప్రతి యుగమునందును విశేషముగ ప్రకాశించుచునే ఉన్నది. అట్టి జ్ఞాన ప్రకాశము వల్లనే భారతీయులగు ఋషులూ, మునులు, ధర్మాత్ములు, దార్శనిక వేత్తలు శాంతిని, ఆనందమును పొందగల్గిరి. 'లోకో భిన్న రుచిః' అనునట్లు - బ్రహ్మ జ్ఞాన ప్రాప్తికై, వారి వారి యభిరుచులను బట్టి, అనేకులు అనేక మార్గముల ననుసరించిరి. వారి వారి యనుభవములను ఆధారముగ వించుకొని, దర్శన శాస్త్రములను రచించి, వివిధ సంప్రదాయముల లోకమున నెలకొల్పిరి ... వివిధ సిద్ధాంతములకు ఆదిమ ఆచార్యులలో కొందరు - ఉపనిషత్తులు, గీత లనబడు ప్రస్థాన త్రయమునకు భాష్యములు రచించి, తమ తమ సంప్రదాయములకు పరిపుష్టిని చేకూర్చిరి. ఈశ్వరుడు, జీవుడు, జగత్తు, మాయ అన్నగు విషయములను గురించి తమ తమ సిద్ధాంతములను వ్యక్తీకరించు గ్రంథము లనేకములు రచించిరి.

భక్తుడగువాడు తత్త్వ శాస్త్రములను పరిశీలించు టావశ్యకము కాదు. అతడు భక్తిలో పరాకాష్ఠ నందుచున్న కొలదియు - ఈశ్వరుడు, జీవుడు, జగత్తు, మాయ మున్నగు విషయములకు సంబంధించిన విశేషములను అప్రయత్నముగనే గ్రహింపగల్గును. కాని,

ఆతని మనస్సు మాత్రము తత్త్వశాస్త్రముల వైపుకు మరలదు. ఇదియే భక్తునకు, దార్శనికునకు గల భేదము.

ఆళ్వారులు సహజముగ దార్శనికులు కారు. వారు కేవలము భగవద్భక్తులు, రససిద్ధులగు మహాకవులు. వారి లక్ష్యము దార్శనిక సిద్ధాంత వివేచనము కాదు. భక్తి ప్రపత్తులతో నిరంతరము భగవంతుని కల్యాణ గుణములను ప్రస్తుతించుచు, బ్రహ్మానందము నందుచుండుటయే వారి జీవితపరమార్థము. భగవద్భక్తిలో తన్మయులైన ఆ మహనీయుల హృదయ తంత్రులనుండి స్పందించిన గీతముల సముదాయమే నాలాయిర దివ్య ప్రబంధము. ఆ దివ్య ప్రబంధములలో - బ్రహ్మ, జీవుడు, జగత్తు మొదలగు విషయములను గురించి, సిద్ధాంత పరమైన చర్చ కానరాదు. కాని, ఆళ్వారుల దివ్య ప్రబంధములలో ఆనుషంగికముగ అట నట తాత్త్విక వివేచనము చోటు చేసికొనియే యున్నట్లు మనము గ్రహింపవచ్చును.

ఆళ్వారుల దివ్య ప్రబంధములు కేవలము భక్తి భావ ప్రబోధకములైనవి. కనుకనే, ఆ దివ్య ప్రబంధములందలి పాశురములలో ఈశ్వరుని గురించి నిరూపింపబడినది[1]. ఆళ్వారులు ఈశ్వరుని పరబ్రహ్మముగ భావించిరి. వారి తాత్త్విక దృష్టి సువిశాలమైనది. అది వారి దివ్య ప్రబంధములందే స్పష్టముగ గన్పట్టును.

1. "The Alvars provided the Soil out of which Ramanuja's teaching naturally sprang and in which later it Could bear frint He is not really '(as been erroneously asserted) the 'morning star' of Bhakti movement, that is a name far more fitly given to Alvars but in him Bhakti shines in the full spledour of a great Philosophical Exposetion"

— *'The Hymns of Alvars' p. p. 7, 8.*
— **J S M. Hooper.**

ఆళ్వారుల యుగము తరువాత ఆచార్యుల యుగ మారంభ మయ్యెను. ఆచార్యులలో - నాథ, యామున, రామానుజాదులు ముఖ్యులు. అట్టి ఆచార్యులపై ఆళ్వారుల తాత్త్విక దృష్టి ప్రభావము విశేషముగ ప్రసరించినదని మనము నిశ్చయముగ భావింపవచ్చును. కారణ మేమన, ఆళ్వారుల భక్తి సిద్ధాంత మంతయు ఆచార్యుల వాఙ్మయమందు కానవచ్చును. కావున, ఆచార్యులచే గావింపబడిన ప్రచార ప్రబోధములకు ఆళ్వారుల దివ్యప్రబంధములే ప్రధానాధారము లగుట నిర్వివాదాంశము. ఆ దివ్య ప్రబంధములందుఁ గల ఆళ్వారుల తాత్త్విక దృక్పథమును సావధానముగ పర్యాలోకించిన యెడల, అపూర్వములైన రహస్యములు పెక్కుము లనేకములు మనకు కానవచ్చును.

పరబ్రహ్మ :-

ఆళ్వారు లెల్లరు పరబ్రహ్మ రూపమును, గుణములను వర్ణించియే యున్నారు. కాని నమ్మాళ్వారులు, తిరుమంగై యాళ్వారులు వర్ణించినంత విస్తారముగ నితరు లే యాళ్వారులును పరబ్రహ్మను గుఱించి వర్ణించి యుండలేదు.

ఆళ్వారు లందఱును సహజముగ విష్ణు భక్తులే. ఇందువలన, వారికి విష్ణువే ఆరాధ్య దైవ మని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. కృష్ణుఁడు విష్ణుని యవతార మనియే వారు భావించిరి. ధర్మ సంరక్షణార్థము అవతారములు ధరింపఁగల ఆ విష్ణు భగవానుఁడే పురుషోత్తముఁ డనియు, అంతర్యామి యనియు, అనేకాంశరూపములను, కళారూపములను మాత్రమే గాక, మఱికొన్ని రూపములను కూడ ధరించు ననియు, తాను బ్రహ్మయే యైనను - భక్తుల నుద్ధరించుటకు దేహమును ధరించుచుండె ననియు, అతఁడే అక్షర పరబ్రహ్మ మనియు ఆళ్వారులు తెలిపియున్నారు. అదియునుఁగాక, బ్రహ్మ - రస స్వరూపుఁ

డనియు, భువన సుందర మూర్తి యనియు మహానీయు లభివర్ణించుచు, ఆ బ్రహ్మను సగుణునిగా - నిర్గుణునిగా రెండు విధముల భావించిరి

ఆళ్వారుల దృష్టిలో బ్రహ్మ - సర్వశక్తిమంతుఁడు, అద్వితీయుఁడు, దేవత లందఱికంటెను శ్రేష్ఠుఁడు (అధికుఁడు). ఈ యంశమును నమ్మాళ్వారులు విశదీకరించుచు, 'నా స్వామియే సర్వలోక రక్షకుఁడు, అతఁడే శ్రేష్ఠుఁడు. భగవంతునితో మఱియొకరిని పోల్చవలె నన్న, పరికిని తరము కాదు. బ్రహ్మరుద్రేంద్రాదు లందఱికిని అతఁడే ప్రభువు. అతఁడే పరంజ్యోతి, జగత్కారణభూతుఁడు, గోవిందుఁడు. అతని గుణములను నేను వర్ణింపఁజాలను.[2] అతఁడు మహాత్మునంటె మహాత్ము, పరబ్రహ్మ, కల్యాణగుణాకరుఁడు, దయాసముద్రుఁడు. అతనిని వేదములు వేనోళ్ళ కీర్తించుచున్నవి. అతఁడే సర్వజ్ఞుఁడు.[3] అతఁడే చిదచిత్తులకు[4] ఆధార భూతుఁడు.[5] అతఁడు

2 తిరు వాయి మొళి. 3 - 1 - 3

3. "యాపై యుమ్ యవరుమ్ తానాయ్ అవవర్ కమయన్దోఱుమ్
తోయ్ విలన్పులనైన్దిక్కుమ్ శొల్లప్పడానుణర్విన్మూర్త్తి
ఆవిశేరు యురినుళ్ళాల్ ఆదుమోర్ ఎత్తిలాద
పావనై యదనై క్కూడిల్ అవనైయుఙ్గాదలామే."

—తిరువాయి మొళి 3-4-10

4. "మణ్ణుమ్ నీరుమ్ ఎరియు నల్వాయుమ్
విణ్ణుమాయ్ విరియుమ్ ఎమ్బిరానైయే"

—తిరువాయి మొళి. 1-10-2

5. "The idia of Brahman as the adhara of cit - acit (చిత్ - అచిత్) is the life - blood of Visistadvaita."

— *'The Philosophy of Visistadvaita', P. 121*
**— P. N. Srinivasachari.**

దేవ దేవుఁడు. అతఁడే మూల్లోకములందును సృష్టి స్థితి లయములఁ జేయుచున్నాఁడు' [6] అని, బ్రహ్మయే సర్వమునకును మూల కారణముగాఁ దెలిపియున్నారు. ఇట్లే తిరుమళిశై యాళ్వారులుకూడ బ్రహ్మను గుఱించి ప్రస్తావించుచు, పరబ్రహ్మ ఒకఁ డున్నాఁడు. అతఁడే సర్వ భూతములకును ఆధార భూతుఁడు అతని మహిమ వర్ణనాతీతము. [7] ఆ భగవానుఁడే ఆది పురుషుఁడు. అతఁ డొక్కఁడే అంతమునందును మిగిలియుండువాఁడు' [8] అని తెలిపిరి తిరుమంగై యాళ్వారులు బ్రహ్మను గురించి వివరించుచు, 'వేదముల సారమే భగవానుఁడు.[9] అతఁ డందఱికంటెను ఆద్యుఁడు.[10] అతఁడే యంతము

6 "ఎఙ్గళ్ శెల్ శార్వు యామదై యముదమ్ ఇమైయవరప్ప శేర్న్దున్
పొఙ్గు మూవులగమ్ పడైత్తి శత్తళిక్కుమ్ పొఱున్దు మూర్తి నెన్మరువన్
శెఙ్గయలుగళుమ్ తేమ్పణైపుడై శూళ్ తిరుచ్చెఙ్గుణ్ణూర్ తిరుచ్చిత్త
అఙ్గమర్ కిన్ఱ ఆదియాన్ నల్లాల్ యావర్ మత్తిన్నమక్ తుణైయే"
— తిరువాయిమొళి : 8 - 4 - 3.

7 "తేరుఙ్గాల్ తేవన్ ఒరువనే యెన్నురెప్పర్
అఱుమఱియాదవన్ పెరుమై - ఓరుమ్
పొరుళ్ ముడివు మిత్తనైయే యెత్తవమ్ శెయ్దార్క్కుమ్
అరుళ్ ముడివ తాదియాన్ పాల్."
— నాన్ముగన్ తిరువన్దాది : 2

8 "ఆదియాన వానవర్క్కుమ్ అణ్ణమాయ వప్పుఱత్తు
ఆదియాన వానవర్క్కుమ్ ఆదియాం వాదని
ఆదియాన వానవణర్ అన్దకాల నీయురైత్తి
ఆదియాన కాలనిన్నై యావర్ కాణవల్లరే."
— తిరుచ్చన్ద విరుత్తమ్ : 8

9 "వన్ను నాన్మఱైప్పల్ పొరుళాగియ పనిదమ్"
.. పెరియ తిరుమొళి 8 - 1 - 2

10. "నీది యాగియ వేదమాముని యాళర్ తోత్తమురైత్తు
మత్త వరుక్కు ఆదియాయిరున్దాయ్"
— పెరియ తిరుమొళి 8- 5 - 8

సంశయను మిగిలియుండువాఁడు-'అతఁడే సర్వలోక రక్షకుఁడు'[11] - అని, బ్రహ్మను బహు భంగులుగా వర్ణించియున్నారు. పెరియాళ్వారుల యిష్ట దైవ మగు కేశవుఁడు - పురుషోత్తముఁ డగు భగవానుఁడు, పర జ్యోతి స్వరూపుఁడు.[12] అతఁడే సర్వాధికుఁడు; దేవదేవుఁడు, సర్వలోక రక్షకుఁడు,[1] క్షీరసాగరమున పవళించియుండు పరబ్రహ్మము. అతఁడే జగత్తును సృష్టించుటకు బ్రహ్మను సృజించెను[14] సంహరించుటకు యముని సృజించెను. ఆ పరబ్రహ్మయే జగత్కారణము, అవినాశి, పరమ పురుషుఁడు.[15] నాల్గు వేదములందును భగవానుఁడే వర్ణింపఁ బడియున్నాఁడు. అతఁడే దేవాదిదేవుఁడు[16] చేతనాచేతనముల

11. "కన్దమాయ్ చ్చమయమాగిచ్చమవై మ్మూదమాగి
అన్దమాయిాది యాగి అఱుమఱై యల్లై యుమానాయ్ "
— పెరియ తిరుమొళి 4 6 - 9.

12 "కేశవా ! పురుషోత్తమా ! కిళర్ శోదియాం !"
.... పెరియాళ్వార్ తిరుమొళి . 4 - 4 - 10.

13. "... . తేవర్‌గళ్ నాయకనే ! ఎమ్మానే
ఎణ్ణ లెన్నుడై యిన్నముతే - ఏళులకు ముడై యాయ్ ఎన్నప్పా "
. పెరియాళ్వార్ తిరుమొళి : 4 - 10 - 7.

14 "పైయర వినవై ప్పొఱ్కడలుళ్ వెళ్ళి కొళ్గిన్ఱ పరమమూర్తి
ఉయ్యవులకు పడైక్కవేణ్టి ఉన్దియిల్ తోత్తినాయ్ నాన్ముకనై
వైయమనిఱై ప్పొయ్యున్దె కాలనై యు ముదనే పడైత్తాయ్."
.... పెరియాళ్వార్ తిరుమొళి 4 - 10 - 5

15. "ఊళి యాయినాయ్ ఆళి మున్నేన్తి
తమ్బమా కరికోళ్ విడుత్తానే
కారణా కడలై క్కడైన్దానే ఎమ్బిరాన్."
. పెరియాళ్వార్ తిరుమొళి : 5 - 1 - 9.

16. నాచ్చియార్ తిరుమొళి : 4 - 10

కన్నింటికిని అతఁడే కారణభూతుఁడు. అతని దివ్య శక్తిని పరిపూర్ణ ముగఁ దెలిసికొనుట ఎంతటివానికేని సాధ్యము కాదు. అతఁడు సత్య స్వరూపుఁడు'[17] అని బ్రహ్మను ఆండాళ్ అభివర్ణించెను. దేవతలను, రాక్షసులను సృష్టించినది భగవానుఁడే. అతఁ డందఱిచేతను స్తుతింపఁదగినవాఁడు.[18] అతఁ డట్టి దివ్య శక్తిసంపన్నుఁడు కనుకనే, 'బ్రహ్మరుద్రేంద్రాదు లతనిని స్తుతించుచున్నారు వేదము లన్నియు ఆ భగవానుని మహిమలనే కీర్తించుచున్నవి'[19] అని కులశేఖరాళ్వారు బ్రహ్మయొక్క ప్రభావమును వర్ణించిరి.

బ్రహ్మము సగుణ నిర్గుణ రూపములు రెండును కలవని ఆళ్వారుల నిశ్చితాభిప్రాయము. ఆ బ్రహ్మకుఁ గల విశుద్ధ ధర్మాశ్రయత్వమే ఇందుకు కారణ మని ఆళ్వారులు భావించినట్లు ద్యోతక మగును.

నా స్వామి అంతర్యామియై, అంతటను వ్యాపించియున్నాఁడు. దేవ లోకమునకు, మనుష్య లోకమునకు అతఁడే యధిపతి. మిత్రుల కంటెను, శత్రువులకంటెను అతఁ డతీతుఁడు, అమృత స్వరూపుఁడు,

---

17 "ఎప్పొరుక్కుమ్ నిన్ఱార్క్కుమ్ ఎయ్‌తాతు - నాన్మఱైయిన్
శొఱ్పొరుళాయ్ నిన్ఱార్ ఎన్ మెయ్ప్పొరుళుమ్ కొణ్డారే "
. నాచ్చియార్ తిరుమొళి : 4 - 10

18 "తేవరైయుమ్ అసురరైయుమ్ తిశైకళైయుమ్ పడైత్తవనే
యావరుమ్ వన్దు అడివణఙ్గ అరంగ నగర్తు ఇన్టవనే "
.. పెరుమాళ్ తిరుమొళి 8 - 10.

19 "పిఱైయేఱు శడైయానుమ్ పిరమనుమ్ ఇన్దిరనుమ్
ముఱ్ఱైయుమాయ్ పెరువేళ్విక్కు ఱై ముడిప్పాన్ మఱైయానాన్ "
.. పెరుమాళ్ తిరుమొళి : 4 - 8.

నా రక్షకుఁడు ఆగేఁడు తన సగుణ రూపమున తిరునగరిలో విరాజిల్లు చున్నాఁడు'[20] అని నమ్మాళ్వారులును –

భగవంతుని రూపమును ఎవరేని తెలియఁజాలరు[21]. అతఁడు ఈశ్వరుఁడు పృథివి, ఆకాశము, దిశలు, వేదములు, వేదాంగములు మున్నగున వన్నియు అతనిలో అంతర్నిహితములై యున్నవి. అయినను ఆశ్చర్య మేమనఁ, అట్టి భగవాఁడు నా హృదయ సీమయందే నివసించు చున్నాఁడు'[22] అని పేయాళ్వారులును – భగవానుఁడు అంత ర్యామిగా నున్నాఁడు. ఆతని నెవఁడు స్మరించునో, అట్టి భక్తుని మనస్సునందే ఆ భగవానుఁడు నివసించును.'[23] భక్తుఁడే రూపము న

20 "నల్గు వుమ్ శెల్వుమ్ నరకుమ్ శువర్క్కు ముమాయ్
వెల్ పకైయుమ్ నట్పుమ్ విడము ముముదమాయ్
పల్ పగైయుమ్ పన్ద పెరుమా నెన్నైయాళ్ వానై
శెల్వమ్మలి కుకడి త్తిరువిణ్ణకర్ కణ్డేనే"

.... తిరువాయిమొళి. 6 - 3 – 1

21 "నిఱమ్ వెళితు శెయితు పశితు కిది తెర్ది
ఇఱై యురుఃమ్ యామఱియోమ్ ."

.... మూన్ఱామ్ తిరువన్దాది

22 "ఇఱైయాయ్ నిలనాకి యెణ్డిశైయుమ్ తానాయ్
మఱైయాయ్ పఱైప్పొరుళాయి వానాయ్ – పిఱై వాయిన్ద
వెళ్ళత్తరువి విళక్కొనిర్ వేఙ్గడత్తాన్
ఉళ్ళత్తి న్ఉళ్ళ యుళన్ "

... మూన్ఱామ్ తిరువన్దాది 39

23 "ఉళన్ కణ్డాయ్ నన్నెఞ్జే ఉత్తమనెన్ఱుమ్
ఉళన్ కణ్డాయ్ – ఉళ్ళువారుళ్ళత్తు – ఉళన్ కణ్డాయ్"

.. ముదల్ తిరువన్దాది. 99

నుపాసించిన ఆ రూపమునసే భగవానుఁడు సాక్షాత్కరించును[24] అని పొయిగై యాళ్వారులును సగుణ బ్రహ్మమును అనేక విధములు అభివర్ణించిరి

ఆనంద స్వరూపము :

ఆళ్వారులు పరబ్రహ్మమును ఆనంద స్వరూపునిగా, రస స్వరూపునిగా భావించిరి.[25] తమ యిష్ట దైవమగు కృష్ణ భగవానుఁడు భువన సుందరమూర్తియని పెరియాళ్వారులును,[26] భగవానుఁడు ఆనందమయుఁడనియు, రస స్వరూపుఁడనియు తిరుమంగై యాళ్వారులును,[27] అమృత తుల్యముగాఁ గల రస స్వరూపుఁడగు భగవానుని దర్శించిన తమ నేత్రములు వేఱొక వస్తువును చూడ నొల్లవని తిరుప్పాణాళ్వారులును[28] తెలిపియున్నారు.

---

24 "చాత్తినుమ్ వైత్తుమ్ తొళవర్ - ఉలకళన్ద మూర్త్తియురువే ముదల్ "

... ముదల్ తిరువన్దాది 14

25. "Visistadvaita' is thus the only philosophy of religion that recognises the eternal value of beauty and difines Brahman as the beautiful and blessful "

— *'The Philosophy of Visistadvaita' P. 219*

— **Prof : P. N Srinivasachari.**

26. "వణ్ణమ్ ఆళగియ నమ్బి "

.. పెరియాళ్వార్ తిరుమొళి : 2 _ 4 _ 6

27. "పావినై పచ్చైత్తేనై పైమ్పొన్నై ..."

.. తిరుక్కురున్దాణ్డకమ్ : 6

28. "అణ్డర్ కోన్ అణియరఙ్గన్ ఎన్నముదినై కణ్డ కణ్గళ్ మత్తొన్ఱినై క్కాణావే "

— అమలనాది పిరాన్ : 10

## అవతార రహస్యము :

పరబ్రహ్మ యగు విష్ణు భగవానుఁడు - లోకోద్ధరణార్థము ప్రతి యుగమందును వివిధ రూపములలో అవతారములు ధరించు చుండునని ఆళ్వారులు స్పష్టీకరించిరి భూమండలమున అధర్మము వ్యాపించినపుడును, అజ్ఞానాంధకారము ధరాతలము నాక్రమించినపుడును - కృపాసింధు వగు భగవానుఁ డవతరించును. కనుక, ద్వాపర యుగమున విష్ణువు కృష్ణుఁడుగా నవతరింపవ సివచ్చెను. అట్టి కృష్ణ భగవాని భువన మోహన సౌందర్యము, విచిత్ర లీలలు ఆళ్వారులను విశేషముగ నాకర్షించెను కృష్ణుఁడు ఆళ్వారులకు ఇష్ట దైవ మయ్యెను. వారు తమ యిష్ట దైవ మగు కృష్ణుని యవతార కారణములను వివరించుచు -

'స్వర్గ లోకమునఁ గల దేవతల బాధలను నివారించుటకును,[29] పృథ్వివి, పృథ్విపైఁ గల మానవులను సముద్ధరించుటకును, భూ భారమును తగ్గించుటకును,[31] భూదేవియొక్క కష్ట పరంపరలను దూర దూరము గావించుటకును,[32] దేవతల ప్రార్థనపై - బంధువులను వేధించు కంసుని వధించుటకును,[34] క్షీరసాగర వాసుఁ డగు విష్ణుభగవానుండు కృష్ణుని రూపమున నవతరించెను' అని, కృష్ణుని ధర్మ రక్షణ కృత్యమును వర్ణించిరి.

---

29 పెరియాళ్వార్ తిరుమొళి . 4 - 9 - 3

30 పెరుమాళ్ తిరుమొళి : 1 - 10

31 పెరియ తిరుమొళి · 2 - 10 - 8.

32. పెరియ తిరుమొళి : 8 - 8 - 9

33. తిరువాయిమొళి · 6 4 - 5.

34 తిరువాయిమొళి 3 - 5 - 5

## పంచావతారములు :

ఆళ్వారుల భక్తి వాఙ్మయమును బాగుగా పరిశీలించినచో - భక్తులుపాసించుటకు అనువుగా, భగవానుఁడు అయిదు రూపములు ధరించియున్నట్లు తెలియఁగలదు. అవి - పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారములుగా ప్రసిద్ధములు.

౧. *పరబ్రహ్మ రూపము* :- పరబ్రహ్మ అమరుఁడు, ఆదిపురుషుఁడు,[35] దేవతలలో నగ్రగణ్యుఁడు,[36] ముని జనులు మున్నగువారాతని స్తుతించుచున్నారు.[37] అతఁడు పవిత్రుఁడు, మహా మేధావి, పరమాత్మ, కల్యాణ గుణములతోఁగూడిన మహనీయుఁడు. అతఁడే స్తుతిపాత్రుడు[39] అని, ఆళ్వారులు పరబ్రహ్మ రూపమును వ్యక్తీకరించిరి.

---

35 అమలనాద పిరాన్

36. "మూవరిల్ ముదల్వనాయ ఒరువనై."

తిరుక్కురున్దాణ్డకమ్ : 6

37. " . విణమియ మునివర్ విళుఙ్గుం కోదిలిన్ నిన్నై .. "

పెరియ తిరుమొళి : 2 - 3 - 2

38 "పల్లాణ్డెన్ఱు పవిత్తిరనై ప్పరమేట్టియై శార్ఙ్గ మెన్నుమ్
విల్లాణ్డాన్ తన్నై విల్లిపుత్తూర్ విట్టుచిత్తన్ విరుమ్బియశొల్
నల్లాణ్డెన్ఱు నవిన్ఱురైప్పార్ నమో నారాయణాయ వెన్ఱు
పల్లాణ్డుమ్ పరమాత్మనై చ్చూళ్న్దిరున్దేత్తువర్ పల్లాణ్డే"

.. తిరుప్పల్లాణ్డు· 13

39 "పఱ్ఱిలుమ్ పఱ్ఱైయాది పోవనీఱ్ణై క్కోన్ఱు
ఉఱ్ఱిలు మొరుత్తి తన్నై వెత్తు కన్దదత్తియుమ్
నఱ్ఱిఱమ్ నత్తనాద జ్ఞానమూర్త్తియాయినాయ్
ఒరుత్తరుమ్ నినాదు తన్మై యిన్నదెన్న వల్లరే "

తిరుచ్చన్ద విరుత్తమ్ : 2

౨. వ్యూహ రూపము :- పరమాత్మ త్రివిధ వ్యూహము లను ధరించియున్నట్లును, ఆ పరబ్రహ్మము వేదములచే స్తుతింపఁబడు చున్నట్లును కులశేఖరాళ్వారులు బ్రహ్మయొక్క వ్యూహ రూపమును తమ దివ్య ప్రబంధమున వర్ణించిరి [40] ఇట్లే, నమ్మాళ్వారులును ఆరంభమున బ్రహ్మయొక్క దివ్య రూపము త్రివిధములుగా నున్నట్లు తెలిపిరి.[41]

౩. అంతర్యామి రూపము :- ఈ క్రింద పొందుపరుపఁబడిన ఆళ్వారుల శ్రీసూక్తులు - బ్రహ్మయొక్క అంతర్యామి రూపమును వ్యక్తీకరించుచున్నవి

'శరీరమున ప్రాణతుల్యముగా నుండు భగవానుఁడు '[42]

'ఆ భగవానుని స్మరించినవారి హృదయమునందే అతఁడు నివసించును '[43]

'నా రూపమువంటి రూపమునే తానును ధరించు నా తండ్రి.'[44]

౪ విభవ రూపము .- ఇయ్యది - భగవానుని వివిధ అవతారములకు సంబంధించినవి. అట్టి యవతారములను ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో వర్ణించిరి

---

40 "మనివన్ మూర్తిమూవరాగివేఁదమ్ విరిత్తరైత్త వనిచమ్ "

— పెరియ తిరుమొళి : 2 - 2 - 8

41. "ముదలామ్ తిరువురువమ్ మూన్రెన్బర్ "

— పెరియ తిరువన్దాది 72

42 "ఉడ న్మిశైయు యిరెనక్కరన్దు ఎఙ్గుమ్ పరన్దుళన్ "

— తిరువాయి మొళి 1 - 7 - 7

43 "కైదై తన్నుళ్ మున్ది నిన్ఱర్ "

— పెరియ తిరుమొళి 4 - 9 - 9

44 "తన్నురువమొ న్నురునిల్ నిన్ఱ వెన్దై "

— తిరునెడున్దాణ్డకమ్ 1

౫. అర్చా రూపము :- ఈ రూపమున బ్రహ్మ-ప్రతిమలలో నివసించును. కనుకనే, ఆళ్వారులు - వివిధ క్షేత్రములందుఁగల ఆల యము లందలి భగవ ద్విగ్రహములను బ్రహ్మయొక్క అర్చా రూప మునందే సంభావించిరి [45]

'వేదము లెవనిని వర్ణించుచున్నవో, దేవత లెవనిని స్తుతించు చుండిరో, మత్స్య కూర్మావతారముల నెవఁడు ధరించెనో, అట్టి భగ వానుఁడు - 'అట్ట పుయకరమ్' అను దివ్యక్షేత్రమందుఁ గల ఆలయ ములో నివసించుచున్నాఁడు.[46] వరహావతారమును ధరించినవాఁడును, మూల్లోకముల నాక్రమించినవాఁడును అగు భగవానుఁడు - 'చీరామ విణ్ణగర్' అను దివ్య క్షేత్రమున విరాజిల్లుచున్నాఁడు'[47] అని తిరు మంగై యాళ్వారులును —

45 "The Visistadvaita equates the Brahman and the antaryamin of the upanishads with Vasudeva of the Pancharatra, the Bhargavanof the Puranas the Avataras of the Itihasas and the archa ( అర్చ ) of the Alvars"

— *'The Philosophy of Visistadvaita' P 162.*

— **P N. Srinivasachari.**

46 " .. ... వేదమురై త్తి మెయోర్ వణఙ్గుమ్ ...
ఏన్దు కురురువాయ్ నిమిర్న్దు మూవలి వేళ్వియుళ్ మణ్డకన్ద
అన్దణర్ పోర్ట్రినార్ కోయిల్ అట్టపుయకర త్తే నెన్డారే."

— పెరియ తిరుమొళి . 2 - 8 - 2

47 'ఒరుకురళాయిరుసిలమ్ మూవడిమణ్ వేణ్డి
ఉలగనై త్తు మీరడియా లొడుక్కి ఒన్డుమ్

— పెరియ తిరుమొళి 3 - 4 -

వేదములచే వర్ణింపఁబడు బ్రహ్మ - తిరుమాలిరుంశోలై అను దివ్య క్షేత్రమునందలి ఆలయములో విరాజిల్లుచున్నాఁ'[48] డని సమ్మాళ్వారులును బ్రహ్మయొక్క అర్చారూపమును వర్ణించిరి.

## విరాట్ రూపము .-

'బ్రహ్మ' అను శబ్దముయొక్క ధాత్వర్థము (బృహి వృద్ధౌ)వలన, ఆ పరబ్రహ్మ యొక్క గొప్పతనము అభివ్యక్త మగుచున్నది. అట్టి గొప్పతనము గలవాఁడు గనుకనే అతఁడు - ఋగ్వేదాంతర్గతమైన పురుష సూక్తమునందును, ఉపనిషత్తులందును, గీతాశాస్త్రమందును విరాట్ పురుషుఁడుగా వర్ణింపఁబడి యున్నాఁడు. ఆ విరాట్ పురుషుని ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో తనివిదీర వర్ణించిరి.

కృష్ణుఁడు మృత్తికా భక్షణము గావించినపుడు యశోద కోపించినది. మృత్తికను భక్షింపలే దనినాఁడు కృష్ణుడు. నోరు తెరచి చూపు మని గర్జించినది తల్లి. గత్యంతరము లేక కృష్ణుఁడు నోరు తెఱచి చూపినాఁడు. ఈ సన్నివేశమును పెరియాళ్వారులు తమ దివ్య ప్రబంధమున రసవత్తరముగా వర్ణించుచు, శ్రీకృష్ణుని వాక్కునుండి లోకముల ననేకములు దర్శింపఁ జేసిరి [49]

48 "వేదముమ్ విరిత్తాన్ విళఙ్గియ కోయిల్
మాదు ఉమయిల్ శేర్ మాలిరుమ్ శోలై "

— తిరువాయి మొ॥ 2 - 10 - 10

49 "వైయుమ్ కాలముమ్ వినర్త్తుం కృదానీర్
పైయవాట్టి ప్పళుమ్ శిరువణ్ణాల్
ఐయనావళిత్తాళుక్కు అఙ్గాన్దిర
వైయమేళుమ్ కణ్డాళ్ పిళ్ళై వాయుళే "

— పెరియాళ్వార్ తిరుమొళి . 1 - 1 - 6

పొయిగై యాళ్వారులు కృష్ణుని ప్రభావమునకు ఆశ్చర్య చకితులగుచు, ఓ భగవానుడా! పృథివి, ఆకాశము, వాయువు, పర్వతములు, సముద్రములు మున్నగువాని నన్నింటిని మ్రింగివేసితివి గదా! ఆ నాఁడు నీ నోరు అంతటి పెద్దది యయ్యేనా యేమి?"[50] యని, భగవానుని విశ్వరూపమును విశేషముగ కీర్తించిరి.

జీవుఁడు :-

ఆళ్వారులు పరమాత్మను వర్ణించినంత విస్తారముగ జీవుని గురించి చర్చించి యుండలేదు. కాని, వారి రచనలలో - ఆత్మ పరమాత్మల సంబంధమును వారు అంశాంశి సంబంధముగను, శేషి శేష సంబంధముగను భావించిరి ఇట్టి భావనా విశేషమే విశిష్టాద్వైత దర్శనమం దంతటను గన్పట్టును.

---

50 "మణ్ణుమ్మలైయుమ్ మఱికడలుమ్ మారుతముమ్
విణ్ణుమ్ విళుఙ్గియతు మెయ్యెన్బర్ - ఎణ్ణిల్
అలకళవు కణ్డ శీరాళియాయ్క్కు - అన్ఱు
వుల్లకళవు ముణ్డో వున్వాయ్ "

— ముదల్ తిరువన్దాది 10

51 "వీడుమిన్ ముత్తముమ్ వీడుశెయిదు - ఉమ్ముయిర్
వీడుడై యానిడై వీడుశెయ్మినే "

— తిరువాయి మొళి . 1-2-1

"నీర్ నుమ దెన్ఱివై వేర్ ముదల్ మాయిత్తు - ఇఱై
శేర్మిన్, ఉయిర్క్కు అవనేర్ నిఱైయిల్లే."

— తిరువాయి మొళి · 1 - 2 - 3

జీవు లందఱును భగవంతునిచే నుద్భవింపఁబడినవారే యని నమ్మాళ్వారులు వివరించుచు, అతఁడే జీవులకు స్వామి యనియు, ఆ జీవ సముదాయము భగవంతునిపై ఆధారపడి యుండవలసినదే యనియు, అతఁడే జీవులలో నివసించుచున్నాఁడనియు[52] జీవులు త్రావు జలమందును, భుజించెడు అన్నమందును అతఁడు వ్యాపించి యుండెననియు, జగత్తంతయు భగవన్మయమే యనియు తెలిపి యున్నారు.

తిరుమంగై యాళ్వారులు జీవ బ్రహ్మల అంశాంశి సంబంధమును వ్యక్తీకరించుచు - 'సముద్రములో తరంగములు లేచి, అందే మఱల కలిసిపోవుచున్నందున, తరంగములకు సముద్రముకంటె అస్తిత్వము లేదు. జీవులు భగవంతునకు అంశ రూపములు, అని విశదీకరించిరి.

ఇళ్లై పొయిగై యాళ్వారులును - 'అంశ రూపముగా గల జీవులు, అంశి రూపముగాఁ గల బ్రహ్మమున లీనమైపోవునని సూచిం

52 "పిణ్కిదిరుప్పాయ్ మళై మేల్ నిఱ్పాయ్ శేర్పాయ్
మణ్కిదళల్ వాయ్ ఇవత్తు శెజ్జుమ్మత్తైన్దుత్తైవాయ్
ఎణ్కిదియన్ద పురవణ్డత్తాయ్ ఎనదాలి
ఉణ్కిదాడి ఉరుక్కాట్టాదే ఒళిప్పాయో "
— తిరువాయి మొళి 6 - 9 - 5

53. "ఉణ్ణుమ్ శోఱు పరుకునీర్ తిన్నుమ్ వెత్తిలైయు మెల్లామ్
కణ్ణన్ .... .... .... .... ....
— తిరువాయి మొళి. 6 - 9 - 1

54. "తన్నులే తిరై త్తెళుమ్ తడజ్గవెణ్ తడజ్గడల్
తన్నులే తిరై త్తెపన్దు అడజ్గుగిన్ద తన్మై పోల్
నిన్నులే పిఱన్దిఱన్దు నిఱ్పవుమ్ తిరిబవుమ్
నిన్నులే యిడజ్గుగిన్ద నీర్మై నిన్గణిన్నదే "
తిరుచ్చన్ద విరుత్తమ్ . 16

చుచు - నది సముద్రమువైపుకు ప్రవహించుచున్నట్లు, జీవులు భగవంతునిలో లీన మగుటకు సిద్ధముగ నుందు[55] రని తెలిపిరి.

ఈ యంశమును తిరుమంగై యాళ్వారులు ధ్రువీకరించుచు - తప్తము చేయఁబడిన లోహముపై నీటి బిందువును వేసినచో, ఆ బిందువు అందే లీనమైపోవును. అట్లే జీవుఁడ నగు నేను భగవంతుని యందే లీనము కాఁగలను'[56] అని వక్కాణించిరి. ఈ యంశ మునుగూర్చి నమ్మాళ్వారులు వెలువరించిన అభిప్రాయము లిట అవశ్య గమనార్హములై యున్నవి.

'పరబ్రహ్మయొక్క అంశ రూపముగాఁ గల జీవుఁడు సాంసారికమైన మాయలోఁ బడి, తన నిజ రూపమును తెలియఁ జాలకున్నాఁడు. అంతే కాదు - నేను పరబ్రహ్మ యొక్క అంశను అనియు తెలియకున్నాఁడు. ఇట్టి జ్ఞానము జీవునకుఁ గలుగ కుండుట - విచారకరము'[57] అని నమ్మాళ్వారులు జీవుని యజ్ఞాన దశను గుఱించి తమ విచారమును వెల్లడించిరి.

55 "పెయరుమ్ కరుఙ్గడలే నోక్కుమాఱు - ఒణ్ పూ
ఉయరుమ్ కదిరవనే నోక్కుమ్ - ఉయిరుమ్
తిరుమాలైయే నోక్కుమ్ ఒణ్ తామరైయాళ్ కేళ్వన్
ఒరువనైయే నోక్కు ముణర్వు"
— ముదల్ తిరువన్దాది 67

56. "ఇరుమ్బు అనలుణ్డ నీర్ పోల్ ఎమ్బెరుమానుక్కు . ఎన్ తన్
అరుమ్బెరు అన్బు పుక్కిట్టు అడిమై పూణ్డనన్ నానే"
— తిరుక్కురున్దాణ్డకమ్ . 5

57. "ఇవైయన్ఱే నల్ల ఇవైయన్ఱే తీయ
ఇవై యెన్ఱివై యఱివనేలుమ్ - ఇవై యెల్లామ్
ఎన్నాలడైప్పు నీక్కొణ్ణాదు ఇఱైయవనే
ఎన్నాల్ శెయ్యుమాండెన్ ?"
— పెరియ తిరువన్దాది : 3

ఆళ్వారులు వెలువరించిన ఇట్టి విచార పరంపరలను బట్టి, జీవుఁడు భగవంతుని భావించినయెడల, ఆ భగవంతుని కృపా కటాక్షముచే, సాంసారికమైన మాయా యవనిక నుండి తొలగింపఁబడి, ఆనందము ననుభవించగలఁడని స్పష్ట మగుచున్నది.

**జగత్తు :-**

జీవ జగత్తులు రెండును పరమాత్మ యంశలే యని ఆళ్వారులు వ్యక్తము చేయుచు, తమ రచనలలో జగదుత్పత్తిని గుఱించి విశేషముగ వర్ణించిరి.

సర్వ దేవతలను, సమస్త జీవులను, సకల జగత్తును, వాయు రాకాశములను అన్నింటిని తన యంశలుగా సృజించు పరబ్రహ్మకంటెను మిన్నయైనవాఁ డెవఁడున్నాఁడు?[68] అని నమ్మాళ్వారులు తమ దివ్య ప్రబంధములో నొక తావున పరబ్రహ్మ యొక్క సర్వాధిక్యతను స్పష్టీకరించుచు, మఱి యొక తావున, 'ఓ భగవానుఁడా! జగత్తు వాయువు మున్నగువానిని నీ యంశలుగా సృజించు ప్రతిభావంతుఁడ వగు నీవు - నా యంతః కరణమున నెట్లు

---

68 "యావరై యులగముమ్ యావరు మగప్పద
నిలమ్ నీర్ తీకాల్ శుడరిరు విశుమ్బుమ్
మలర్ శుడర్ పిఱవుమ్ శిఱిదుదన్ మయ్యుళ్
ఒరు పొరుళ్ పుఱప్పాడిన్ఱి ముళువదుమ్
అగప్పడక్కరన్దు - ఓరాలిలై చ్చేర్న్దవెమ్
పెరుమా మాయనై యల్లదు
ఒరుమాతెయ్ వమ్మతుడైయ మోయామే."

— తిరువాశిరియమ్ : 7

'నివసింపఁగల్గుచున్నావు ?' [59] అని తమ యాశ్చర్యమును వెలువరించిరి. వారే మఱి యొక తావున, పరమాత్మయే ఈ జగత్తును ఉపాదానకారణ మని యుట్టంకించుచు, 'మొట్ట మొదట ఏ జగత్తును లేదు, జీవులు లేరు, కేవలము పరబ్రహ్మమాత్రమే యుండెను. అతఁడు తన లీలలను ప్రదర్శింపఁదలచి, బ్రహ్మను సృజించెను. (విష్ణువు యొక్క నాభి కమలమునుండి బ్రహ్మ ఉద్భవించినట్లు ప్రతీతి గదా !) అనంతరము ఇతర దేవతలను, ముల్లోకములను, ఇంకను సమస్తము సృష్టించెను' [60] అని తెలిపిరి

ఇట్లే తిరుమళిశై యాళ్వారులు కూడ జగదుత్పత్తిని గణించి చర్చించుచు, 'ఓ భగవానుఁడా! నీవే జగత్తువు జగత్తు నీయందే యున్నది. దేవతలకు నీవే అధిపతివి' [61] అని, భగవంతుని మహిమను వేనోళ్ళ కొనియాడిరి.

---

59 "పుతియ మిరు నిఱమ్పుమ్ నిన్నకత్తు - నీయెన్
శెవియిన్ వళి పుకన్దెన్నుళాయ్ - అవివిన్రి
యాన్ పెరియన్ నీ పెరియై యెన్బ తనై యా రఱివార్"
— పెరియ తిరువన్దాది 75

60. "…. … యావగై యులగముమ్ యావరు మిల్లా
మేల్వరుమ్ పెరుమ్పాళ్ క్కాలత్తు - ఇరుమ్బొరుట్కు
ఎల్లా మరుమ్పెఱల్ తనివిత్తు - ఒరుతా
నాగిత్తెయ్వనాన్ముగక్ కొళుఙ్గుమురై
యీన్రు - ముక్కణీశనొడు తేవుపలనుదలి
మూవులగుమ్ విళైత్తవున్ది
మాయక్కడవుళ్ మాముదలడియే."
— తిరువాశిరియమ్ · 4

61. "నీయే యులకెల్లామ్ నిన్నరుళే నిఱ్పనవుమ్
నీయే తవత్తేవ తేవనుమ్ - నీయే
ఎరి శుడ రుమ్మాల్వరైయుమ్ ఎణ్డిశైయుమ్ - అణ్డత్
తిరు శుడరు మాయవినై."
— నాన్ముగన్ తిరువన్దాది : 20

ఆళ్వారులు జగత్తును సత్యముగా - నిత్యముగా తలంచిరని వారి దివ్య ప్రబంధములే వ్యక్తము గావించుచున్నవి.[62] ఇట్లు తలచుటకు కారణమేమన, పరబ్రహ్మ సత్యము - నిత్యము నయి యున్నందున, అట్టి పరబ్రహ్మయొక్క అంశ రూపముగాఁ గల జగత్తుకూడ సత్యము నిత్యము నయి యుండుటయే.[63]

మాయా మయ మగు సంసారము మాత్రము అనిత్యమని ఆళ్వారులు వక్కాణించిరే కాని, జగత్తు అనిత్యమని వారు చెప్పలేదు. దుఃఖభూయిష్టమైన సంసార సాగరము నుండి తరించుట జీవునకవశ్యాపేక్షణీయ మనియు, ప్రకృతి సంబంధము లగు వాంఛలను దూరాదూరము గావించి, సకల జగత్కారణకర్త యగు పరమాత్మ నుపాసించుట సర్వథా శ్రేయస్కర మనియు ప్రబోధించిరి.

'ఈ సంసారము యొక్క స్థితి గతులకు కారణభూతుఁడగు పరమాత్మను స్మరింపక, చేతనులనేకులు అజ్ఞానముతో క్రూరకృత్యము లొనర్చుచు, దుఃఖము ననుభవించుచు, మాయా మోహితులగుచున్నారు. ఆహా! నేనేమి చెప్పఁగలను?'[64] అని నమ్మాళ్వారులు తమ హృదయావేదనమును వ్యక్తము గావించిరి.

---

62 *"The Philosophy of Sathagopa"*
— R Ramanujachari
Annamalai University Journal, 1933, P 20

63 ఆళ్వారుల యనంతర మవతరించిన నాథ యామున, రామానుజాది ఆచార్యులందఱును - 'జగత్తు మిథ్య' అనెడి మాయా వాదమును నిరసించుచు, ఆళ్వారులు ప్రతిపాదించిన 'జగత్తు సత్యము, నిత్యము' అను సిద్ధాంతమునే సమర్థించిరి

64 "ఓ ఓ ఉలగినదియల్వే - ఈన్ఱోరుక్కు
మఱ్ఱై నీరాట్టి పద త్తదన్ను మిళ్న్దు
అళన్దు తేర్ న్దులగళక్కుమ్ మాద ప్పెరుమ్
కిదవుళ్ నిఱ్ఱ — పుఱై ప్పలతాకటి తెయ్వమ్ వెఱుదిల్ ఎనాఱు,
పన్మా మాయా త్తపన్దు మానిళరన్దే"
— తిరువాశిరియమ్ 8

**మాయ :-**

ఆళ్వారులు మాయను రెండు విధములుగా విభజించిరి ఒకటి - భగవంతుని శక్తి స్వరూప మగు మాయ. ఈ మాయయే సృష్టికి కారణము. మఱి యొకటి - ప్రకృతికి సంబంధించిన మాయ. ఈ మాయకు జీవులు వశులై యుందురు ఈ మాయ వల్లనే జీవుఁడు సంసారమున బంధింపఁబడుచున్నాఁడు. ఇది భగవానుని మాయకంటెను భిన్నమైనది. ఈ రెండు విధము లగు మాయలకును ఆళ్వారులు రెండు పేర్లు పెట్టిరి.

భగవన్మాయను ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో విశేషముగ వర్ణించిరి. తమిళమున 'మాయన్' అనఁగా — మాయా మయుఁడైన భగవానుఁ డని యర్థము. తమ్ము రక్షింపవలసిన దని, అట్టి భగవానుని ప్రార్థించిరి.

'పరబ్రహ్మ తన శక్తి స్వరూపమైన మాయచే ప్రేరేపింపఁబడి, సృష్టి వికాస హేతువుగా మొదట బ్రహ్మను సృజించెను. అతఁడా పరబ్రహ్మయొక్క యాదేశానుసారము సకల జగత్తులను, జీవులను సృజించెను. మాయామయుఁడైన ఆ భగవానుఁడే నా స్వామి [65]

'ఓ భగవానుఁడా! విచిత్రమైన నీ మాయకు ఫలముగా నుద్భవించిన నేను - నా పాప పరిహారార్థము నిన్నే శరణించుచున్నాను[66] అని నమ్మాళ్వారులును -

౬౫ తిరువాశిరియమ్ 4

౬౬ "వన్మా వెయ్య మళ ఎమ్ వామనా — నీన్
పన్మా మాయప్పల్ పిరవియిల్ పడగిన్డయాయ్
తొన్మా వల్వినై త్తొడర్ కళై ముదలరిన్దు
నిన్మాతాళ్ శేర్న్దు నిఱ్పదెన్ఱాక్కు కొలో"

— తిరువాయి మొళి 3-2-2

'ఓ భగవానుఁడా ! నీవు ఆది దైవముగా — తేజో రూపుఁడవుగా, ఆకాశముతోఁ గూడిన పృథ్వీ రూపుఁడవుగా — గోపాలక రూపముగా నాకు కానవచ్చుచున్నావు. అట్టి నీ మహిమను నేను తెలియఁజాలను నీ మాయ యెంతటి శక్తివంతమైనది!' 61 అని తిరుమళిశైయాళ్వారులును భగవంతుని మాయా శక్తిని బహు భంగుల వర్ణించిరి.

రెండవది యగు ప్రకృతికి సంబంధించిన మాయను సైతము ఆళ్వారు లభివర్ణించిరి. ఈ మాయయే జీవుని లౌకిక విషయములలో చిక్కుకొనఁజేసి, అజ్ఞానాంధకారమున పడవైచుచున్నది. ఆ జీవుఁ డందువలననే, శోక మోహములతో — సుఖ దుఃఖములతో — రాగ ద్వేషములతో పరిభ్రమించుచున్నాఁడు. అట్టి పరిభ్రమణము నకు మూల కారణ మగు మాయను ఆళ్వారులు - 'అవిద్య' యని నిర్వచించుచు, అవిద్యా రూప మగు ఈ మాయ - సత్యమును విస్మరింపఁజేసి, మోహమునుఁ గల్గించి, చిత్త చాంచల్యమును, తృష్ణను, అహంకార మమకారములను కామ క్రోధాదులను ఉద్భవింపఁజేయు ననియు, భగవ దనుగ్రహమువల్లనే ఈ మాయనుండి జీవుఁడు విడువడ గల్గు ననియు, భక్తి వైరాగ్యములు గలవారలు మాత్రమే భగవ దనుగ్రహపాత్రులు కాఁగల రనియు స్పష్టము గావించిరి.

'సకల జగత్తులను సృష్టించి, వానిని పాలించు సర్వశక్తిమయుఁ డగు భగవంతుని స్మరింపక, జీవుఁడు అజ్ఞాన వశమున దుష్కృత్యము

67 "ఆదియాదినీ ఒరణ్ణ మాదియాందలాల్
శోదియాద శోదినీ అదుత్మైయిల్ పిఱ్ఱైనాయ్
వేదమాగి వేళ్వియాగి విన్దినోడు మణ్ణుమాయ్
ఆదియాగి యాయనాయ మాయమెన్న మాయమే"
— తిరుచ్ఛన్ద విరుత్తమ్ 34

లాచరించి, మాయా మోహితుఁడై, స్వైరముగ పరిభ్రమించుచున్నాఁడు[68] - మాయచేఁ గల్గిన ఈ సంసార స్థితి - అతి విచిత్రముగా నున్నది దుర్మార్గులు సుఖము ననుభవించుచున్నారు. ఈ సంసారము సజ్జనులకు నానా విధములగు కష్టములు కల్గించుచున్నది.[69] అని నమ్మాళ్వారులు - ప్రకృతి సంబంధమగు మాయలో బంధింపఁబడిన చేతనుఁను గుఱించి అనేక విధముల తమ విచారమును వెలుపరించుచు, అట్టి మాయ నుండి విముక్తులు కావఁలసిన దని ప్రాకృతులను ప్రబోధించిరి.

## మోక్షము :-

ప్రకృతి బంధమునుండి విముక్తి నంది, ఆనంద ప్రాప్తికి మానవుఁడు తగిన ప్రయత్నము చేయవలె నన్న నియమము సర్వ సామాన్యముగ దర్శనము లన్నింటియందును గన్పట్టును. కాని, అట్టి ఆనంద ప్రాప్తికి ఒక్కొక్క మతము ఒక్కొక్క మార్గమును సూచించినది. ఆళ్వారులు మాత్రము భక్తియే ముక్తికి మార్గ మనియు, అట్టి అమృత ఫలమును పొందఁగల్గిన సాధకుఁడు కడుంగడు ధన్యుఁడు కాఁగలఁ డనియు తెలిపిరి[70]

---

౬౮ తిరువాశిరియమ్ ౬

౬౯ "కొణ్డాడార్ నుఱువలిప్ప నల్లత్తిర్ కడైన్దు - ఎఙ్గ
పెణ్డారాత్తు యిర్వైక్కుమ్ ఇవై యెన్న ఉలగియఱ్కై "
— తిరువాయి మొళి : 4 9 .1

70 "అడ్డిన్దుకొణ్డు అదప్పెరుమానై అన్బినాల్
వాయ్న్ద మనత్తిరుత్త వల్లార్గళ్ - ఏయ్న్ద తమ్
మెయ్క్కిన్దమాక వినమ్బువరే - వానమ్ తమ్
పైగ్గొమ్ కాళ్వార్ విరైన్దు "
— నాన్ముగన్ తిరువన్దాది . 79

భక్తి సిద్ధాంత ప్రతిపాదకములైన ఆధికారిక గ్రంథములలో - 'శ్రీమద్భాగవతము' అగ్రగణ్యమైనది. అందు - సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము అను నాల్గు విధములగు ముక్తి మార్గములు వర్ణింపబడినవి.[71] ఈ ముక్తి మార్గముల నాల్గింటిని ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో వేర్వేరుగా వర్ణింపకున్నను, ఆ మహనీయులు ఈ చతుర్విధ ముక్తులను పరిపూర్ణముగ అనుభవించిరనియే మనము సంభావింపవచ్చును

మోక్ష సుఖము రెండు విధములుగా నుండు నని తత్త్వ శాస్త్రములు తెలుపుచున్నవి. అందొకటి - జీవన్ముక్తావస్థ. అనగా - దేహ మున్నపుడే మోక్ష సుఖమును పొందుట. ఇక రెండవది - దేహపాతానంతరము భగవత్కృపా విశేషమున లభించు ముక్త్యవస్థ, ఈ రెండు విధములగు ముక్తులును ఆళ్వారుల దివ్య ప్రబంధములలో వర్ణింపబడినవి.

జీవన్ముక్తావస్థలో లభించు సుఖము - దేహ పాతానంతరము గల్గు మోక్ష సుఖము కంటెను మిక్కిలి శ్రేష్ఠమైనది. అట్టి జీవన్ముక్తావస్థను పొందుటకు తగిన విధులను ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములందు నిర్దేశించియుండుటేగాక, తాము ను తాదృశమైన జీవన్ముక్తావస్థనే అభిలషించుచు, తదితర మగు మోక్ష సుఖముపై ఉపేక్ష వహించినట్లు వారి దివ్య ప్రబంధములే మనకు సాక్ష్య మిచ్చుచున్నవి. ఈ సందర్భమున, నమ్మాళ్వారులు వెలువరించిన అభిప్రాయములు అవశ్యము గమనింపదగి యున్నవి.

---

71 "సాలోక్య సార్ష్టి సామీప్య సారూప్యైకత్వ మిత్యుత
దీయమానం న గృహ్ణన్తి జనా మత్సేవనం వినా "
— శ్రీమద్భాగవతము : 3-29-14

'ఓ భగవానుఁడా ! నీ భక్తులకు నీవు మోక్ష సుఖమును ప్రసాదింపఁదలచితివా ? అయినచో - అది నీ నామ స్మరణ మాత్రమున నేను పొందెడు ఆనందము కంటెను ఘనమైనదా యేమి ? కొందఱు ప్రజలు అల్ప ప్రయోజనముల నపేక్షించి, విశేషముగ పరిశ్రమించి, వ్యర్థముగ పరిభ్రమించుచున్నారు మరి కొందఱు — మోక్ష పదవి నపేక్షింపవలెనన్న కాంక్షతో గన్పట్టుచున్నారు. కాని, ఉత్తమ భక్తులు ఈ రెంటిలో నే యొకటియు కోరరు. వారు కేవలము భగవద్భక్తియందే పరమానందము నందుచున్నారు.[73]

నమ్మాళ్వారులు వెలువరించిన ఇట్టి అభిప్రాయములవలెనే తక్కిన ఆళ్వారులు సైతము తమ తమ అభిప్రాయములను తమ తమ దివ్య ప్రబంధములలో అభివ్యక్తము గావించిరి.

---

72. "ఒన్ఱు శెప్పక్ మాల్ యానుర్రైప్పతు - ఉన్నడియార్క్కు
ఎన్ శయ్‌వనెన్ఱే యిరుత్తినీ - నిన్ పుకళిల్
వైకుమ్‌తమ్ శిన్దైయిలుమ్ మత్తినితో - నీయవర్క్కు
వైకున్ద మెన్ఱరుళుమ్‌వాన్."

— పెరియ తిరువన్దాది , 53

73 "ఉలగు పడైత్తు వెన్ఱై - అఴైశిల్
శుడర్ పూన్దామరై శూడుతఱ్కు - అవావా
రుయి రురుగియుక్క - నేరియ కాదల్
అన్బిలిన్బిన్ తేఱల్ - అముద
వెళ్ళత్తానామ్ శిఱుప్పు విట్టు - ఒరు పొరుట్కు
అశైవోరైగ - తిరువాడు మరువియ
ఇయత్కై - మాయాప్పెరు విఱలులగమ్
మూన్ఱి నొడువల్ పీడు పెరినుమ్
కొళ్‌వరెణ్ణుమో తెళ్ళియోర్ కుఱిప్పే"

— తిరువాశిరియమ్ : 3

'అచ్యుతా ! దేవాదిదేవా !' అని సంబోధించుచు, భువన మోహనుఁ డగు భగవానుని కల్యాణ గుణములను గానము చేయుట యందే నాకు ఆనందము లభించుచున్నది. కనుక, నేను స్వర్గ సుఖమునుఁ గాని, మోక్ష సుఖమునుఁగాని అపేక్షింపను'[74] అని తొండరడిప్పొడియాళ్వారులును -

'భగవంతుని సందర్శన భాగ్యమును పొందవలెనన్న కాంక్ష కంటెను నాకు తదితర మగు నే మోక్ష సుఖమందును కోరిక లేదు.'[75] అని తిరుమళిశై యాళ్వారులును మోక్ష సుఖముకంటె భగవన్నామ స్మరణవలనఁ గల్గు ఆనందమే మిక్కిలి మిన్నయైన దని స్పష్టము గావించిరి.

మోక్ష మనగా - ఒక ప్రత్యేక మగు స్థాన విశేషము కాదనియు, అయ్యది కేవలము అనుభూతి మాత్రమే యనియు నమ్మాళ్వారులు విశదీకరించుచు, 'జ్ఞానము లభించిన యనంతరము పంచేంద్రియములను వశము గావించుకొని, సుఖ దుఃఖముల విచారమును విస్మరించి, మోహమును పరిత్యజించినంతనే మోక్షానందము లభించును.'[76]

74 "అచ్చుదావమరరేఱే ! ఆయర్ తమ్ కొళున్దే యెన్నుమ్
ఇచ్చువై తవిరయాన్ పోయ్ ఇన్దిరలోక మాళుమ్
అచ్చువై పెఱిమమ్ వేణ్డేన్ .... . .
— తిరుమాలై : 2

75 "పిఱదానగపోగవె మెయిది పిత్తిరున్ద పోదిలుమ్
కూడుమాలై యల్లదొన్దు కొళ్వనోకుటిప్పిలే."
— తిరుచ్చన్ద విరుత్తమ్ : 108

76. "నన్దాయ్ జ్ఞానమ్ కడన్దుపోయ్ నిల్లిన్దిరియమెల్లా మీర్త్తు
ఒన్దాయ్ క్కిదన్ద వరుమ్ పెరుమ్బాత్తలది నై ఉణర్న్దుణర్న్దు
శెన్దాజన్దత్తున్బగ్గ శెత్తఱ్ఱశైన్దు పఱ్ఱైయ త్తిల్
అన్దేయపొన్దే వీడు అదువేవీడు వీడామే"
— తిరువాయి మొళి 8 - - 68

అదియే మోక్షము. మోక్ష మెం కెచట నున్నది ? ... సుఖ మెం కెచట నున్నది ? సృష్టి రహస్యములను బాగుగా గుర్తించి, మోహమ ను పరత్యజించుటయందే మోక్ష సుఖ మున్నది[77] అని మోక్ష స్వరూపమును స్పష్టముగ దర్శింపఁజేసిరి.

విరహాసక్తిగల నాయిక – నాయకుఁడైన శ్రీకృష్ణుని సాన్నిధ్య మభిలషించి యనుభవించిన పరితాపమును ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో రమణీయముగ వర్ణించుచు, అట్టి విరహావస్థయందలి తన్మయత్వమునకును, మోక్షానందమువలనఁ గల్గు తన్మయత్వమునకును అంతర మేమాత్రము లేదనియు, 'అసలు' విరహావస్థయందే అనిర్వచనీయమైన ఆనందము లభింపఁగలదనియు విశదీకరించిరి.

కులశేఖరాళ్వారులు సామీప్య ముక్తియం దభిలాషగలవారలై 'నేను మఱల మానవునిగా జన్మింపవలెనని తలంచుటలేదు. రానున్న జన్మలో వేంకటాచలమున శ్రీనివాస భగవానుని దివ్య సన్నిధియందు

---

77. "అదువే వీడు వెత్తిన్బత్తానమదుతేఱి
ఎదువే తానుమ్ పత్తినయాదమివిగళా క్కిఱక్కిల్
అదువే వీడు వీడువెత్తిన్బత్తానుమదు తేఱాదు
ఎదువే వీదే దిన్బమెన్ను ఎయెత్తార్ యిత్తారెయ్‌త్తారె"
— తిరువాయి మొళి 8 – 8 – 7

ఏ కొంగగానైన జన్మించితినేని, ధన్యుడగుట కాంగలను. అట్టి మహా భాగ్యమె నాకు లభించుగాక!'78

'క్షీర సాగరమునందలి ధవళ తరంగములను పరిపూతముల గావించుచు, విరాజిల్లు శేషశాయి యగు భగవానుని దివ్య చరణార విందములను దర్శించుటకై, గాన రస లహరులలో మునిఁగి తేలెడు భ్రమరములు చేయు ఝుంకారములచే ప్రతిధ్వనించు వేంకటాచలము నందలి పూల తోటలో నే నొక చంపక పుష్పము నగుదునుగాక!'79 అని, తమ కోరికను వెలువరించిరి. ఈ రీతిగా భగవత్సాన్నిధ్యమే పరమానంద సంధాయకమని భావించిన కులశేఖరాళ్వారులు భగవత్సందర్శన భాగ్యమును పైల నభిలషించి రనుటకు ఈ క్రింది పంక్తులే ప్రబల ప్రమాణములు

'శ్రీరంగమున నిత్య నివాసము జేయు భగవానుని దర్శించి, నా నేత్రము లెన్నగు ఆనందానుభవములో తృప్తి నందఁగలవో'80

78. "ఊనేఱు శెల్వత్తు ఉడఱ్పిఱవియాన్ వేణ్డేన్
ఆనేఱ్ వెన్ఱాన్ అడిమైత్తి ఱల్లార్
కూనేఱు శఙ్గ మిడత్తాన్తన్ వేఙ్గడత్తు
కోనేరివాళుమ్ కురుకాయ్ ప్పిఱప్పేనే "

— పెరుమాళ్ తిరుమొళి : 4 - 1

79. "ఒణ్ పవళవేలై ఉళవు తణ్ పాఱ్కడలుళ్
కణ్ తుయిలుమ్ మాయోన్ కళలిణై కాణ్బదఱ్కు
పణ్ పగరుమ్ నిఱ్కుమ్ తిరువుడై యే నావేనే "

— పెరుమాళ్ తిరుమొళి 4 - 4

80 "తిరువరఙ్గ త్తరువణై యిఱ్పళ్ళి కొళ్ళుమ్
మాలో నైక్కణ్డిన్బక్కలవి యెయ్దిది
వల్వినై యేనెన్ఱు కొలో వాళునాళే "

— పెరుమాళ్ తిరుమొళి . 1 - 8

శ్రీరంగమునందలి భగవానుని ఆనందోద్వేగముతో నృత్య సహితముగా సంకీర్తించి, తన్మయుఁడనై, ఉన్మత్తుఁడ నెన్నడు కాఁగలనో?[81] అట్టి శుభ దిన మెన్నఁడు రాగలదో? శ్రీరంగమునందలి ఆలయ ప్రాంగణమున భగవానుని స్తుతించుటలో ఆనంద మగ్నులై యుండు భక్తులతోఁ గలిసి, అంతు లేని యానందము నెపుడు పొందఁ గలనో?[82] అని కులశేఖరాళ్వారులు భగవత్సందర్శన భాగ్యమును పొందుటకును, భగవద్భక్తులతోఁ గలిసి భగవన్నామ సంకీర్తనము గావించి, బ్రహ్మానందము నందుటకును అభిలషించినట్లు, వారి దివ్య ప్రబంధములవలననే అభివ్యక్త మగుచున్నది. కనుక, భగవదనుగ్రహమే మోక్ష ప్రాప్తికి కారణ మనియు, అట్టి భగవదనుగ్రహ సంపాదనము ముముక్షువులకు అత్యంత మావశ్యక మనియు, మానవమాత్రు లందఱును ముముక్షువు లగుట మే లనియు తెలియ నగును.

"యే మానవా విగతరాగ పరావరజ్ఞాః
నారాయణం సురగురుం సతతం స్మరంతి
ధ్యానేన తేన హత కిల్బిష చేతనా స్తే
మాతుః పయోధర రసం న పునః పిబంతి"

---

81. "తిరువరఙ్గ త్తరవణై యిల్పళ్ళి కొళ్కిన్రమ్
పోరాళియమ్మానై క్కణ్డు తుళ్ళి
ప్పూదలత్తి వెన్రు కొలో పురుమ నాళే"
— పెరుమాళ్ తిరుమొళి : 1 – 9

82. అణియరఙ్గరు ముత్తడియార్ తఙ్గళ్
ఇన్బు మిగు పెరుఙ్గువు కణ్డియాను
మిక్కైనుడనే యన్రు కొలో విరుక్కు నాళే"
— పెరుమాళ్ తిరుమొళి 1 – 10

— o —



శ్రీ భగవద్రామానుజులు

# శ్రీ రామానుజావతరణము

పూజ్య శ్రీ

## శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి

* * *

"నమో రామానుజార్యాయ తస్మై నిస్సీమ తేజసే
పశ్వం తారణాయ యస్యాసీ దవతారో మహీతలే"

శ్రీమన్నారాయణుని యాజ్ఞచే, జగద్రక్షణార్థమై, భరత ఖండమున నవతరించిన శ్రీమద్రామానుజులు - భగవన్మత మగు శ్రీ విశిష్టాద్వైతము నుద్ధరించి, సమస్త జన విదితముగను, సమస్త మానవ సంసేవితముగను చేసెను.

## శ్రీభాష్య రచన

మత సుస్థిరతకై రామానుజులొనర్చిన కృత్యములలో ప్రధానముగాఁ జేర్పఁదగినది శ్రీభాష్య రచన. ఈ శ్రీ భాష్య రచనా మూలమున రామానుజుల కర్తవ్య మెంతవఱకు నీడేరెనో, లోకోద్ధరణకై యవతరించిన రామానుజుల యభిప్రాయము లెట్టివో, ముందుగాఁ దెలిసికొనవలసి యున్నది.

"భాష్యే ద్వే శ్రీ మహా చ్ఛబ్ద భూషితే శేష భాషితే"

ఆదిశేషునిచే రచింపఁబడిన భాష్యములు రెండు. ఒకటి - పతంజలి రూపమున రచించిన 'మహా భాష్య' మను పేర వెలయు వ్యాకరణ శాస్త్రాత్మకము. రెండవది - శ్రీ రామానుజావతారమున రచించిన శ్రీభాష్య వ్యాఖ్యాన రూప వేదాంత శాస్త్రాత్మకము.

చేతనోజ్జీవనార్థమై సర్వేశ్వరునిచే ప్రసాదింపఁబడిన వేద వాఙ్మయము వివిధ కుమతుల వికారచేష్టలచే వికృతిని పొందఁగా - వేద వ్యాసుఁడు ముముక్షువులకు పరమాత్మ తత్త్వము సులభముగా బోధ

పడుటకై వేదాంతము లనబడు ఉపనిషత్తుల వైలక్షణ్యమును వివులీకరణ విభాగములకు వేదాంత సూత్రములు [illegible] పే రిడెను అవి పరబ్రహ్మ ప్రతిపాదకము లగుటవలన, 'బ్రహ్మసూత్రములు' అని చెప్పబడుచున్నవి. ఈ బ్రహ్మ సూత్రములు వ్యాఖ్యాన స్వరూపమే శ్రీ భాష్యము.

ఈ బ్రహ్మ సూత్రములకు శ్రీమద్రామానుజులకంటెను పూర్వము శంకరాచార్యులును, రామానుజుల ప్రథమాచార్యు లగు యాదవ ప్రకాశకులును, ఇంకను అనేకులు భాష్యములు రచించియుండిరి.

## శ్రీభాష్య రచనా కారణము

ఈ బ్రహ్మ సూత్రముల కనేకులు పరస్పర విరుద్ధముగా భాష్యములు వ్రాసియుండుటవలన, ముముక్షువుల కవి యన్నియు సందేహాస్పదము లగుటచున్నందున, శ్రీమద్రామానుజు లా భాష్యముల నన్నింటెని విమర్శించి, స్వకీయాభిప్రాయములను వెల్లడించుటకు శ్రీ భాష్యమును రచింప నవసరము గల్గెను. ఈ రామానుజ భాష్యము ఇతర భాష్యములకంటెను పరస్పర విరుద్ధము లగు భావము లను సప్రమాణముగ సమన్వయించినందువలనను ఉన్నతము లగు [illegible] అమూల్యములు నైన స్వకీయాభిప్రాయములను సూచించినందువలనను - భాష్యరత్నమనఁ బరగి, ఈ భాష్యమునకు 'శ్రీభాష్య' మనియు, భాష్యకర్త యగు శ్రీమద్రామానుజులకు 'శ్రీభాష్యకారు' లనియు సార్థక నామము లేర్పడినవి. ఆ సువర్ణాక్షరములు భరత ఖండమున నేటికిని ప్రకాశించుచునే యున్నవి.

## మత పరిణామము

భూమండలమున ధర్మమును రక్షించి అగర్వముగ [illegible] జగత్కారణ భూతుఁ డగు శ్రీమన్నారాయణుని [illegible] కాలమున

కుచితములైన అవతారముల దాల్చి, ధర్మ సంస్థాపన సేయుచుండును. ఇందువలన ధర్మాధర్మములు కూడ ఆ యా కాలమును బట్టి, వృద్ధి హ్రాసముల నొందుచుండు నని తెలియఁగలుగును. ఈ ధర్మాధర్మము లెట్లు అనాది సిద్ధములో - అట్లే, ఆస్తిక - నాస్తిక మతములుగూడ అనాది సిద్ధములే; మతాభిప్రాయములు లోకోద్భవన కేర్పడినవే. ఆ యా మత సౌహార్దతను బట్టి యెట్లు వృద్ధి హ్రాసముల నొందుచుండునో - అట్లే, ఆస్తిక నాస్తిక మతములు కూడ వృద్ధి హ్రాసముల నొందు చుండును.

## కలియుగారంభ మత స్థితి

భారత యుద్ధానంతరము ద్వాపర యుగాంతమై, కలియుగారంభమైన పిమ్మట, ధర్మము నశించి, అధర్మము విజృంభించెను. అసురుల ప్రాబల్యమధికమయ్యెను. పరమ భాగవతులును, ధర్మ సంరక్షకులును, ధర్మ ప్రచారకులును [illegible] లైరి. త్యాగ బుద్ధి త్యజింపఁబడెను. స్వార్థ పరత్వము మీరెను. [illegible]ముగ, వర్ణాశ్రమ వ్యవస్థ తారుమారు కాఁజొచ్చెను. [illegible], ద్రోణ, అశ్వత్థామ కృపాచార్యులే బ్రాహ్మణులు. యుద్ధారంభమున అర్జునుడు శంకించిన వర్ణాశ్రమ సాంకర్యమే యుద్ధానంతరము ప్రత్యక్ష మయ్యెను. శ్రీ కృష్ణ - కృష్ణద్వైపాయనులు వేదాంత సారమును భగవద్గీత, బ్రహ్మసూత్రముల రూపమున ప్రకాశింపఁజేసిరి. కాని, వారి కృషి ఆ సమయమున సఫలతఁ జెందలేదు.

భారత యుద్ధ కాలమున హింస కలవడిన మానవ మానసములు - హింసాయుతమైన కార్యములకు బాధపడుచునో, లేక - నిరాశా నిస్పృహ లతో నిండిన నాస్తిక మత దురభిమానులై యనో సంవిలగ్నము లయ్యెను. ఇందువలన మానవులలో అన్యోన్య భావములు

నశించెను. పాషాండాచారము వృద్ధి పొందెను. వైదికాచారము ధ్వంస మయ్యెను. అహింస రూపు మాసెను. హింసా దేవత వీర విహార మొనర్చుచు, తాండవించుచుండెను. ఇట్లు పరస్పర విరుద్ధములై, నిరాశా సంజనితములైన అనుష్ఠాన పరంపరచే పూర్తిగ బీటలు వారి, శిథిలావస్థ నొందిన ధర్మ సుస్థితి తాత్కాలిక యత్నములతో బాగు పడు దశ నతిక్రమించెను. ఈ కారణము వలననే శ్రీకృష్ణ పరమాత్మ ప్రకాశింపజేసిన భగవద్గీత - జితేంద్రియుఁడగు అర్జునునియందు కూడ ఫలప్రదము కాఁజాలకపోయెను. శ్రీకృష్ణావతార కాలమున విజృంభించిన అరాచకత్వమే ఇందుకు కారణము. ఇందువలననే శ్రీకృష్ణుఁడు తన అవతారమును చాలించుచు —

"నాతి స్వస్థ మనా యయా"

'నా మనస్సునకు కించిత్తు స్వస్థత కలుగలేదు' అని తన అసంతృప్తిని మహాభారతమున వెల్లడించెను.

బుద్ధావతారము

ఇందువలన, శ్రీకృష్ణపరమాత్మ మరల బుద్ధ రూపమున (క్రీ: పూ: 463) కలి యుగము 2638 సంవత్సరమున నవతరించి, ప్రజానీకమునందలి హింసా ప్రవృత్తిని, కామాసక్తిని భావ దుస్థితిని, నాస్తిక మతమును పోద్రోలి, మానవ సంఘమున అహింసా ధర్మ బీజములను నాటెను. వైదిక ధర్మ నిర్మాణమునకై, శిథిలమైన వేద ప్రమాణములను బుద్ధుఁడు పెల్లగించెను. అహింసా సిద్ధాంతముపై వైదిక ధర్మమునకే క్రొత్త పునాదులు వేసెను. ఆ యహింసా సిద్ధాంతమందే, వైదిక - ఆస్తిక మత ధర్మ బీజము లిమిడి యున్నవి. ఈ బుద్ధుఁడు అనేక దేశములలో ధర్మ ప్రచారము చేసి, బౌద్ధ మతమును

స్థాపించెను. ఈ బౌద్ధ మతమునకు సంబంధించిన స్థూపములు మొదలగు వానిని నేటికిని మనము చూడగల్గుచున్నాము.

## ఇతర మతములు

బౌద్ధ యుగానంతరము - జైన, సాంఖ్య, యోగ, వైశేషిక పాశుపత మత స్థాపకులు కొంద ఉద్భవించి తత్త్వాలోచితము, ధర్మ ప్రచారము గావించి, బుద్ధునిచే నాటఁబడిన ధర్మ బీజముల నంకురింపఁజేసిరి. వైదిక ఆస్తిక మతము యొక్క పునాదులు ఆకారము దాల్చినవి తద్వారా, కర్మయోగ ప్రభావము విశేషముగా ప్రచారమయ్యెను. అది జ్ఞాన యోగ పర్యవసాయియై, అంకురించిన బీజము - లతయై, పుష్పించవలసి యున్నది.

## శంకరావతారము

శంకరాచార్యులు, కలియుగాది 3889 (క్రీ: శ: 788) సంవత్సరమున జ్ఞాన యోగ ప్రచారము చేయుట కవతరించెను.

## శంకర మతము

బుద్ధునిచే చేయఁబడిన కర్మయోగ ప్రచారము శంకరాచార్యులవతరించునాఁటికి ప్రపంచమున వ్యాపించి, స్థిర రూపముఁ దాల్చినది. పిమ్మట శంకరాచార్యులు ప్రపంచమును జ్ఞానయోగ పర్యవసాయిగాఁ జేయుచు, వేదములకు అపౌరుషేయత్వమును, ఆ వేదములందు పరమ ప్రామాణ్యమును స్థాపించి, అంతకు మున్ను ప్రజానీకమున అంకురించి, కోరకితమై, పల్లవితమై యున్న ధర్మబీజ నిక్షేపముచే వృద్ధి నొందిన లతను పుష్పింపఁ జేసెను. బౌద్ధ యుగము నాఁటి సర్వశూన్యత్వ, మిథ్యాత్వములను జగత్తు పఱకు మాత్రమే వ్యాపింపఁ జేసి, బ్రహ్మము సత్యముగ నంగీకరింపఁ జేసెను. శాక్తేయ, పాశుపత

మతములు వ్యాప్తి జేసిన ప్రవృత్తి మార్గమును నివృత్తి మార్గముగా మరలించెను. జీవ బ్రహ్మలకు తేట స్తిమితపడునటులె సర్వావస్థలందును వైరూప్యమును తెలుపు ద్వైతసంజ్ఞను కేవల భావాద్వైత పరముగా మార్చెను. సత్యములను మూడుగను విభాగములుగ విభజించి, బ్రహ్మను పరిపూర్ణ సత్యముగను, జీవ ప్రపంచములను వ్యావహారిక సత్యములుగను వ్యవహరించెను

పూర్వ యుగములందలి దోషములను తొలగించి, నిర్దోష విషయములు గ్రహించి, అవసరమైనచో నూతన క్రొత్త రూపమును గల్పించుచు, రాంబోవు యుగములకు అనుకూలమైన ధార్మిక విషయములు వృద్ధి పొందించుటయే మహాత్ముల పని.

శంకరాచార్యులు తన కృషి ఫలితముగ, జ్ఞాన యోగమును ప్రచార మొనర్ప గల్గెను. ఇంతలో దేహోపాసన సమయము ఆసన్నమైనది. 32 సంవత్సరముల ప్రాయముననే భౌతిక శరీరమును విడచి వైచెను. ఇందువలన శంకరాచార్యులు తన శిష్యులకు భక్తి మార్గమును ప్రచారము చేయు నవకాశము లేకపోయెను. ఈ యసంతృప్తి తన యనుష్ఠాన - గ్రంథ రచనాదులవలనే స్పష్టమగుచున్నది.

## శ్రీ రామానుజావతారము

ఇట్టి సమయమున సర్వేశ్వరుడగు శ్రీమన్నారాయణుడు అనంతుని శ్రీమద్రామానుజులుగా లోకోద్ధరణకై యవతరింపజేసెను. శ్రీమద్రామానుజులు శంకరాభిప్రాయమైన భక్తి మార్గమును, దాని కంటెను విలక్షణమగు ప్రపత్తి మార్గమును ప్రచారము జేసి, లోకమును కుపథమునుండి తప్పించి, ధర్మ మార్గమున నుంచి పుష్పితమై యున్న ధర్మ వృక్షమును ఫలింపజేసెను.

టలో(గాని ఏమాత్రము సంశయము లేదు. ఈ సత్యమును తన యాచరణమునందే స్వయముగా చూపించియున్నా(డు.

౧) తన తల్లికి మోక్షోపాయముగ శ్రీకృష్ణ ధ్యాన పూర్వ లక్ష్మ్యష్టోపదేశమును చేసెను.

౨) గోవింద భజనమే మోక్షోపాయ మని తన శిష్యుల కుప దేశించెను.

3) తన అనుయాయులకు విష్ణు సహస్రనామ పారాయణము, శ్రియఃపతి ధ్యానము మోక్ష ప్రదము లని ఉపదేశించెను.

౪) తన ప్రాణ సంకట దశయందు శ్రీ లక్ష్మీనృసింహుని శరణ జొచ్చెను.

౫) తన గ్రంథములలో – 'నారాయణం పద్మభువం వశిష్ఠం శక్తిం చ తత్పుత్ర పరాశరం చ, వ్యాసం శుకం ...' అని విశిష్టాద్వైత మత ప్రవర్తకులనే తమ ఆచార్యులుగ భావించి ధ్యానించెను

ఇట్టి పరశ్శత ప్రమాణములు ఈ సత్యమునే వెల్లడించు చున్నవి. అయినను, కొన్ని రచనలలో – కేవలాద్వైతమును కూడ శంకరాచార్యులు ప్రవర్శించియుండుట సత్యమే. అది కేవలము ఆ నాటి దేశ, కాల, పాత్రతల ననుసరించిన శాఖా చంద్ర న్యాయ లభ్యమైన ఉపలక్షణాత్మక ప్రథమ పారోపదేశమే గాని, నిజాభిప్రాయము గాని - లక్ష్యముగాని కాదు. అదియే పరమ ప్రామాణ్య మనియును కాదు. పసిబిడ్డకు నీరు గలిసిన పాలను ఆహారముగ నిచ్చిన జీర్ణ మగును గాని, క్షీర పక్వాన్నములు జీర్ణము కాజాలవు గదా!

ఇకను కొంత కాలము శ్రీ శంకరాచార్యులు ఈ విభూతియం దుండియున్నచో-తప్పక, తన లక్ష్యమగు భగవన్మతమును స్థాపించి

యుండును. కాని, భగవన్నియమనము వేరై యుండెను. ఇట్టి స్థితిలో శంకరాచార్యుల యనంతరము 197 సంవత్సరములు గడచిన పిమ్మట, ఆయనచే పూర్తిఁజేయఁబడని కార్యముల సంపూర్తిఁ జేయుటకై, శ్రీమద్రామానుజులు కలియుగాది 4118 ( క్రీ. శ. 1917 ) సంవత్సరమున నవతరింపవలసి వచ్చెను

## రామానుజ కృత్యములు

బౌద్ధ యుగమునుండి నిర్మింపఁబడుచున్న ఆస్తిక మత కుడ్యము శంకరాచార్యులచే భూమిపైవరకు నిర్మింపఁబడెను. అందువలన, అది సర్వజనోపయోగము కాలేదు. ఆ యాస్తిక మత కుడ్యము సంపూర్ణముగ నిర్మింపఁబడిన యెడల, ఎల్లర కుపయోగించును. శ్రీమద్రామానుజులు ఆస్తిక మత కుడ్య నిర్మాణమును పూర్తిఁ జేసి, దానిని భక్తి-ప్రపత్తి మార్గములచే ప్రకాశవంతముఁ జేసి, సర్వ జనోపయోగముగను, సకలార్థప్రదాయిగను చేసెను. శంకరాచార్యులచే నిర్మింపఁబడిన పరమపద సోపాన పంక్తి - పరబ్రహ్మయొక్క ఉభయ లింగకత్వమును తెలిసికొనునంతవఱకు నిర్మింపఁబడలేదు. ఆ కార్యమును శ్రీమద్రామానుజులు పూర్తిఁ జేసెను. ముముక్షువు లందఱును అతి శీఘ్ర కాలములో అత్యంత సులభముగ, నిరపాయముగ గమ్యస్థానమును చేరు [illegible] నటుల నిష్కంటకముగ జేసెను.

శంకరాచార్యులు 32 సంవత్సరములు మాత్రమే ఈ లోకమున నుండిరి. శ్రీమద్రామానుజులు కూడ 32 సంవత్సరముల వఱకు పూర్వ మతముల నన్నింటిని సింహావలోకనము చేయుచుండిరి. 32 సంవత్సరముల ప్రాయము పూర్తి యగునరికి శంకరాచార్యుల జ్ఞానయోగ పూర్వకమైన అద్వైత మత విషయ సారమును గ్రహించినవారై, అనంతరము అనంగా - 33 సంవత్సరముల ప్రాయమున,

భక్తి - ప్రపత్తి పూర్వక విశిష్టాద్వైత ప్రచారమునకు తురీయాశ్రమ స్వీకారముతో బయలుదేరెను.

శ్రీ శంకర, రామానుజులు జన్మించిన స్థానములు, నక్షత్రములు ఒకటియే. వీరిరువురి ప్రమాణ గ్రంథములు, ప్రచార విధానములు ఒక్కటియే. విశిష్టాద్వైత స్థాపనకు శంకరాచార్యుల యవతారము పూర్వ రంగము, రామానుజావతారము ఉత్తర రంగము.

## శంకర మత - రామానుజ మత భేదములు

| .- శంకర మతము :- | :- రామానుజ మతము :- |
| --- | --- |
| ౧. బ్రహ్మ మొక్కటియే సత్యము. తద్వ్యతిరిక్తములైన జీవ ప్రకృతులు ఆ బ్రహ్మమునందు పరికల్పితములై, జ్ఞాన బాధ్యములైన మిథ్యారూపములు. వీనికి వ్యావహారిక సత్యత్వమే గాని పారమార్థిక సత్యత్వము లేదు. స్వరూపమువలన నివి యన్నియు నేకములే కాబట్టి, అద్వైతమే తత్త్వము. | బ్రహ్మ, జీవుడు, ప్రకృతి ఇవి మూడును తత్త్వములు. ఈ మూడును సత్యములే. పరస్పర భిన్నములు. జ్ఞానైకాకారత్వముచే జీవేశ్వరులకు సామ్యమున్నను, స్వరూపైక్యము లేదు. సూక్ష్మ చిదచిద్విశిష్ట బ్రహ్మాత్మయే స్థూల చిదచిద్విశిష్టమై, కార్యరూపముగ పరిణమించుటచే, విశేషణాంశమందు భేదమున్నను, విశేష్యాంశమున నేకత్వ ముండుటచే, విశిష్టాద్వైతమే తత్త్వము |

| | |
|---|---|
| ౬. బ్రహ్మ స్వరూపాతిరిక్త మైన జ్ఞాన సామాన్య మంతయు అయథార్థము భ్రాంతి కల్పితము. | జ్ఞాన సామాన్య మంతయు యథార్థమే. భ్రాంతి యనఁగా - విషయ బాధ మాత్రమే. |
| ౭. లక్షణా వృత్తిచే శబ్ద జాత మంతయు సన్మాత్రావగాహి యగుచున్నది. | అపర్యవసాయ వృత్తిచే శబ్ద జాత మంతయు పరమాత్మ పర్యంతానుసంధాన మగుచున్నది. |
| ౮. విగ్రహారాధనము సాధనము. | విగ్రహారాధనము సాధ్యము. |
| ౯. సృష్టి యనఁగా - చిన్మాత్రాద్వైత పరమాత్మ యందు అధ్యాస వశమువలన కలిగినది. | సృష్టి యనఁగా - సూక్ష్మచిదచిద్విశిష్టమైన పరమాత్మకు స్థూల చిదచిద్విశిష్టత్వాపత్తిమాత్రమే. |
| ౧౦. సృష్టికి కారణము - అశేష, విశేష ప్రత్యనీక చిన్మాత్ర బ్రహ్మయందు స్వరూప తిరోధాన మైనట్టియు, వివిధ విచిత్ర విక్షేపము చేయునట్టియు, సదసదనిర్వచనీయమైనట్టియు, అనాదియైన అవిద్యారూప దోషము యొక్క అధ్యాస | ఆది సృష్టికి కారణము పరిపూర్ణుఁడైన పరాత్పరుని కేవల లీలయు, అనంతరము జీవుని కర్మయునై యున్నది. |
| ౧౧. సృష్టికి ఆదికారణము అవిద్యా శబలిత చిన్మాత్ర బ్రహ్మ | సృష్టికి ఆదికారణము సూక్ష్మ చిదచిద్విశిష్ట పరమాత్మ. |

౧౨. ప్రళయ మనఁగా - అవిద్య సమూలముగా నశించుటచే, తత్కార్య అధ్యాస నశించి తన్మూలక జగద్రూపము నివర్తింపఁగా, బ్రహ్మకు స్వస్వరూపావాప్తి కలుగుటయే.

ప్రళయ యనఁగా - స్థూల చిదచిద్విశిష్ట పరమాత్మకు సూక్ష్మ చిదచిద్విశిష్టావస్థాపత్తి మాత్రమే.

౧౩. అవిద్యా నివృత్తియే మోక్షము

పరబ్రహ్మ యొక్క సాయుజ్యమును పొంది, తత్సంజనిత బ్రహ్మానందము కలిగి యుండుటయే మోక్షము.

౧౪. జీవ భావము నశించి, బ్రహ్మ స్వరూప ప్రాప్తియే మోక్షానుభవము

ప్రాకృత దేహ - దేశముల విడచి, అప్రాకృత దేహ విశిష్టుఁడై, స్వస్వామియైన పరబ్రహ్మ యొక్క సాలోక్య, సారూప్య, సామీప్య, సాయుజ్యములను పొందిన జీవునకు తత్కైంకర్య సంజనిత నిత్య, నిరవద్య, నిరతిశయ బ్రహ్మానందానుభవమే మోక్షానుభవము ఈ లోకమున కలుగు ఆనందము తత్సూచనా మాత్రమే.

౧౫. ఆత్మైకత్వ ప్రతిపాదకమైన వాక్య జన్య సాక్షాత్కార రూప జ్ఞానమే మోక్ష సాధనము.

కర్మ జ్ఞాన సహకృతమై, తైలధారావత్ అవిచ్ఛిన్న స్మృతి సంతాన రూపమై దర్శన సమానా

రమై, ప్రీతి రూపాపన్నమై, అసకృదావృత్తమై, అభ్యాసాధేయాతిశయమై, ఆప్రయాణాదనువర్తమానమై, ధ్యానోపాసనాది శబ్దవాచ్యమై, భక్తిరూపమైన జ్ఞానమే మోక్ష సాధనము.

౧౬. నిత్యానిత్య వస్తు వివేకము, శమ దమాది సాధన సంపత్తి, ఇహాముత్ర ఫలభోగ విరాగము, ముముక్షుత్వము అను సాధన చతుష్టయ సహకృత శ్రవణ, మనన, నిధి, అధ్యాసనములు సాక్షాత్తు మోక్ష సాధనాంగములు.

వివేక, విమోక, అభ్యాస, క్రియా, కల్యాణ, అనవసాద అనుద్ధర్షలు సాక్షాత్తు మోక్షసాధనాంగములు.

౧౭. బ్రాహ్మణుడై, ఉపవీతుడై, సన్యాసియై నివృత్తి నిష్ఠ గలవాడే మోక్షాధికారి

ప్రజలందఱకు ఉపనయనానంతరము అధ్యయనాధికారము లేదు. వీరు మాత్రమే సాధనాత్మక భక్తియోగావలంబన మూలమున మోక్షాధికారులు.

౧౮. యజ్ఞయాగాదికమైన కర్మ చిత్తమునకు నిర్మలత్వమును కలిగించుట మాత్రమున వివిదిషోత్పత్తియందు మాత్రమే ఉపక

అనభిసంహితమైన కర్మ పరమపురుషారాధన రూపమై, ధ్రువానుస్మృతి రూప భక్తికి సాక్షాత్తు అంగమైయున్నది కాఁబట్టి, దేహ

రించును. కాఁబట్టి, అది జ్ఞానము నకు సాక్షాత్తు అంగము కాఁ జాలదు గాన, అది నిరసింపఁదగినదై యుండును.

వసాన పర్యంతము పై నియమాన సారము కర్మ ఆచరింపఁదగినదై తత్సహకారియై యున్నది.

## వర్ణాశ్రమ వ్యవస్థ

భారత యుద్ధ మూలమున నేర్పడిన వర్ణాశ్రమ సాంకర్య దోషము మోక్ష మార్గమునకు వేరు పురుగై, శ్రీరామానుజ యుగము వఱకు అనువర్తించుచునే యుండెను. ప్రజా సామాన్యమున ఆచరణ శూన్యులైనను, పుట్టుక మాత్రము చేతనే తా మితరులకంటె నధికుల మనియు, ఇతరులు సదాచారానుష్ఠానపరులైనను తమకంటె నీచులనియు, బ్రాహ్మణ - సన్న్యాసాది వర్ణాశ్రమస్థులు అహంకార - అసూయాగ్రస్తులై యుండిరి. వర్ణాశ్రమము లన్నియు సమాన గౌరవ ప్రతిపత్తులు గల వనియు, ధర్మ దేవతకు ఈ యంగము లన్నియు అత్యంతావశ్యకము లనియు, పరస్పరము సమాన భావము, సహాయ భావము, కలిగియుండవలె ననెడి ఉదార భావములు నశించెను. వర్ణాశ్రమ ధర్మము లన్నియు అహంకార మమకారములపై నిలబడి, వాని చేతనే పోషింపఁబడుచుండెను.

మఱి యొక వైపున మిథ్యాచారులు కొందఱు కేవల నివృత్తి మార్గ నిష్ఠుల మని వెల్లడించుకొనుచు, వర్ణాశ్రమ ధర్మములు అవసరము లేదని ప్రచారము చేయుచుండిరి. ఇందువలన, వర్ణాశ్రమ ధర్మములను స్థిరపరచుటకై శ్రీమద్రామానుజులు ఆచరణ మూలమున ప్రచారముఁ జేసిరి.

జన్మాదులచే ఎవ రే వర్ణాశ్రమస్థులైనను, తద్విధ్యుక్త ధర్మముల ననుష్ఠించినపుడు మాత్రమే వారు తద్వాచ్యులు కాఁగల

రనియు, లేనిచో - వారికి సంఘమును ఎట్టి గౌరవ ప్రతిపత్తులున ఉండఁగూడ దనియు, వ్యక్తిగతముగ గూడ అట్టి వారల కెట్టి ఆత్మో జ్జీవ నావకాశము లే దనియు, అన్ని వర్ణములు - అన్ని యాశ్రమముల తమ తమ నియమాదుల పాటించుట ముఖ్య మనియు, అట్టి యాచరణ గల వర్ణాశ్రమము లన్నియు సమాన గౌరవ ప్రతిపత్తులు గల వనియు తద్వారా అట్టి వన్నియు మోక్షార్హము లగుచున్న వనియును శ్రీ మద్రామానుజులు ఎలుగెత్తి చాటెను. ఈ విషయములనే శ్రీ భాష్యమున వారు విశదీకరించి యున్నారు.

౧. శ్రీ భాష్యప్రకమమున శాస్త్రైక్య ప్రస్తావనలో -

"అష్ట వర్షం బ్రాహ్మణ ముపనయీత త మధ్యాపయేత్."
"ఇత్యాది వ్రత నియమ విశేషోపదేశై శ్చాపేక్షితాని విధీయంతే "

౨. లఘు సిద్ధాంతమున

"త దుత్పత్తయే సర్వా ణ్యాశ్రమ కర్మాణి యావజ్జీవ మనుష్ఠేయాని "

౩. లఘు సిద్ధాంతమున —

"తల్లబ్ధి ర్వివేక విమోకాభ్యాస క్రియా కల్యాణా నవసాదా
నుద్ధర్షేభ్య స్సంభవా న్నిర్వచనా చ్చేతి "
"పంచ మహాయజ్ఞా ద్యనుష్ఠానం శక్తితః క్రియేతి "

౪. లఘు సిద్ధాంతమున —

"ఏవం నియమ యుక్తస్య ఆశ్రమ విహిత కర్మానుష్ఠానేనైవ
విద్యా నిష్పత్తి రి త్యుక్తం భవతి ''
"అత్ర అవిద్యా శబ్దాభిహితం వర్ణాశ్రమ విహీనం కర్మ ..
అమృతం బ్రహ్మ. అశ్నుతే - ప్రాప్నోతి త్యర్థః "

౫. లఘు సిద్ధాంతమున —

"బ్రహ్మప్రాప్తి సాధనం జ్ఞానం సర్వాశ్రమ కర్మాపేక్షం ''

౬. మహా సిద్ధాంత సమాప్తమున —

"తస్మా దనాది కర్మ ప్రవాహ రూపాజ్ఞాన మూలత్వాత్ బంధస్య తన్నిబర్హణ ముక్త లక్షణ జ్ఞానా దేవ తదుత్పత్తి శ్చ అహరహ రనుష్ఠీయమాన పరమ పురుషారాధన వేషాత్మ్య యాథాత్మ్య బుద్ధి శేష సంస్కృత వర్ణాశ్రమోచిత కర్మ లభ్యా"

౭. ఉపసంహారమున, జగ ద్వ్యాపార వర్జ్యాధికరణములో —

"ఏవం ధర్మానుగృహీతవర్ణాశ్రమ త దుపాసన రూప త త్సమారాధన ప్రీతః ఉపాసీనాన్, అనాదికాల ప్రవృత్తాన్, ...రతిశయానందం ప్రాపయ్య, పున ర్నావర్తయతీ త్యపి శబ్దా దేవ గమ్యతే"

## భక్తియే మోక్ష సాధనము

భారత యుద్ధము మొదలు లోకమున వ్యాపించిన కామ మార్గ ప్రవృత్తి - క్రమ క్రమముగా నివృత్తి రూపమై, శంకరాచార్యుల కాలమునకు జ్ఞాన యోగమునందు పర్యవసించి యుండెను. శంకరాచార్యుల యనంతర కాలీను లగు భాట్ట, ప్రాభాకర, యాదవ ప్రకాశు లచే ఆ జ్ఞాన యోగము కేవల రస విహీన జ్ఞాన ప్రధానముగను, కర్కశ కర్మ ప్రధానముగను, కర్మ జ్ఞాన సముచ్చయ మిశ్రితముగను వ్యాకులీకృత మొనర్పబడెను.

అట్టి నిస్సారమైన జ్ఞాన యోగమును శ్రీమద్రామానుజులు అమృత ప్రదానముచే రసవంతముగఁ జేసి, భక్తిరూపాత్మకముగ బాగుపరచిరి. కర్మ జ్ఞానములు ఆ భక్తికి అంగము లని నిరూపించిరి.

"మోక్ష సాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ."

అను సిద్ధాంతమును సంస్థాపించిరి ఈ సిద్ధాంత ప్రదర్శనమే శ్రీభాష్య రచనకు ప్రధానాశయము.

౧. శ్రీ భాష్య ప్రార్థనా శ్లోకములో -

"... ... .... .. బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా."

౨. లఘు సిద్ధాంతమున —

"అతో వాక్యార్థ జ్ఞానా దన్య దేవ ధ్యానోపాసనాది

శబ్ద వాచ్యం జ్ఞానం వేదాంత వాక్యై ర్విధిత్సితమ్"

"తస్మాత్ ధ్యాన మేవ విధీయతే"

"సిద్ధం తూపాసన శబ్దా దితి నిర్ణీతమ్"

"ఏవం రూపా ధ్రువానుస్మృతి రేవ, భక్తి శబ్దేనాభిధీయతే"

౩. మహా సిద్ధాంతమున —

"తస్మా దనాదికర్మ ప్రవాహ రూపాజ్ఞానమూలత్వా ద్బంధస్య

త న్నిబర్హణ ముక్త లక్షణ జ్ఞానా దేవ"

("శ్రుత ప్రకాశికాయాం ఉక్త లక్షణ జ్ఞానా దేవ ఉపాసనాత్మకా దేవ.")

౪. శ్రీ భాష్యోపసంహారమున, అనావృత్తి శబ్దా దణుసూత్ర భాష్యమున -

"ఏవ మహ రహ రనుష్ఠీయమాన వర్ణాశ్రమ ధర్మానుగృహీత తదుపాసన రూప త త్సమారాధన ప్రీతః ఉపాసనాది కర్మ ప్రవృత్తా ననంత దుస్తర కర్మసంచయ రూపా అవిద్యాం వినివర్త్య, స్వ యాథాత్మానుభవరూపా అనవధికాతిశయానందం ప్రాపయ్య, పున ర్నావర్తయతీ త్యపి శబ్దా దేవ గమ్యతే."

## విశిష్టాద్వైతము - సగుణ సమర్థనము

పరమ ప్రామాణికము లగు శ్రుతులయందలి కొన్ని వాక్యము లకు ద్వైతులు కేవలము ద్వైత పరముగ అర్థములు చెప్పి, తమ యభి మతమునకు విరోధము గలవిగఁ దోచిన యద్వైత ప్రతిపాదక శ్రుతు లకు అపార్థములఁ గల్పించి, జీవేశ్వరులకు శాశ్వతమైన ఎడబాటును కల్పించిరి. ఈశ్వరునకు వైషమ్య, నైర్ఘృణ్య, పక్షపాతములు గల్పించిరి.

మఱి కొన్ని శ్రుతి వాక్యములకు అద్వైతులు కేవలము అద్వైత పరముగ అర్థములను చెప్పి, తమ యభిమతమునకు విరోధము

లుగఁ దోఁచిన ద్వైత ప్రతిపాదక శ్రుతులను మాయచే గప్పి పుచ్చి, జీవుని సర్వ నాశము గలవానిగఁ జేసిరి. ఈశ్వరుని ఏకాకిగఁ జేసి, నిర్గుణుని గను, నిరవయవునిగను కల్పించిరి.

ఈ ఇరు పక్షములవారును, ఘటక శ్రుతులలో తమ తమ యభిమతములకు అనుకూలములైన యర్థములను మాత్రము చెప్పి, శేషించిన భాగములను విడచిపెట్టుటయో - లేక, మాయము చేయుటయో చేసిరి.

ఇట్టి శోచనీయ స్థితిని శ్రీమద్రామానుజులు తిలకించి, సూక్ష్మ - స్థూలాత్మక - కారణ - కార్యావస్థ రూపముచే విశేషణాంశమున అద్వైత భావులై యుండు జీవేశ్వరుల స్వాభావికమైనట్టియు, జ్ఞానాకారముచే ఏకరూపాత్మకమైనట్టియు, అంశాంశి భావమును, శరీర శరీరి భావమును వ్యక్త పఱచి, వారల నియమ్యరను సేవక సేవ్యులుగ సిద్ధాంత పఱచి, ఉభయుల స్వరూప స్వభావములను ఏ మాత్రము భిన్నము రానీయక సంధాన పఱచి, సర్వ సమునిగ నిరూపించెను.

మఱియు - ఈశ్వరుఁడు లీలా విభూతితో తత్తత్కర్మానుగుణ ఫలితములను జీవులకు కల్పించి, నిత్య విభూతిలో ఆ జీవులు జగద్వ్యాపారమాత్ర వర్జితులై, స్వ సమాన రూప శక్తి సంపన్నులై, స్వకార్య సంజనిత బ్రహ్మానంద మనుభవింపఁజేయు అఖిల హేయ ప్రత్యనీకత్వ, కల్యాణ గుణాకరత్వాది గుణ సంపన్నుఁ డని నిరూపించి, ఈశ్వరునకు పక్షపాతత్వ, నిర్గుణత్వ, నిరవయవత్వములను నిరసించి, విశిష్టాద్వైత తత్త్వమును స్థాపించెను

## తత్త్వము

జగజ్జన్మాది కారణుఁడును, మోక్ష ప్రదాతయు, ఆరాధనీయుఁడును శ్రీనివాసుఁడే యని శ్రీమద్రామానుజులు తమ శ్రీభాష్య

దులలో సిద్ధాంతీకరించి, 'శ్రీభాష్యకారు' లను అన్వర్థ నామముతో సాత్త్వికులకు సదా ధ్యేయులై ప్రకాశించుచున్నారు. శ్రీవారి యుపదేశముల నాచరించుటద్వారా, వారి యనుయాయులమైన మనము వారి పురుషకారము వలన తరింతుము గాక! మన కట్టి భాగ్యమును శ్రీనివాసుడు కృపజేయుగాక!

"సత్యం సత్యం పున స్సత్యం భాష్యకారో జగద్గురుః
స ఏవ స్సర్వ లోకానా ముద్ధర్తా నాऽపి సంశయః."





పూజ్యశ్రీ - త్రిదండి

శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి

# శ్రీ రామానుజ యుగమున నాటి సాంఘిక పరిస్థితులు

'చారిత్రక శిరోమణి'

డాక్టర్: గూడ సుందర రామయ్య ఎం. ఏ. పి హెచ్ డి

✠

## ఉపక్రమము

అపౌరుషేయమైన వేదమే పరమ ప్రమాణముగాఁ గల హిందూ మతము భరత ఖండమున శాఖోపశాఖలుగా విస్తరించినది. ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క సంప్రదాయ ముండుట సహజము. ఇట్టి మత, సంప్రదాయములను గ్రహించుట - అందఱకును ఆవశ్యకము.

ఆధ్యాత్మిక విషయములను, సాధనా క్రమములను, భగవత్సాక్షాత్కార విధానములను మతము బోధించును. సాంఘిక, రాజకీయ, ఆర్థిక వ్యవహారములను, వర్తక - వాణిజ్య - వ్యవసాయ - పారిశ్రామిక రంగములలోఁ గల విశేషములను, ప్రజల దైనందిన జీవిత విధానమును, కళలను, విద్యలను సంప్రదాయము మనకు తెలియఁజేయును. ఇందువలన, ఇట్టి మత - సంప్రదాయములు రెండును ముఖ్యముగా గ్రహింపఁదగి యున్నవి. ఇవి అన్యోన్య సంబంధములై యుండును.

ఇట్టి మత - సంప్రదాయములను అవగాహనము గావించుకొనవలెనన్న, చరిత్రయే మన కాధారము. గత కాలమునందలి విషయములను కొలఁదిగనైన దెలిసికొనుట మిక్కిలి ప్రయోజనకరము.

శ్రీ విశిష్టాద్వైత మతోద్ధారకు లగు శ్రీ భగవద్రామానుజ యుగమునఁ గల సాంఘిక - రాజకీయ - ఆర్థిక పరిస్థితులను, వైష్ణవ మత వ్యాప్తిని పరిశీలించుటయే ప్రస్తుత ప్రయత్నము.

## శ్రీ రామానుజ యుగ నిరూపణము

శ్రీ భగవద్రామానుజులు క్రీ. శ. 1017 - వ సంవత్సరమున చెంగల్పట్టు సమీపమునఁ గల శ్రీ పెరుంబూదూరు గ్రామములో నవతరించిరి వారు కొలఁది కాలముననే సర్వ విద్యా పారంగతులై, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులై, ప్రకాశించిరి. ఆ సమయమున, దక్షిణ భారతములో - జైన, బౌద్ధ, శైవ మతములు విశేషముగా వ్యాప్తినంది యుండెను కేవలము ఈ మతములు వ్యాప్తినంది యుండుటేగాక, ఇతర రంగములందును కొన్ని వ్యత్యాసము లుండి యున్నట్లు చరిత్ర తెలియఁజేయుచున్నది ఈ విషయములు ముఖ్యముగా మనము గమనింపఁదగినవి.

చోళ రాజులు మూడు శతాబ్దములు (క్రీ: శ: 950 - 1250) రాజ్య పాలనము గావించి యుండిరి. వీరిలో కొందఱు శైవ మతావలంబకులై, వైష్ణవ మతమును ద్వేషింప సాగిరి. మత విషయములను రాజకీయములతో మేళవించినఁగాని పరిపాలన పటిష్ఠముగా నుండదని వారు తలపోసి, ఇతర మతములను ఎరసింప దొడంగిరి.

క్రీ: శ: 11, 12 శతాబ్దములు శ్రీరామానుజ యుగముగా మనము గ్రహింపవచ్చును. ఆ నాఁటి సాంఘిక, - ఆర్థిక - రాజకీయ పరిస్థితులను, మత ప్రాబల్యమును మనము పరిశీలింతముగాక !

## రాజ్యాంగము - సంఘ జీవనము

చోళరాజులు వారి రాజ్యమును అనేక భాగములుగా విభజించి, అందు చివరి భాగమును గ్రామ మని వ్యవహరించిరి, ఆ గ్రామీణులు లా కాలమున గేదెలు, ఆవులు, ఎద్దులు మొదలగు పశు

వులను మిక్కిలి శ్రద్ధతో పెంచుచుండెడివారు. కొబ్బరి, అరటి, పోక మున్నగు చెట్లను, తమలపు తీగెలను పెంచుచుండెడివారు. గ్రామీణ స్త్రీలు అతి సౌందర్యవతులై యుండి, మేలి రకపు సువర్ణాభరణము లను ధరించి, ధాన్యము పొలమునందున్నపుడు కాపలా కాయు చుండెడివారు. చిన్న పిల్లలు కాళ్ళకు అందెలు ధరించి, త్రి చక్ర రథములపై ఆట లాడుకొనుచు, వారికి అడ్డుపడువారి నందఱిని కసరి కొట్టుచుండెడివారు. ఈ బాల క్రీడలు చూడ సొంపుగా నుండెడి వట! కావేరీ నది సస్యశ్యామలములైన పైరు పంటలం గూడిన సార వంతము లగు మాగాణీ భూములతో పరివృతమై ప్రకాశించుచుండె డిది. భూములు సారవంతము లగుట వలనను, నీటి వసరులు విశేషముగ నుండుట వలనను కర్షకులా భూములలో సంవత్సరమునకు రెండు - మూడు పంటలను పండించుచుండెడివారు.

చేర - చోళ - పాండ్య రాజ్యములందలి ప్రజలు - సంఘీ భావమే బల మనెడి సిద్ధాంతము ననుసరించి సమైక్యముగా జీవించు చుండెడివారు. సాంఘిక - ఆర్థిక రంగములలోఁ గల తర తమ భేదము లను ఆ నాఁటి ప్రజలు గుర్తించి, తదనుగుణముగా వర్తించుచుండిరి. కాని, ఆ యా భేదములు తమ కర్మ ఫలము లని తలంచుచుండెడివారు. తిరుగుబాటు చేయుట, చట్ట ధిక్కార మొనరించుట ఆ నాఁటి ప్రజ లెఱుంగరు. ఈ రాజ్యములందు అచ్చటచ్చట దోపిడిగాం డ్రుండి నట్టుల గానవచ్చును. వేటగాండ్రు - పలు విధములైన విల్లంబులను, గొల్లవాండ్లు - పాలు, పెరుగు, వెన్న, నేయి, ఉన్ని మున్నగు వానిని విశేషముగా గలిగియుండెడివారు. దేశ నాయకులకు, రణ రంగములో వీర మరణము జెందిన త్యాగ మూర్తులకు స్మృతి చిహ్నములుగా రాతి

విగ్రహములు నిర్మించి, ప్రజలు వారి యాత్మశాంతికై భగవంతుని ప్రార్థించుచుండెడివారు.

ఆ నాంటి రాజులు నియమ నిష్ఠలతో ఋజు మార్గమున ప్రవర్తించుచు, ప్రజలను ప్రేమతో పరిపాలించుచుండెడివారు. అందువలన, ప్రజలు ప్రభువుల యెడ భక్తి విశ్వాసములు గల్గి ప్రవర్తించుచుండెడివారు. కళలను, వాఙ్మయమును, మతమును ప్రభువు లాదరించి పోషించుచుండెడివారు. నిత్యము ధర్మాసన మధిష్ఠించి, ప్రజల సాధక బాధకముల నాలకించి, వారికి మేలు చేకూర్చుచుండెడివారు. ప్రజలలో పరస్పర మేర్పడిన తగాదాలను విని, న్యాయ సమ్మతముగా తీర్పు చెప్పుచుండెడివారు.

ఆ కాలమున రాజ్యాంగమునందు బ్రాహ్మణులకు ప్రముఖ స్థాన ముండెడిది. రాజులు తమ దైనందిన కార్య కలాపములలో - బ్రాహ్మణుల సలహాలను విశేషముగ పాటించుచుండెడివారు బ్రాహ్మణులను నొప్పింపక పాలించెడు రాజులను ప్రజ లెక్కువగా పొగడెడివారు. రాజులు - పవిత్రములైన తమ ప్రవర్తనను బట్టియు, ధర్మాచరణమును బట్టియు ఆ యా ఋతువులను గూడ, శాసింపఁగలరని ప్రజలు విశ్వసించుచుండెడివారు. ఏడుగురు రాజులను జయించిన రాజు - అత్యధికుఁడుగా - చక్రవర్తిగా పరిగణింపఁబడి, ఆ యా రాజ్య చిహ్నములను తన కంఠాభరణమునందు ధరించెడివాఁడు. ప్రతి పరాక్రమవంతుఁడైన రాజు - దిగ్విజయ యాత్ర చేయుచుండెడి వాఁడు.

పాండ్య రాజ్యమునందలి ప్రజలు తమ గృహములను గోమయముతో నలికెడివారు. వీరు తారతమ్యములు లేక, నేలపైఁ గూర్చుండి, అన్ని విషయములను చర్చించెడివారు. పంచ భూతము

లలో ప్రథమ భూత మగు భూమినుండి మన ముద్భవించితి మనియు, మనకు కావలసిన పదార్థము లన్నియు భూమినుండియే లభించు చున్నందునను, మనము తిరిగి భూమిలోనికే పోవువారము గనుకను అట్టి భూదేవిని గౌరవించుట సమంజస మనియు - కనుక, భూమిపై గూర్చుండుట ఆ భూదేవికి గౌరవ సూచక మనియు వారి విశ్వాసము. వారి దైనందిన జీవిత కార్య కలాపముల లోనే మాత్రము అశ్రద్ధ వహించియుండువారు కారు. ప్రత్యహము ఉదయ సాయంకాలముల యందు స్నాన మాచరించుట, వారమున కొకసారి అభ్యంజన మాచరించుట వారు విధిగా భావించెడువారు. ఆ రీతిగా నెవరేని స్నాన విధి నుల్లంఘించినచో - అట్టి వారిని అంటరానివారినిగా జూచెడివారు.

భోజన విధి యందును వారి శ్రద్ధ గమనార్హము. భుజించెడి పదార్థ మేదియైనను దక్షిణ హస్తముతోనే భుజించెడివారు. నీరు త్రావుటయందును ఈ యాచారమునే వారు పాటించెడివారు. ఎవరేని అతిథి యేతెంచిన యెడల, ఆ యతిథి తన సొంత భోజన పాత్రను, పాన పాత్రను వెంట దెచ్చుకొనవలసి యుండును. అట్లు వానిని దెచ్చుకొననిచో - అతనికి ఆకులోగాని, మట్టి మూకుడులో గాని భోజన పదార్థము లిడి, మట్టి ముంతతో మంచినీటి నిచ్చెడివారు. ఆ రీతిగా నొకసారి యుపయోగించిన మట్టిపాత్రలను మరల నుపయోగింపక, దూరముగా పారవైచెడివారు.

ధర్మాచరణమునందు ఆ నాటి ప్రజలు అత్యంతాసక్తిని చూపుచుండెడివారు. జూదము, త్రాగుడు మున్నగు దురభ్యాసము గల వారిని మిక్కిలి హేయముగ జూచెడివారు.

ఆ కాలమున శరీర శాస్త్ర వేత్త లనేకు లున్నట్లు తెలియు చున్నది. శరీర సౌష్ఠవ పటిష్ఠతల ననుసరించియు, నిర్మాణమును బట్టియు - మానవుని జాతకమును నిర్ణయింపగల్గిన మేధావు లున్నట్లును

పద్ధతి, చేర - చోళ రాజ్యముల దలి ప్రజలకును, రాజులకును ఆచారముగా నుండెడిది. కరికాళ చోళుఁడు తన రాజ భవనమునకు అతిథిగా వచ్చినవానిని షడ్రసోపేతమైన భోజనముతో తృప్తి పఱచి, అతనిని సాగనంపుటకు అతనితో సప్త పదములు (ఏడడుగులు) నడచి వచ్చి, అతనిని యథార్హ సన్మానముగా వించి పంపెడివాఁడట! ఆ కాలములో - గోవధ, స్త్రీ హత్య, భ్రూణ హత్య, బ్రాహ్మణ హత్య, బ్రాహ్మణ ద్రోహము మున్నగు వానిని మిక్కిలి నీచ కార్యములుగా భావించుచుండెడివారు. ఇట్టివి - కృతఘ్నతను అత్యంత హేయముగ తలంచుచుండెడివారు.

కాల ధర్మము చెందినవారిని, వారి వారి ఆశ్రమ ధర్మముల ననుసరించి, ఖనన - దహన సంస్కారములను చేయుచుండెడివారు. వితంతువు విగత జీవుఁడైన తన భర్తకు పిండప్రదానము దర్భలపైఁ జేయుట కనుమతింపఁబడుచుండెడిది. భర్త మరణించినచో - భార్యయు నిశ్చింతగా చితియందు దుమికి, ప్రాణత్యాగము చేసెడిది. అట్టి స్త్రీయే ఆనాఁడు నిజమైన సతిగా పరిగణింపఁబడుచుండెడిది.

## రాజ్య పాలనము

చోళరాజులు తమ పరిపాలనమునఁ గల ప్రాంతము నంతటిని అనేక మండలములుగా విభజించి, ఆ మండలములను కోట్టములుగా - కోట్టములను నాడులుగా - నాడులను కుర్రములుగా విభజించిరి. రాజ్యాధికారము వంశపారంపర్యముగను, ఏకరాజ్యాధిపత్యముగను ఉండెడిది. ఆర్యులచే కనుఁగొనఁబడిన రాజ్యాంగ నిర్మాణ విధానమును ఈ చోళరాజులు ఆచరణమందుంచిరి. కాని, రాజ్యాంగము లన్నియు రాజుయొక్క అధికారమునకు లోఁబడి, అతని వశముననే యుండెడివి. రాజ్యాంగములలో అత్యంత ప్రధానమైన కోశాధిపత్యము, కోశాగార సంరక్షణము, ధన సేకరణము మున్నగునవి రాజు

యొక్క పర్యవేక్షణమునందే యుండెడివి. ఆ చోళరాజులు కుంభకోణములో విశేష ధనమును వెచ్చించి కోశాగారమును నిర్మించి, అతి సురక్షితముగా నుంచఁగల్గిరి. రాజు నిరంకుశాధికారిగా నుండెడివాఁడు. కాని, అత్యవసర పరిస్థితులందును, అతి ముఖ్య విషయములందును శాస్త్రజ్ఞులనుండియు - మంత్రులనుండియు సలహాలను పొందుచుండెడివాఁడు. అంతేగాక, ఈ శాస్త్రజ్ఞులు, మంత్రులు, కొన్ని వేళలలో రాజును అదుపులో బెట్టుచుండెడివారు. ఆ కాలమున సంప్రదాయ సిద్ధాంతములకు విశేష గౌరవ మొసఁగుచుండుటచే, ఏ రాజైనను ఆ సంప్రదాయమునకు తమ శక్తి యుక్తులను వినియోగించెడివాఁడు. అట్టి రాజును ప్రజలు ప్రత్యక్ష దైవముగా భావించెడివారు. ఆ కాలపు రాజ్యపాలన విధానమును, సాంఘిక పరిస్థితులను ఇంకను విపులముగాఁ దెలియఁగోరువారు - 'తిరువళ్ళువర్' రచించిన దేశ చరిత్రను పరిశీలింపవచ్చును.

రాజును ప్రజా పాలకునిగా - ప్రజా పోషకునిగా - ధర్మ సంరక్షకునిగా ప్రజలు సంభావించిరి. రాజును-అట్లే ప్రజా క్షేమమునకు, ధర్మ సంరక్షణమునకు ప్రముఖ స్థాన మిచ్చుచుండెడివాఁడు. ఆ నాఁటి ప్రజా జీవిత మంతయు మత సంప్రదాయములతో కట్టుబడి యుండెడిది. అందువలన, రాజు ధర్మ మార్గమున రాజ్య పాలనము చేయువాఁడనియు, తత్ఫలముగా - ఏ యితర అవాంతరములు సంభవింపనేరవనియు ప్రజలు విశ్వసించుచుండెడివారు

ఆ నాఁటి ప్రజల హక్కులను ఈ నాఁటి శాసన సభను పోలిన సభ యొకటి కాపాడుచుండెడిది. పురోహితులు సంప్రదాయ బద్ధములగు సర్వ వైదిక కార్యములను యథావిధిగా నిర్వహించుచుండెడివారు. ప్రజలకు వ్యాధు లేర్పడి, బాధపడునప్పుడు, వైద్యులు

వెంటనే ఆ వ్యాధులకు తగిన చికిత్స లొనర్చి, వారికి ఆరోగ్య భాగ్యమును చేకూర్చుచుండెడివారు. అవసరమైనచో - ఆ వైద్యులకు రాజవైద్యుఁడు కూడ తోడ్పడుచుండువాఁడు. బహిరంగ సభలకు, సమావేశములకు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు సుముహూర్తము లనునిర్ణయించుచుండెడివారు. పరిపాలనము సౌష్ఠవముగ జరుగుటకును, ప్రజల స్థితిగతులను గుర్తించి, వారికి సర్వతోముఖముగా తోడ్పడుటకును, గస్తులు సక్రమముగా వసూలు జరిపించుటకును మంత్రులు రాజ్యమందంతటను అప్పుడప్పుడు పర్యటించుచుండెడివారు. వివిధ శాఖీయులొకచో జేరి, వివిధ విషయములు విపులముగా చర్చించుకొనుటకు రాజధానియొక్క ప్రధాన నగరములో విశాలమైన భవనములు నిర్మింపఁబడి యుండెడివి. ఈ విధమైన రాజ్యతంత్రము పాండ్య - చోళ రాజ్యములలో నుండెను. ఈ పాండ్య, చోళరాజులు - ఇట్టి రాజ్యాంగ పరిపాలనా విధానమును మగధ దేశమునుండి గ్రహించినట్లు తెలియవచ్చుచున్నది.

ఆ కాలములో ముఖ్యముగా మెచ్చదగిన యంశము స్వపరిపాలనము. గ్రామస్థులను పరిపాలించుటకై, వారిచే ఎన్నుకొనఁబడిన సభ్యులకు 'సభ' యని పేరు. ఈ సభలో సభ్యుఁడు కావలె నన్న, అతఁడు కొన్ని యర్హతలు కల్గియుండవలెను. సంవత్సరమున కొకసారి ఆ సభలో సభ్యులు ఎన్నిక చేయఁబడుచుందురు. ఒకసారి సభ్యుఁడైనవాఁడు, మఱి యొకసారి సభ్యుఁ డగుటకు అవకాశము లేదు. నూతన సభ్యులనే ఎన్నుకొనుచుండుట ఆ నాఁటి పద్ధతి.

౧. సాధారణ పరిపాలన
౨. దేవాదాయ నిర్వహణ
3. న్యాయ విచారణ
౪. సౌకర్య విస్తరణ
౫. పంటల పర్యవేక్షణ
౬. సరస్సుల సంరక్షణ

అను ఆరు ఉప సంఘములుగా 'సభ' విభజింపఁబడి, గ్రామ పరిపాలన మంతయు ఈ శాఖల పర్యవేక్షణము క్రిందనే కొనసాగుచుండెడిది.

౧. పంటల యభివృద్ధికై ప్రోత్సాహ మిచ్చుట
౨. పన్నులు వసూలు చేయుట
౩. ధనమును ఋణముగా దీసికొనుట
౪. ధర్మ కార్యములకు భూదానాదులు చేయుట
౫. న్యాయమును పరిరక్షించుట
౬. ప్రాథమిక విద్యను వ్యాప్తి గావించుట

అను ఆరు అధికారములు ఆ నాఁటి సభకు ప్రత్యేకముగా హస్తగతమై యుండెడివి. ఈ రీతిగా చోళరాజులు తమ రాజ్యమును స్వపరిపాలనమునందు వర్తింపఁజేసి, ప్రజల సౌభాగ్యమే దేశ సౌభాగ్యముగ భావించి, మూఁడు శతాబ్దములు ఏకగ్రీవముగ రాజ్యపాలనము జేసి, ప్రజా జీవితమును సుఖమయము గావించి గణ్యత గాంచిరి

## యుద్ధములు - సైన్యములు

ఆ కాలమున సైన్యమును - విలుకాండ్రు, అశ్వికులు, గజారోహకులు, కాల్బలము అను నాల్గు విధములుగా విభజించిరి. నౌకాదళముకూడ అభివృద్ధిగావింపఁబడెను సర్వ సైనికులకు, సకల నిధులకు ఆ దేశప్రభువే అధిపతిగా నుండెడివాఁడు. లంకా ద్వీపమందును, లక్ష ద్వీపమందును, అండమాన్, ఇండోనేషియా, చైనా, బర్మా, నికోబారు దీవులు, మలయా, సియామ్ దేశములయందును, పటిష్ఠమైన

నావికా కేంద్రముల నేర్పఱచి, బంగాళాఖాతమును చోళులు వారి సొంత సముద్రముగా భావించి, దానిని 'చోళ సరస్సు' అను పేర వ్యవహరించిరి.

ఆ కాలమున సుశిక్షితమైన సైన్యము రాజుచే పోషింపఁబడు చుండెడిది. సేనా నాయకులకు 'సేనాధిపతి' యను బిరుదును, అంగుళీ యకమును గౌరవ చిహ్నముగా నిచ్చెడివారు. సైనికులను సమీకరించుటకై నగారాలు ప్రయోగింపఁబడెడివి. యుద్ధమునకు బయలు దేరుటకు ముందు - సైనికులు, సేనాధిపతులు అనేక దేవ పూజలను గావించెడివారు. యుద్ధ సన్నద్ధులై బయలుదేరునపుడు వీరు - సర్వ సన్నాహములను సమకూర్చుచుండెడివారు. యుద్ధారంభమునకు ముందు పర రాజుల గోవులనుగాని, భూములనుగాని ఆక్రమించుకొని, అనంతరము మేధావియగు నొక బ్రాహ్మణుని, పర రాజు కడకు రాయబారిగా బంపెడివారు. సైనికులైన పురుషులను యుద్ధమునకు స్త్రీలు సాగనంపుచు, వారి శిరస్సులపై అక్షతలు, పూలు చల్లి, జయీభవ! విజయీభవ! అని దీవించెడివారు.

శత్రు సేనల చర్యలను గమనించుటకు సుశిక్షితులైన గూఢచారు లనేకులను నియోగించెడివారు. ఇట్టి గూఢచారులకును, రాజునకును మిక్కిలి సన్నిహితత్వ ముండెడిది. యుద్ధమునందు మరణమున్న, ఏ సైనికుఁడును భీతిల్లెడువాఁడు కాఁడు. విజయమో - వీరస్వర్గమో పొందవలెగాని, రణ రంగమునుండి వెనుదిరిగి వచ్చెడి వారు కారు. యుద్ధ రంగమునందుగాక, మఱి యొకచోట క్షత్రియుఁడు మరణించిన యెడల, వాని శరీరమును కత్తితో ఖండించి, దర్భలపై నిడి, మంత్ర పూతముగా అపర కర్మను నిర్వర్తించెడివారు. ఇట్టి కర్మవలన ఆ క్షత్రియునకుఁగూడ వీర స్వర్గము లభించునని వీరి విశ్వాసము. యుద్ధములో వీర మరణము నందినవారి శిలా ప్రతిమలను నెలకొల్పి, దానిపై వారి

వీరోచిత కృత్యములను చెక్కించెడివారు. యుద్ధమునందు గాయపడిన సామాన్య సైనికులకుఁగూడ రాజవైద్యులు తగిన చికిత్స జేసి, గాయములను మాన్పి, ఉత్సాహ ప్రోత్సాహములను గల్పించి, మరల వారిని రణ రంగమునకుఁ బంపుచుండెడివారు.

రాజుల యుద్ధార్థ్వములో పటిష్ఠమైన నావికా దళముండుటచే, విదేశములలో వ్యాపార వాణిజ్యములు విరివిగా కొనసాగుచుండెడివి. ఇట్లు కొనసాగుచున్న వ్యాపార వాణిజ్యములు ప్రత్యక్షముగా పరిశీలించిన ఒక పాశ్చాత్య యాత్రికుఁడు - 'ఈ రాజుల నావికా బలము వీరికి పెట్టని కోటగోడవలె నున్న' దని మిక్కిలి ప్రశంసించెను.

## విదేశ వ్యాపారము

యూదు దేశస్థుఁ డగు బెంజిమన్ అను నతఁడు, క్రీ: శ: 1170 ప్రాంతములలో చోళ రాజ్యమును పరిశీలించి, వ్యాపార రంగమున వారి ఉన్నత స్థితిని గమనించి వ్రాసిన పంక్తులు ఈ సందర్భమున పేర్కొనఁదగినవి.

"విదేశీయుల పడవలు తమ తీర ప్రాంతమును చేరిన వెంటనే, రాజాధీనమునందుఁ గల నావికు లచ్చటికిఁ బోయి, ఆ విదేశ నావికులకు వలయు సౌకర్యముల నేర్పఱచి, అనంతరము రాజుకు ఆ పడవల రాక నెఱింగించెడివారు. ఈ చోళ రాజ్యము వ్యాపారమందే గాక, ఇతర రంగము లన్నింటియందును నిజాయితీగా, సమ్మకముగా వ్యవహరించుట ప్రశంసనీయమైన విషయము విదేశ నౌకలు తమ రేవుకు వచ్చిన వని వార్తా వాహకులు చెప్పిన వెంటనే, ఆ విదేశీయులు తమ పడవుల నక్కడ వదలి, పట్టణములోఁ గల వ్యాపారస్థులతోఁ గలసి తమ సరుకుల యమ్మకమునకు తగిన ప్రయత్నములను కొనసాగించెడివారు. రాజోద్యోగులు, రాజ వర్తకులు ఆ యా నాణ్యతనుబట్టి వెలలను నిర్ణ

యించెడివారు. ఆ వెలలు ఆ విదేశీయులకు సమ్మతమైనచో - ఆ పడవులలోని సరుకులను రాజోద్యోగుల స్వాధీన మొనర్చెడివారు. ఇట్టి వ్యాపారము దేశ మంతట నుండెడిది."

ముఖ్యముగా చోళ రాజ్యమునుండి ఏనుగులు, గుఱ్ఱములు, నీలములు, ఇంద్రనీలములు, చంద్రకాంత శిలలు, ముత్యములు, కెంపులు, వజ్రములు, పుష్పరాగములు, పద్మరాగములు, మరకతములు, చందనము, కర్పూరము, కస్తూరి, కుంకుమపువ్వు, మున్నగు వస్తువులను ఇతర దేశములకు బంపెడి వస్తువులు - ప్రమాణములలో చిన్నవిగను, విలువలో నధికముగను ఉండునట్లు చూచెడివారు. ఇట్టి వస్తువులలో - అంబరు, దంతము, కాగితము, సుగంధ ద్రవ్యములు, ఔషధులు మున్నగునవి ముఖ్యములు.

## ముత్యముల వ్యాపారము

పాండ్య రాజ్యము ముత్యములకు మిక్కిలి ప్రసిద్ధి గాంచినది. సముద్రములో ముత్యపు చిప్పలను బట్టుటయం దారితేరినవా రా దేశమున కొంద ఱుండెడివారు. వారు - సింహళ ద్వీపమునకు చైత్ర మాసారంభమున బయలుదేరి, వైశాఖ మాసాంతము వఱకును సముద్రమున పడవులలో పర్యటించుచు, ముత్యములను సేకరించుచుండెడివారు వారికి నలయు సౌకర్యములను వర్తకులు సమకూర్చుచుండెడివారు. ముత్యములను సేకరించునప్పుడు వారికి సముద్రములో కొందఱు జాలరులు సహాయపడుచుండెడివారు నీటిలో కనుబడిన ముత్యపు చిప్పలను వారి నడుము చుట్టును గల పట్టాలలో భద్రపఱచుకొని పైకి వత్తురు. ఇట్లనేక పర్యాయములు నీటిలో మునుగుచు, పైకి తేలుచు, ముత్యపు చిప్పలను సేకరించెడివారు అట్లు సేక

లభించిన ముత్యములలో పదియవ భాగమును ఆ రాజ్య పాలకునకు సుంకముగా నిచ్చెడివారు. ఇరువదవ భాగము తమకు తోడ్పడిన జాలరుల కొసంగెడివారు మిగిలిన ముత్యములను వారు దేశ ప్రజలకు విక్రయించుచుండెడివారు. ఆ కాలమున రాజానుమతి లేక పర రాజ్యములకు ముత్యములను దీసికొని వెళ్ళరా దను శాసన ముండెడిది. అంతే కాదు - ఎవరి కడ నైనను విలువగల ముత్యములుగాని, ఆభరణములుగాని, ఇతర వస్తువులుగాని ఉన్నచో - అవి రాజాధీనము నందుండ వలె ననియు, అట్టివానిని గనిపెట్టి తెచ్చి యిచ్చినవారికి, ఆ వస్తువుల వెలలతోఁ బాటు పారితోషికము కూడ నీయఁబడుననియు రాజ శాసనము. ఆ కారణమున, ప్రజలలో నెవరేని తమ వద్ద విలువగల ముత్యము లున్నచో, వానిని రాజునకు సమర్పించుటకై సిద్ధపడెడువారు.

ముత్యములు, కెంపులు, వజ్రములు మున్నగువానిచే పొదగఁబడిన నూట యెనిమిది మణులు గల కంఠహారమును రాజు ధరించెడివాఁడు. ఈ కంఠహారము విలువ కట్టుటకు వీలుగానంతటి యమూల్యాభరణముగా నుండెడిది. కరములకు కంకణములవంటి యాభరణములను, పాదములకు గండపెండెరమువంటి యాభరణములనుఁ గూడ రాజు ధరించుచుండెడివాఁడు. ఈ యాభరణము లన్నియు - ఒక దానికంటె నొకటి - ఆకర్షణీయముగా, అమూల్యముగా నలరారుచుండెడివి. ఇట్లు రాజుచే ధరింపఁబడిన యాభరణముల విలువ, ఆ రాజధానిలో నుండు సర్వ సంపదలకంటెను మించి యుండెడి నఁట! వ్యాపారులు సమర్పించు ముత్యములవలనను, ప్రజలొసంగు సుంకముల వలనను, ఆ రాజుయొక్క కోశాగారము పరిపుష్టి గలిగి, ప్రకాశించుచుండెడిది. ఇట్టి భోగ భాగ్యములతో రాజు తులతూఁగుచున్నను, అతఁడు అప్రమత్తుఁడై, దేశమున శాంతి భద్రతలను కాపాడుచుండెడివాఁడు.

## వ్యవసాయము - పరిశ్రమలు

చోళ రాజుల పరిపాలనములో - దేశమున వ్యవసాయము, పరిశ్రమలు ప్రధాన స్థాన మాక్రమించినవి. సారవంతమైన భూము లుండుట వలనను, కావేరీ నది నుండి నిరంతరము నీరు ప్రవహించుచుండుట వలనను క్షేత్రములు సస్యశ్యామలములై విలసిల్లుచుండెడివి! ఆ కాలములో - కార్మిక, కర్షక వర్గములవారు 'వెళ్ళార్' అనియు, భూస్వాములు - 'అరసు' లనియు వ్యవహరింపఁబడిరి. భూస్వాములు చాల మంది విద్యావంతులై, ఉద్యోగములను సంపాదించి, రాజ్య పాలన మందును, సైన్యము నందును తమ శక్తియుక్తులను వినియోగించుచుండెడివారు భూస్వామియొక్క స్థితిగతులను బట్టియు, అంతరువును బట్టియు రాజుతో కొంత సన్నిహిత సంబంధ మేర్పడి, రాజుయొక్క సాహచర్యము భూస్వాములకు లభించుచుండెడిది.

ఆ కాలమున కర్షకులలో చాల మందికి సొంత భూములు లే వనియు, భూస్వాములనుండి భూములను వారు కవులుకు దీసికొని కృషి జేయుచుండెడివా రనియు, అట్టి కర్షకులకు రాజుచే సర్వతో ముఖమైన సహకారము లభించుచుండెడి దనియు - 'పురనానూరు' కృతులవలన దెలియుచున్నది.

ఆ నాఁటు నేత పరిశ్రమకును ప్రముఖ స్థాన ముండెడిది. నేత పనిలో ఆరితేరినవా రనేకులు తమ నైపుణ్యమును బాగుగా ప్రదర్శించి, పట్టు, నూలు వస్త్రములను వివిధ వర్ణములతో, వివిధ రీతులతో ఆకర్షణీయముగ తయారు చేసెడివారు. అవి స్వదేశమునఁ గాక, విదేశములందును ఆదరింపఁబడుచుండెడివి.

ఆ కాలమున అవంతీ రాజ్యమునుండియు, యవన దేశము నుండియు వివిధ రంగములలో నైపుణ్యము గల యువకు లనేకులం

తమిళ దేశమునకు వలస వచ్చి, స్థిర నివాసములు నేర్పఱచుకొని యున్నట్లు తెలియుచున్నది.

## సుంకములు - పన్నులు

వ్యాపార సుంకముల వలనను, భూమి శిస్తుల వలనను రాజ్యము ఆర్థిక పరిపుష్టి గలిగి, యలరారుచుండెడివి. విదేశ వ్యాపారమునకూడ పన్నులు విశేషముగ లభించుచుండెడివి. స్వదేశ వ్యాపారమందు కంటెను, విదేశ వ్యాపారమున అధికముగా పన్నులు విధింపఁబడు చుండెడివి. భూ ఖామందు - తన భూమిలో పండిన పంటలో, ఆరవ భాగమును రాజుకు శిస్తుగా చెల్లించుచుండెడివాఁడు. అది ధాన్య రూపమునగాని, ద్రవ్య రూపమునఁగాని చెల్లింపఁబడుచుండెడిది.

## సంస్కృతి - సభ్యత

క్రీ: శ: పదియవ శతాబ్దము మొదలు, పండ్రెండవ శతాబ్దము కడకును ప్రబలిన సంస్కృతి - సభ్యతలు, ఆర్య - ద్రావిడ సంప్రదాయ సమ్మేళన సంయుతములై, నూతన కాంతులతో సముల్లసించి నవి.

ధర్మ శాస్త్రములలో ఎనిమిది విధములుగా చెప్పఁబడిన వివాహములను తమ దేశ ప్రజలలో వ్యాప్తి జేయుటకు తమిళులు ప్రయత్నించిరి. బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యము లనఁబడు నాల్గు వివాహ పద్ధతులను - 'పెరుందిణై' యనియు, ఆసుర - గాంధర్వ - రాక్షస - పైశాచికము లనఁబడు నాల్గు వివాహ పద్ధతులను - 'కైక్కిళై' యనియు వారు వ్యవహరించిరి.

## మతము - జీవితము

దక్షిణ భారత దేశమున ప్రబలిన మతములలో - భక్తిమార్గము పండ్రెండవ శతాబ్దారంభమున మిక్కిలి ప్రాధాన్యము వహించెను. ఏ దేవుని దైవమును శ్రద్ధాసక్తులతో ధ్యానించుటయే భక్తి యని, స్తోత్రకారుల శ్రీసూక్తి తదనుసారముగా ఆనాటి ప్రజలు భక్తి భావముతో దైవము నారాధించుచుండెడివారు.

శాతవాహను పరిపాలన మస్తమించిన యనంతరము, పాండ్య - చేర - చోళ రాజ్యములు వివిధ రీతుల వర్ధిల్లినవి. ఈ ప్రభువుల కాలములో - బౌద్ధ, శైవ, వైష్ణవ మతములు బాగుగా వర్ధిల్లినవి.

ఆర్యులలో - దేవాలయ మన్ననను, దేవతార్చన యన్నను అత్యంతాసక్తి యగుపడుచుండును. వైదికములైన యజ్ఞ యాగాది క్రియలకు వలెనే, దైవారాధనమునకు ఆర్యులు అధిక ప్రాధాన్య మొసంగి యుండిరి. ఆ నాటి ప్రజలు, వైదిక కర్మ కాండయందు గాఢ విశ్వాసము గలవా రగుటచే, యజ్ఞ యాగాదులను విశేషముగా నిర్వహించి, దేవతలను సంతృప్తి పరచి, తాము వివిధ రీతులుగా వర్ధిల్లిరి. ఇట్లే, దేవాలయములలో నిత్యార్చనాదులను, వన మహోత్సవములను అత్యంత భక్తిభావముతో వారు జరిపించుచు, ఆనందించుచుండెడివారు. ఆలయములలో అర్చకులు దేవుని సుప్రభాతముతో మేల్కొలిపి, పవిత్ర జలముతో నభిషేకించి, పీతాంబరములను కట్టబెట్టి, పుండ్రము దిద్ది, పూలతో - తులసీ దళములతో - అక్షతలతో పూజించి, ధూప దీపము లొసంగి, నైవేద్య మారగింపజేసి, కథా కాలక్షేపములతో - కళా ప్రదర్శనలతో భక్తుల నానందింపజేసి, రాత్రి పవళింపు సేవ జరుపుట - నిత్యము పరిపాటిగా నుండెడిది.

ఇట్లే రాజ ప్రాసాదమునందును రాజుకు వివిధ పరిచర్యలు నిర్ణీత సమయములలో నిత్యము జరుగుచుండెడివి.

'కోయిల్' అను తమిళ శబ్దమునకు - దేవాలయము, రాజ ప్రాసాదము అని రెండర్థములు కలవు. దక్షిణ భారతమున 'కోయిల్' (దేవాలయము) వలె రాజమందిరమునకే ప్రాసాదమును నిర్మించు ఆచారము కలదు. గంగైకొండ చోళపురము నందును, చోళ రాజధాని యగు తంజావూరునందును ఇట్టి ఆలయములు, ప్రాకారములు ప్రక్క ప్రక్కనే నిర్మింపబడియున్నట్లు చరిత్ర తెలియజేయుచున్నది

## ఆలయ నిర్మాణము - శిల్ప కళ

చోళులు తమిళ దేశమునుండి ఆంధ్ర దేశమునకు వలస వచ్చి, 7 - వ శతాబ్దము మొదలు, 11 - వ శతాబ్దము వరకు రాజ్య పాలనము జేసిరి. వీరి పరిపాలనములో వర్ధిల్లిన దేవాలయ నిర్మాణము, శిల్పకళ మిక్కిలి మెచ్చదగినవి. ఇట్లే, పల్లవుల రాతి దేవాలయ నిర్మాణము, శిల్పకళ అద్భుతమైనవని చెప్పవచ్చును. దేవాలయ నిర్మాణమందును, శిల్పకళయందును చోళరాజులు - పల్లవుల సంప్రదాయము నభిమానించుటయేగాక, ఆ సంప్రదాయముల ననుసరించి యున్నట్లును తెలియుచున్నది. వారు - దక్షిణ భారతమంతటను అచ్చటచ్చట అనేక దేవాలయములను నిర్మించిరి. మొదటి చోళుడు (క్రీ. శ: 985 - 1014) పల్లవుల శిల్ప కళను దృష్టిలో నిడుకొని, ఆలయములను కట్టించెను. తిరునల్వేలి మండలమునగల తిరువాలీశ్వరాలయ శిఖరమునుబట్టికాని, గోపురమునుబట్టికాని నాటి శిల్పశాస్త్ర సంపదను, శిల్పకళా నైపుణ్యమును మనము తెలిసికొనదగును. రాజ

రాజచోళునివలనను, (క్రీ: శ: 1010) అతని కుమారుడగు రాజేంద్ర చోళునివలనను చోళరాజధానికి ముఖ్యపట్టణ మగు తంజావూరు నందును, గంగై కొండచోళపురమునందును నిర్మింపబడిన దేవాలయములను గాంచినచో - చోళుల కాలమునాటికి శిల్ప శాస్త్ర సంపద పరిపూర్ణ వికాసముతో ప్రకాశించినట్లు చెప్పవచ్చును. రెండు శతాబ్దములవరకు చోళుల కాలమున నయ్యది మహోన్నతముగా వర్ధిల్లెను. ఈ రెండు శతాబ్దములలో వారనేక దేవాలయములను నిర్మించిరి. రెండవ రాజరాజు కాలములో (క్రీ శ: 1146 - 1173) తంజావూరులో నిర్మింపబడిన ఐతరేయాలయము, కుంభకోణముకడ త్రిభువన ప్రాంతములో నిర్మింపబడిన కంపహరేశ్వరాలయము మిక్కిలి వన్నె గాంచిన యాలయము.

చోళ రాజ్యమునందు ఆయా రాజులచే నిర్మింపబడిన రాతి కట్టడములు, మలచబడిన కాంస్య విగ్రహములు వారి సాంకేతిక నైపుణ్యమునకు నిదర్శనములు కాగలవు. ఆలయ నిర్మాణమునందు వీరు చూపిన ఆసక్తి, శిల్ప పిపాస, సౌందర్యారాధన మెచ్చుకొనఁ దగినవి. అనంతర రాజులు - ఆలయ బహిఃప్రాకారము అతి విశాలముగ విరాజిల్లుటకును, ఆలయ గోపురము అంతస్థులతో నలరారుటకును నిర్మాణ కార్యక్రమమును కొనసాగించి కృతార్థులైరి. ఈ కార్యక్రమములో - ప్రథమ ద్వితీయ సోపానములను కట్టిన మగు రాతితో గట్టి, పోను పోను సూచీయాకారముగ నుంచి, దానిపై గోపురమును నిర్మించిరి. గర్భాలయమును అతి రమణీయముగా నిర్మించి, దానిని పవిత్రవంతముగా - ప్రాణ్యప్రదముగా నంభావించిరి చాళుక్యులచే పెంపొందింపఁజేయఁబడిన శిల్పకళ, మైసూరు రాజ్యమును పరిపాలించిన హొయసల రాజులచే నిర్మింపఁబడిన దేవాలయములకు ముఖ

ద్వారములు అతి విశాలములై, వెనుక వైపున ఇరు ప్రక్కల యందును ద్వారములు గల్గియుండి, చిత్ర విచిత్రములైన బొమ్మ లనేకములు వానిపై చెక్కబడియున్నట్లు వ్యక్తమగుచున్నది.

దక్షిణాంధ్రదేశమున, చోళుల పరిపాలనములో - ప్రజలు దైవభక్తి గల్గియుండుట నిస్సందేహము. దేవాలయమునందు స్వామి కైంకర్యములు నిర్వర్తించువారిని ప్రజలు మిగుల ఆదరమున గౌర వించెడివారు. దేవాలయములలో ప్రతి నిత్యము జరుగవలసిన విధు లను పర్యవేక్షించుటకై, ప్రత్యేక సంఘమొకటి యుండెడిది. ఆ సంఘము - ఆలయ పర్యవేక్షణ, యాత్రిక వసతి, ఆలయ నిధుల సద్వినియోగము మున్నగునవి కడు జాగరూకతతో నిర్వర్తించు చుండెడిది.

## మఠములు - విహారములు

ఆ కాలములో - దేవాలయములతో బాటు, మఠములు కూడ అభివృద్ధి యయ్యెను. ఈ మఠములు బౌద్ధ విహారములను బోలి యుండి, ముఖ్యముగా మత చర్చలకు, మత ప్రచారమునకు కేంద్రము లుగా నుండెడివి. సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయములుకూడ ఈ మఠములలో చర్చింపబడుచుండెడివి. సాధారణముగ, సన్యాసా శ్రమము స్వీకరించినవారే ఈ మఠము లో నివసించుట పరిపాటిగా నుండెను. వైష్ణవ దేవాలయములలో - శ్రీ వైష్ణవులకు నిరంతరాశ్ర యము లభించుచుండెడిది. అట్లే, మఠములందు శైవులకు, బౌద్ధ విహా రములందు భిక్కులకు ఆశ్రయము లభించుచుండెడిది. మఠములకు సంపద అపారముగ నుండెడిది. సాహిత్యము, కళలు, వృత్తి విద్యలు అభ్యసించినవారికి ఈ మఠాధిపతులు ధన సహాయము జేయుచు, వారిని ప్రోత్సహించుచుండెడినారు

దారిద్ర్యమువలనఁగాని, సంసార బాధలను భరింపఁజాలక గాని సన్న్యాసాశ్రమమును స్వీకరింపక, సహజముగా సంప్రాప్తించిన వైరాగ్య భావముతో, పవిత్రమైన ఆధ్యాత్మిక దృక్పథముతో ఆనాటివారు సన్న్యాసాశ్రమమును స్వీకరించి, తదాశ్రమ విధులను చక్కగా నిర్వర్తించుచు, ప్రకాశించుచుండెడివారు. గృహస్థులేవేళనైనను, ఏ పదార్థమునైనను దానము చేయుటకు సిద్ధపడి యుండిరి. అతిథి యభ్యాగతులను సమాదరించుటలో - ఇతర ఆశ్రమ వాసులకు తోడ్పడుటలో గృహస్థులు అత్యంతాసక్తిని గల్గియుండిరి. బ్రహ్మచర్యాశ్రమమును ప్రజలందరు యథావిధి పాటించుచు, విద్యాపీఠములలో - గురుకులములలో విద్యాభ్యాసముఁ జేసి, ఆత్మోత్తేజము నందుచుండెడివారు.

## విద్యా విధానము - భాషా సంపద

చోళ రాజులు సంస్కృత భాషకు విశేష ప్రాముఖ్యమిచ్చి యున్నట్లు శాసనములవలన దెలియుచున్నది. తమిళము, మరాఠీ, ప్రాకృతము మొదలగు భాషలను కూడ ఆనాటివారు అభ్యసించెడి వారు. సాంకేతిక శాస్త్రములందుఁగాని, తదితర శాస్త్రములందుఁగాని ప్రావీణ్యమును సంపాదింపవలెనన్న, సమర్థుఁడైన ఒక ఉపాధ్యాయుని సొంతముగ ఏర్పఱచుకొని, అతనికడ విద్యాభ్యాసము చేయ వలసియుండెను. ప్రాంతీయ భాషనన్నిటిని ప్రజలు నేర్చుకొనెడివారు. వారి వారి భాషలను ఆ యా రాజ్యాంగములందు ప్రవేశపెట్టినట్లు, అనేక తామ్ర శాసనములవలనను, శిలా శాసనములవలనను తెలియు చున్నది. ఇట్టి శాసనములనుబట్టి, వారు మిక్కిలి సుందరమగు లిపిని ఉపయోగించుచున్నట్లు మనము గ్రహింపవచ్చును. ఇట్టి శాసనములు చెక్కుటకు తగిన సాధనములనుగూడ వారు కలిగియుండిరి. బౌద్ధ

రామములు, శైవ మఠములు, వైష్ణవాలయములనుండి ఆ యా మత ధర్మములను బోధించు పాఠశాలలకు విరివిగా విరాళము లొసగుచుండె డివి. ప్రాథమిక పాఠశాలలో అక్షరాభ్యాస సమయమున ఇసుకను గాని, మెత్తని సున్నపు పిండిగాని నున్నని నేలపై బోసి, దాని మీద అక్షరములను దిద్దించెడివారు. ఈ పద్ధతి నేటికిని పల్లె ప్రాంతములం దచ్చటచ్చట గానవచ్చును.

ఈ రీతిగా విద్య దేశమందంతటను వ్యాప్తి సంపాదించి యుండెను. పురాణములను, ఇతిహాసములను కొందరు కంఠస్థము చేసి, ఇతరులకు శ్రావ్యముగ వినిపించుచుండెడివారు. దేవాలయము లలో మంత్రములను, స్తోత్రములను యథావిధిగ పఠించుటకై, పలువు రకు ప్రత్యేక పాఠశాలలో తగిన శిక్షణ నిచ్చుచుండెడివారు. గ్రంథా లయములు - ఆరామములందును, మఠములయందును, దేవాలయముల యందును ఉండెడివి. ఆ గ్రంథాలయములలో - ఆ యా మతములకు సంబంధించిన గ్రంథములు భద్రపరుపబడి యుండెడివి.

సంస్కృత భాషను బ్రాహ్మణులే అధికముగా ఆదరించి, అధ్య యనము చేయుచుండెడివారు. ఇతర కులస్థులలో - ఏ కొలది మందియో ఆ సంస్కృత భాష నభ్యసించెడివారు. ఆ కాలమున కొన్ని విద్యాలయములలో పదునాల్గు శాస్త్రములను, మరికొన్ని విద్యాలయములలో పదునెనిమిది శాస్త్రములను బోధించుచుండెడి వారు.

ధర్మశాస్త్రము, వేదాంత శాస్త్రము, అర్థ శాస్త్రము, దండ నీతి ఇవి చతుశ్శాస్త్రములుగా పరిగణింపబడినవి. వీనిని ముఖ్యముగా క్షత్రియు లభ్యసించెడువారు.

చతుర్వేదములు, షడంగములు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, పురాణము, తర్కము, మీమాంస, ధర్మశాస్త్రము ఇవి పదునాల్గు శాస్త్రములుగా పరిగణింపఁబడినవి.

ఈ పదునాల్గు శాస్త్రములతోఁ బాటు - ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వ వేదము, రాజనీతి అను నాల్గు శాస్త్రములు కలసి, పదునెనిమిది శాస్త్రములుగా పరిగణించిరి.

బ్రాహ్మణులలో ననేకులు ముందు ఈ పదునెనిమిది శాస్త్రములను అధ్యయనముఁ జేసి, ఆయా శాస్త్రములలో ఉద్దండ పండితులై యుండెడివారు. కాని, ఏ శాస్త్రమునుఁగాని బాగుగా పరిశీలించి, పరిశోధించి, అందలి విశిష్ట విశేషములను తరచి చూచినవారు చాల అరుదుగ నుండెడివారు

## ఉపసంహారము

కులోత్తుంగచోళుఁడు (క్రీ. శ. 1070 - 1138) శైవమతాభిజాత్యమువలన, వైష్ణవ కులప్రవర్తకులగు శ్రీ భగవద్రామానుజుల వారిని అనేక విధముల హింసింపసాగెను. ఆ బాధలను భరింపఁజాలక, శ్రీ భగవద్రామానుజులు శ్రీరంగపట్టణమును వదలి, హొయసల రాజ్యాధీశ్వరుఁడును, జైనమతాభిమానియు నగు బిట్టిరాజు ఆశ్రయమున పన్రెండు సంవత్సరములు కాలము గడపిరి. ఆ సమయమున, శ్రీ భగవద్రామానుజుల ధర్మనిష్ఠను, అచంచల దైవభక్తిని, విశ్వకల్యాణ కాంక్షను గుర్తించి, తన జైనమతమునకు స్వస్తి చెప్పి, శ్రీ భగవద్రామానుజుల పాదసన్నిధానమునాశ్రయించి, వైష్ణవ మత స్వీకార మొనర్చెను. ఇంతలో కులోత్తుంగచోళుని కుమారుఁడగు విక్రమ

...ళుఁడు రాజ్యాధిపత్యము వహించి, తన తండ్రివలె శైవ మతాభి
మాని కాక, వైష్ణవ మతమునం దభినివేశము గలవాఁడై, శ్రీ భగవ
ద్రామానుజ ప్రభావమును బాగుగఁ దెలిసికొని వారిని మరల శ్రీ
రంగమున కాహ్వానించి, ఘనముగా స్వాగత మొసంగి, సగౌరవముగ
సన్మానించి, వారి పాద పద్మముల నాశ్రయించి, వైష్ణవ మత స్వీకార
మొనర్చెను. అనంతరము ఇట్లే ఇతర రాజులును, ప్రజలును అనేకులు
శ్రీ రామానుజ ప్రభావ ప్రకాశమున జాగరిల్లి, వారి పాదపద్మము
లాశ్రయించి, శ్రీవైష్ణవ మత స్వీకార మొనర్చి విలసిల్లిరి. నాఁటి
నుండియు రాజ్యపాలకులలో, ప్రజలలో శ్రీవైష్ణవ మత చైతన్యము
ప్రజ్వరిల్లి, బాగుగా వర్ధిల్లసాగెను



# శ్రీమద్రామానుజులు - శ్రీ వేంకటాచలము

'దర్శన సార్వభౌమ - తర్కభూషణ
సాహిత్య న్యాయ వేదాంత శిరోమణి - ఉభయ వేదాంత విద్వాన్'
**శ్రీమాన్ టి. కె. వి. యన్. సుదర్శనాచార్యులు**

— X —

[ శ్రీరంగము మొదలగు దివ్య క్షేత్రములందు - ఆ యా ఆగమ సిద్ధములై, ఆ యా దివ్య క్షేత్ర మాహాత్మ్య సిద్ధములై, భగవదనుగ్రహ మూలములునై ఉద్భవిల్లిన భగవద్ధర్మముల నుద్ధరించిన శ్రీమద్రామానుజులవారు - శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానములలో నేర్పరచిన కట్టుదిట్టముల వృత్తాంత క్రమము ]

## శ్రీమద్రామానుజులు శైవుల నోడించి శ్రీ వేంకటేశ్వరుడు విష్ణువే యని నిరూపించుట

శ్రీ వేంకటాచలపతి కలియుగారంభమున స్వాశ్రితుడగు తొండమాన్ చక్రవర్తికి, అతని యాపదల నివారించుటకై, తన కేల నుండు శంఖ చక్రములను ప్రసాదించెను. ఆనాటినుండి శ్రీమద్రామానుజులవారు శ్రీరంగ క్షేత్రమున విష్ణుతత్త్వ ప్రతిష్ఠాపనాచార్యులై[1] సేవచేసియుండు సమయము వఱకును కొంత కాలము శ్రీవారి కర పద్మములయందు శంఖ చక్రములు లేకుండెను ఆ సమయముననే, ఆ సన్నిధిలో నుండు వైఖానసులు, శ్రీ వేంకటాచలపతి దివ్యమంగళ విగ్రహమునకు ఉచితోపచారములు[2] సమర్పింపక, ఉత్కట ప్రవృత్తులై[3] యుండ, ఆ దేశాధిపతి దానిని గుర్తించి, వారలను అనేక విధముల మంద

1 'శ్రీ మహావిష్ణువే పరతత్త్వము' అను సిద్ధాంతమును స్థాపించిన ఆచార్యులై.
2. తగిన కైంకర్యములను
3. హద్దు మీఱి చేయదగని పనులు చేయువారలై

లించెను మఱియును అప్పుడు ఆ దివ్య క్షేత్రమున పెద్దలగు శ్రీవైష్ణవు లెవ్వరును లేకుండిరి.

అట్టి సమయమున, కొందఱు శైవ జనులు ఆ దేశాధిపతి యాస్థానమునకుం జని, తమ దేవత యగు కుమారస్వామి ఈ పర్వతమునకు విచ్చేసి, తపస్సు జేయుచుండెనని వామన పురాణములో[4] శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున తృతీయాధ్యాయమునందు విస్తారముగ అభివర్ణితమై యున్నందున 'ఈ పుష్కరిణీ తటమున విజయము చేసియుండు స్వామివారు - కుమారస్వామియే. వీరు తపస్సు జేయువారగుటచే, వీరి యాయుధములగు శంఖ చక్రాదులు వీరికి లేకున్నవి' అనియు - 'స్వామి యను సుబ్రహ్మణ్య స్వామికి నిరూపక మగు నామధేయముచే, ఈ తీర్థమునకు 'స్వామి పుష్కరిణి' అని పేరు ప్రసిద్ధులు గలిగినవి' అనియు - 'కనుక, ఈ పర్వతము శివ క్షేత్రమే' అనియు - 'మధ్యకాలమున కొందఱు శ్రీ వైష్ణవులు గూడి, రాజు వాల్లభ్యమును సంపాదించి, విష్ణు విగ్రహమును నిర్మించుకొనివచ్చి, ఈ సన్నిధిలో నుంచి ఉత్సవాదుల జరిపించిరి' అనియును - ఈ రీతిగ వామన పురాణ వచనములకు పురాణాంతరములతో[5] సమానార్థముగ పూర్వో

4 "దృష్ట్వా తపన్తం వాయుం చ తత్సమీపే షడాననః
త్రిసంధ్యం దేవ దేవేశం నారాయణ మనుస్మరన్
అతిష్ఠత్తప ఉగ్రం చ సమాధి ధ్యాన సంయుతః
ధ్యాయ న్నారాయణం దేవం శంఖ చక్ర ధరం పరమ్"
( వామన పురాణము - వేంకటాచల మాహాత్మ్యము 21 - 104, 105

5. ఇతర పురాణములతో

త్తర పరామర్శము జేయక,[6] ఆపాతతః ప్రతీయమానములగు అర్థములు[7] నుపపాదించుచు నిలచిరి

రాజును వీరి ప్రసంగముల నెల్ల సావధానముగ విని, అద్య పర్యంతము,[8] ఈ పర్వతము - విష్ణు క్షేత్ర మనియు, దీనిలో నిత్య వాసముం జేయు స్వామివారు విష్ణువే యనియు, ఈ తీర్థము - విష్ణుతీర్థ మనియును ప్రసిద్ధమై, శ్రీవైష్ణవులేగదా ఈ స్వామికి పూజా మహోత్సవాదులను[9] జరిపించుచున్నారు! ఇట్లుండ ఇప్పుడీ శైవ జనులు ఈ రీతి బల్కుచున్నారేమి?' అని విచారాక్రాంత మనస్కుడై[10] యుండెను.

ఆ సమయమున అ దివ్య క్షేత్రమునందు పెద్ద లగు శ్రీవైష్ణవు లెవ్వరును లేకుండుటచే, అప్పుడచ్చట నివసించు శ్రీవైష్ణవులు రాజాస్థానమున కేగి, పురాణార్థముల నివస్రించి, 'శ్రీ వేంకటాచలపతి విష్ణువే' అని నిర్వహించుటకు శక్తి లేనివారలై, శ్రీరంగ క్షేత్రమున విజయము చేసియుండు శ్రీమద్రామానుజులవారి సన్నిధికి ఈ వృత్తాంతమును వ్రాసి పంపిరి.

శ్రీమద్రామానుజాచార్యులవారును ఈ సమాచారమును విని, త్వరితముగ పయనము చేసి, తిరుపతికి విచ్చేసి, ఆ దేశాధిపతి నాశీర్వదించి, అష్టాదశ పురాణములలోని శ్రీ వేంకటాచల విషయకము లగు శ్రీ వేంకటాచల మాహాత్మ్య వచనముల నన్నింటిని పూర్వోత్తర

6 ముందు వెనుకల నాలోచింపక

7 పై పై దోచు అర్థములను

8. నేటివఱకును

9 పూజ, మహోత్సవము మొదలగువానిని

10 చింతతోఁగూడిన మనస్సు గలవాఁడై

విరోధము లేకుండునటుల[11] ఏకవాక్యతాపన్నము లగు రీతి[12] సమన్వయ పఱచి, ఉపన్యసించియు, ఆళ్వారుల శ్రీసూక్తులను, అవిగీతము లగు[13] శిష్టాచారములను, ఉత్కృష్టానుష్ఠానములను[14] గూడ నుపపాదించియు - 'ఈ స్వామి విష్ణువే' అని సిద్ధాంతీకరించిరి

రాజు సావధానముగ వినియును, ఉభయవాది[15] పురాణముల వచనములచే నొక నిశ్చయమునకు రాలేనివాఁడై, మధ్యస్థుఁడై యుండెను.[16]

అప్పుడు శ్రీరామానుజులవారు రాజును జూచి -

" దర్శయన్ భక్తవాత్సల్యం యో దదౌ హస్తగే శుభే
శంఖచక్రే నృపేంద్రాయ 'చక్రవర్తీ'తి యం విదుః
ఆత ఏవాత్ర శంఖాభ్యాం సుదృశ్యేతే వినా కరౌ "

అని బ్రహ్మాండ పురాణమున సప్తమాధ్యాయమున నున్న రీతిగ, కలియుగారంభమున నున్న స్వామివారు, తమ భక్తుఁ డగు తొండమాన్ చక్రవర్తికి శత్రు సంహారార్థముగ శంఖ చక్రముల నొసంగిరి' అని ఆరంభించి, అది మొదలు శంఖ చక్రములు లేకయే యున్నారు' అని విశేషించి పురాణార్థముల నుపపాదించిరి. దానివలనను రాజునకు దృఢ నిశ్చయము గలుగకుండెను.

---

11 పరస్పర విరుద్ధములు కాకుండునట్లు

12 ఒకే విషయమును నిర్ధారించునట్లు

13 పరంపరాగతము లగు.

14. శాస్త్రములలో చెప్పబడిన ఆచార వ్యవహారములను.

15. వాది ప్రతివాదులు.

16 తటస్థముగ నుండెను.

అందుపై, శ్రీమద్రామానుజులవారు - ప్రత్యక్ష దృష్టమగు నొక నిశ్చయము గలుగు నటుల నొక వార్తను ఆనతిచ్చిరి. అ దెయ్యది యన - 'నేను శ్రీ మహావిష్ణువు' అని సాధించితిని, శైవులు, 'సుబ్రహ్మణ్యస్వామి' యనిరి గదా ! ఈ సంశయము దీరుటకై, నేను విష్ణువునకు అసాధారణము లగు శంఖ చక్రముల జేయించి తెచ్చి, స్వామివారి సన్నిధిలో నుంచెదను, శైవులు సుబ్రహ్మణ్య స్వామికి అసాధారణము లగు పాశాంకుశములఁ జేయించి తెచ్చి యుంచెదరు గాక, స్వామి ఏ ఆయుధముల స్వీకరించి ధరింతురో, ఆ ఆయుధములు ధరించుదేవుఁ డని తీర్మాన మగు గాక !' అని.

రాజా వాక్యములు విని సంతసించి, అట్లే చేయుఁ డని సెలవిచ్చెను.

అటుపై ఇద్దఱు వాదులును, ఆ యా యాయుధములఁ జేయించి తెచ్చి, రాజునుఁగూడ పిలుచుకొని తిరుమల నెక్కి, రాత్రి కాలమున స్వామి గర్భ గృహమున వాని నుంచి, రాజ ముద్రను వేయించి నలు ప్రక్కల కావలి గాయుచుండిరి.

ప్రాతః కాలమున తలుపులఁ దెఱచి చూడఁగా, స్వామివారు శంఖ చక్రముల ధరించి యుండిరి. అంత నా రాజు ఆ యాశ్చర్యమును కండ్లారఁ గాంచి, సంతుష్టుఁడై, శ్రీ రామానుజులవారి శ్రీపాద పద్మములలో మిక్కిలి భక్తియుక్తుఁడై, ఆ శైవులను వారి అసత్య భాషణముల కనుగుణముగ దండించి, శ్రీరామానుజులవారి పాద పద్మముల నాశ్రయించి కృతార్థుఁడై యుండెను

తదుపరి శ్రీమద్రామానుజులవారు ___ 'ఈ తిరుమలలో వేంచేసియుండు స్వామియే శ్రీ వైకుంఠనాథుఁడై యుండు శ్రీపతి యగు శ్రీ మహావిష్ణువు' అని సకల దేశములయందును ప్రకటి

శ్రీమద్రామానుజులు

## తిరుమంజనము, తిరుమణ్ కాప్పుల వ్యవస్థ నేర్పఱచుట

మఱియు, శ్రీ వేంకటాచలపతికి అనాది కాలముగ ప్రతి నిత్యము తిరుమంజనము[18] సమర్పించుచున్న ప్రకారము నాలకించి, ఇట్లు నడచుచుండినచో, శ్రీవారి దివ్య మంగళ విగ్రహమునకు ఉచితోపచారములు పూర్ణముగ సిద్ధింపవు — అని తలచి

"సహ లక్ష్మ్యాఽభిషేకస్తు వాసరే భార్గవే హరేః
సాన్నిధ్యకారీ సతతం సర్వ సమ్పత్సృదాశయః"

అని వైఖానస శాస్త్రమగు ఆనంద సంహితలో నుండునట్లు, శుక్ర వారమున తాయార్లు (అలర్ మేల్ మంగై నాచ్చియార్లు — పద్మావతి) వక్షఃస్థలమునుండి క్రింద వేంచేపు జేయఁబడి, తిరుమంజనము స్వీకరించుదురుగాక అని కట్టు దిట్టము నేర్పరచిరి.

"అష్టాంగస్థు లలాటార లలాట స్థోర్ధ్వపుండ్రకః"

అని పాద్మ పురాణ సిద్ధమై,

"నాసికా మూల మారభ్య రేఖా ద్వితయ సంయుతమ్
దారయే దూర్ధ్వపుండ్రస్తు హరేః ఫాలతలే శుభే"

అనునటుల శ్రీవైఖానస శాస్త్ర సిద్ధమై, శ్రియఃపతికి అసాధారణమై, రేఖా ద్వితయ రూపమై యుండు[19] తిరుమణ్ కాప్పు ఊర్ధ్వపుండ్రమును నాసాది కేశాంతముగ[20] సమర్పింపఁజేసిరి.

---

18 అభిషేకము అర్చామూర్తికి స్నానము చేయించుట

19 రెండు రేఖలుగా నుండు.

20 ముక్కుకొన మొదలు తలవెండ్రుకల వఱకు

ఇట్లు కట్టు దిట్టము చేసిన సమయమున మరు రోజు శుక్రవార మైనందున, ఆ దినము తిరుమంజనము జరుపఁబడుచున్నపుడు మొట్ట మొదట ఆకాశ గంగా తీర్థముచే తిరుమంజనము చేయఁబడగా, దానిచే దివ్య లలాట పుటమున[21] సమర్పింపఁబడియున్న ఊర్ధ్వ పుండ్ర రేఖ అరిగిపోయి, ఆ రేఖ గల మూల మగు నాసాదిలో సమర్పింపఁబడిన అర్ధచంద్రాకృతియైన తిరుమణి కాప్పు మాత్రము చెక్కు చెదరక యుండగా, ఆ చంద్ర కళాకృతియై యొప్పారు ఊర్ధ్వ పుండ్ర రేఖను శ్రీమద్రామానుజుఁ వారు కటాక్షించి, పూర్వము జగన్మోహిని యైన అవతార దశలో — లలాట ఫలకమున నున్న చంద్ర కళాకార మగు ఊర్ధ్వపుండ్ర రేఖ, అచ్చట నుండు దేవాసుర సంఘములకు మోహ జనకమై యున్నటుల, ఈ సకల జగన్మోహనమై యుండు దివ్య మంగళ విగ్రహమున నాసాది ప్రదేశమున భాసిల్లుచుండు ఈ చంద్ర కళాకార మగు ఊర్ధ్వపుండ్ర రేఖయును, స్వామివారి దివ్య వదన పంకేరుహమునకు[22] శోభావహమై ఆశ్రితుల దృష్టిచిత్తాపహారియై[23] యున్నందున, 'ఈ సన్నివేశముతోఁగూడ కొన్ని దినములు సమర్పింపవలయును' అని స్వాంతరంగమున మనోరథించుచుండ, అట్లే, భగవ దనుగ్రహముగూడ అర్చక ముఖముగా ప్రకటీకృత మయ్యెను

అటు పిమ్మట శ్రీమద్రామానుజులవారు, శ్రీ వేంకటాచలపతి శుక్రవాసరమున తిరుమంజనము స్వీకరించిన తరువాత, కర్పూర రేణువులచే శ్రీవారి దివ్య లలాట ఫలకమున రేఖాద్వయ రూపముగ

21 ముఖారవిందమున.

22. ముఖ పద్మమున

23 ఆశ్రితులయొక్క దృష్టిని ఆకర్షించునదియై

సమర్పించిన తిరుమణ్ [illegible] దివ్యలలాటమున ధరించియుండునట్లును —

"ఆదౌ కృతయుగే జమ్బూద్వీపే భరతక్షేత్రే
గఙ్గాయా దక్షిణే భాగే యోజనానాం శతద్వయే
సప్తయోజనమాత్రేణ పూర్వాబ్ధేస్తు పశ్చిమే
మాసే భాద్రపదే విష్ణు[illegible] విష్ణుదైవతే
సిద్ధయోగే సోమవారే గిరౌ నారాయణాహ్వయే
స్వామి పుష్కరిణీ తీరే పశ్చి[illegible] [illegible]పశ్చిమే
బృందారకాణాం బృన్దైస్తు ప్రార్థితో లోకరక్షకః
ఆవిర్బభూవ భగవాన్ శ్రీనివాసః పరః ప్రభుః"

అని శ్రీ పాద్మపురాణమునందలి [illegible] అధ్యాయాంతమునఁ జెప్పఁబడిన రీతిగ, శ్రీ వేంకటాచలమున [illegible] వాసర మగు సోమవారమున, తాను మనోరథించినట్లు [illegible] దివ్యనగరముగూడ సంభవించినందున, నాసికా మూలమునందు [illegible] ఆకార మగు ఊర్ధ్వపుండ్ర రేఖను సమర్పించుకొనునట్లును, [illegible] దినమునందే - తమ దివ్య లలాట ఫలకమున రేఖాద్వయ రూపముగ నున్న తిరుమణ్ కాప్పను, దివ్య నేత్రాంబుజములకు శోభా విశేషములచే సంతరింపఁబడిన అంజన కాప్పును[25] సమర్పించుకొని, ఎల్లరకును సేవను ప్రసాదించునట్లును -

శూరుఁడై యుండువాఁడు, తన శౌర్య సాధనము లగు ఆయుధములకు మొట్ట మొదట కుందన కుసుమాదుల[26] సమర్పించి, తదుపరి

24. ఊర్ధ్వపుండ్రమును.

25. కాటుకను.

26. గంధము, పుష్పము మొదలగువానిని.

తాను దానిని ధరించునటుల, శ్రీ వేంకటాచలపతియును, ప్రతి నిత్యము మూఁడు సంధ్యాకాలములయందును తిరుమాలల సమర్పించుకొను నపుడు, వారి విజయ పరంపరలకు ప్రధాన సాధనము లగు శ్రీ సుదర్శన పాంచజన్యములకు[27] తిరుమాలల సమర్పించిన తరువాతనే, శ్రీవారి దివ్యవక్షఃస్థల నివాస రసిక యగు శ్రీ మహాలక్ష్మికిని (తిరుమార్బు నాయ్చ్చియార్లకును), దివ్య కిరీటము మొదలగు దివ్యావయవములకును సమర్పించునట్లును -

ప్రతి శుక్రవారము, శ్రీ వేంకటాచలపతి తిరుమంజనమును స్వీకరించుచున్నప్పుడు - ఒక్క క్షణకాల మైనను భగవంతుని విశ్లేషమును సహింపఁజాలను' అని నిత్యానపాయినియై, శ్రీవారి దక్షిణ వక్షఃస్థలమున విరాజిల్లు శ్రీదేవి యగు అలర్ మేల్ మంగై నాయ్చ్చియార్లు పెరుమాళ్ళ దివ్య వక్షఃస్థలమునుండి ప్రత్యేకింపఁబడి, క్రింద వేంచేపు జేయఁబడినప్పుడు, శ్రీమద్రామానుజులవారు తత్కాల మాత్ర విశ్లేషమును సహింపలేనట్టి అమ్మవారి దుర్బల ప్రకృతిని అనుసంధించి, ఆమె యపరావతారమై, తత్ప్రాణ సఖియై, శ్రీ భూమ్యంశయై యవతరించిన శ్రీ పెరియాళ్వార్ల తిరుక్కుమార్తె[28] యగు శ్రీ ఆండాళమ్మవారు - తిరుత్తుళాయి (దివ్య తులసీ పత్రము) దివ్య పరిమళము తోడనే యుద్భవించినట్లు, భగవత్ప్రేమ ప్రకర్షము తోడనే అవతరించినప్పటినుండి సర్వేశ్వరుని యనుభవింపవలె నని ఆశపడి, అది సిద్ధింపక పోవుటచే, అతనినిఁ బొందుటకుఁ దగిన సాధన విశేషములతో వ్యాపృత యైన ప్రకారములను, సర్వేశ్వరునికి సందేశమునుఁ బంపిన ప్రకారమును, వాని స్థితి గమన శయనాదులకు[29]

27. చక్రాయుధము, శంఖము. 28 పుత్రిక

29 స్థితి గతులు, శయనము మున్నగువానికి

ప్రసిద్ధమై యుండుటనుఁ బరికించి, ఇఁక దివ్య నగరాభివృద్ధికై, తిరువేంగడ ముడైయాన్లు[33] కనక లతా యోగమున అవతరించినప్పటికిని సన్నిధిలో అభివృద్ధి లేనందున, పెరుమాళ్ళ సన్నిధిలో దివ్యైశ్వర్యము ఉత్తరోత్తర మభివృద్ధ మగునట్లు, అప్పుడు ఉత్సవ మూర్తియై తిరువారాధనము స్వీకరించుచుండు 'వేంగడ త్తురైవార్లను కౌతుక బేరమై యుండునట్లును, 'మలైకునియని న్ఱ పెరుమాళ్ళను ఉత్సవ మూర్తిగను మార్చి, తిరువారాధనము స్వీకరించునట్లును, యంత్రోద్ధారణ పూర్వకముగ ఆవాహనాదుల జరిపి, తిరువారాధనాది కైంకర్యములు యథావిధిగ జరుగునట్లును అనుగ్రహించిరి.

## శెంగవానియన్ అనువారి కులీనులే అర్చకులుగా నుండునటుల కట్టుబాటు చేయుట

'శెంగనివాయన్' అని ప్రసిద్ధి జెందిన పరమ భాగవతోత్తముల తిరువంశమున నుద్భవించిన పరమ భాగవతుల దివ్య హస్త పద్మముల చేతనే శ్రీ వేంకటాచలపతికి నిత్య తిరువారాధనము జరుగునట్లును శ్రీరామానుజులు కట్టడి జేసిరి.

## శ్రీ వరాహస్వామి యారాధనలకు వ్యవస్థ నేర్పఱచుట

"గో క్షీరైః హేమ కుంభస్థైః వల్మీక వివరోదకమ్
అన్యస్యాతా చ్ఛిన్నధారై రభిషేకం ప్రచక్రమే
క్రియమాణాభిషేకేణ వల్మీక వివరాన్తరాత్
ఆవి ర్బభూవ భగవాన్ వారాహవపురీశ్వరః"

అనునటుల, భూగోళ వరాహ పురాణమున షష్ఠాధ్యాయమునను, వరాహ పాద్మ పురాణములయందును ప్రసిద్ధమై యుండునటుల, స్వయం

33. శ్రీ వేంకటాచలపతి.

వ్యక్తమై ఆవిర్భవించిన శ్రీ వరాహస్వామి, తిరువేంగడ ముడైయాన్ల కంటె ముందటి కల్పమున అవతరించుటచేత,

> "రక్ష్యా బల్యాన్తరే దేవం బలిహోమ వివర్జితమ్
> ఆరాధయే ద్ప్రధానం న కుర్యా దుత్సవాదికమ్ "

అని శ్రీవైఖానస స్తోత్రమున ఆనంద సంహితలోఁ జెప్పఁబడి యుండుటచే, ఒక క్షేత్రమున రెండు విగ్రహములకు సమ ప్రధానముగ పూజా మహోత్సవాదులు నిషిద్ధము లైనందున, ఆ వరాహ స్వామికి బలిపీఠార్చన నిత్య హోమ మహోత్సవాదు లెవ్వియును లేకుండ,

> "మ త్స్థాపిత వరాహస్య పూర్వం స్యాత్ పూజనం హరే!
> దర్శనం స్నాన దానాద్యై రిత్యుక్త్వా ఽథ శ్రియఃపతిః
> తథా స్త్వితి వరం దత్వా కారయామాస త త్తథా "

అని బ్రాహ్మ పురాణమున అష్టమాధ్యాయమున నుండునటుల, తిరువేంగడ ముడైయాన్లకు ముందుగనే మూఁడు సంధ్యల యందును తిరువారాధనము, నైవేద్యము జరుపబడునట్లు కట్టుదిట్టము చేసి, ఆ వరాహ పెరుమాళ్ళ సన్నిధియందు ఉత్సవ మూర్తినిఁగూడ వేంచేపు జేసి, వారికి తిరువారాధనము జరుగునట్లును, అధ్యయనోత్సవము మాత్రము ఒక రోజు జరుపఁబడునట్లును,

> "శ్రీ వేంకట వరాహాయ స్వామి పుష్కరిణీ తటే
> శ్రవణర్క్షే తులామాసే ప్రాదు ర్భూతాత్మనే నమః "

అనునటుల, వారి తిరునక్షత్ర మగు అల్పిశి మాసమునందలి శ్రవణ నక్షత్రమున శ్రీ వరాహ జయంతిని విశేషోత్సవముగ పరిపాలించునట్లును, కట్టు దిట్టములు నేర్పఱచిరి.

## అళగ ప్పిరాన్ కూ... (పూల బావిలో) తాయార్లను, పెరుమాళ్ళను ప్రతిష్ఠించుట

"నిత్యం ఐతేన బాహ్యా దేవం నత్వా నృపోత్తమః
రాజ్యం చకార ధర్మేణ భుంజానో భోగ ముత్తమమ్."

అని భూగోళ వరాహ పురాణమున దశమాధ్యాయమున చెప్పఁబడుచున్నట్లు, తొండమాను చక్రవర్తి కలియుగారంభ సమయమున తిరువేంగడ ముడైయాన్ల తిరువడిఘుళ్ళలో[34] పరిపూర్ణ భక్తి యుక్తుఁడై, శ్రీవారి యనుగ్రహము వలన రాజ్యమును ధర్మము తప్పక పరిపాలనము జేయుచు, సమస్త భోగములను అనుభవించుచు, నిత్యముగ అతని అంతఃపురమునకును, తిరుమలకును వచ్చి పోవుటకు అనుకూలమగునట్టి ఒక బిలమును స్వామివారు చూపింప, దానిలో ప్రవేశించి, సన్నిధికి వెళ్ళి, పెరుమాళ్ళను సేవించి వచ్చుచుండెను. అట్టి సమయమున, ఈ అద నెఱిఁగి —

"స్థితే కదా... ఛిలిపే శ్రీనివాసస్య సన్నిధౌ
శత్రవస్సర్వతోద్రిక్తా రురుధు స్తస్య వై పురీమ్."

అని బ్రాహ్మ పురాణమునఁ జెప్పఁబడియున్నట్లు, సామంత రాజులు ఇతనిని జయించుటకై వచ్చి, పట్టణమును ముట్టడించిరి. అప్పుడు చక్రవర్తియును, వారలను తఱుముకొనుచు పోయి యుద్ధమును చేయ, పరస్పరము[35] తుములము[36] యుద్ధము జరుగగా, చక్రవర్తికి బలము క్షయించిపోయిన గుంక, పరాజయమును బొంది, స్వదేశమునకుఁ బరుగిడివచ్చి, తిరువేంగడ ముడైయాన్ల తిరువడిఘుళ్ళలో పరమ భక్తి మీఱ —

34 పాద పద్మములలో. 35. అన్యోన్యము 36 భయంకరము.

"శ్రీ నృసింహం నమస్కృత్య పునః ప్రాప్య కటోత్తమమ్
శ్రీనివాసం యయౌ ద్రష్టుం భూమి సహితం నృపః
తం దృష్ట్వా సహసా౽౽యాన్తం గుహాయాం ధరా రమే
ప్రణమ్య త్వమువాచ త్వం కిం గతే నృపా౽౽గతః."

అని భూగోళ వరాహ పురాణమున గద్య ద్వయమునఁ జెప్పఁబడి యున్నటుల, బిలద్వారమున ప్రవేశించి, సరభసముగ[37] అర్చాలయము నసే పెరుమాళ్ళ సన్నిధికి వెళ్ళి కలచెను.

అప్పుడు, అంతరంగ దశలో సేవల నొనరించుచుండు శ్రీ భూదేవు లిద్దఱును, అంత ర్ధానమునుఁ జెంది, అంతః పురమున పరపురుషుఁడు వచ్చి ప్రవేశించె నని సంకోచపడిరి. అందు శ్రీదేవి, తనకు నిత్య వాసస్థానమగు తిరువేంగడముడైయాన్ల దివ్య వక్షః స్థలము నధిరోహించెను. భూదేవియుఁ బహిర్నిర్గతయై, పూర్వ కాలమున రంగదాసునిచే, తిరుసందన కైంకర్యార్థముగ త్రవ్వబడినదై, సమీపస్థమై యుండు కూపమున[38] దుమికెను.

అను ఐతిహ్యము పండిత పామర సాధారణముగ[39] అవిగీతమై[40] యుండుటను బరికించి, శ్రీమద్రామానుజులవారు - ఆ భూమిపిరాట్టి (భూదేవి) ని అర్చా రూపముగ నిర్మింపఁజేసి, ఆమె సమీపమున నొక తీర్థాధిపతి యగు పెరుమాళ్ళ బింబమునుగూడ నిర్మింపఁజేసి, ఆ దివ్య కూపమున ఇద్దఱిని జేర్చి, మిథునముగ[41] ప్రతిష్ఠింపఁజేసి,

37. అతి వేగము 38 బావిలో

39. చదివిన వారికిని, చదువని వారికిని, అందఱికిని వాడుకలో నుండునట్లు

40. అవిరుద్ధమై. 41. భార్యాభర్తలనుగ

వారలకు నిత్యముగ తిరిగిలను[42] ఆరగింపు జేయునట్లును కట్టుదిట్టములు నేర్పఱచిరి.

'ఆళవందార్లు (శ్రీ యామునాచార్యులవారు), ఒకానొక కాల విశేషమున శ్రీ వేంకటాచల యాత్రగా విచ్చేసి, మంగళా శాసనము జేసిన సమయమున, ఒక రోజు ప్రాతః కాలమున అళగప్పిరానార్[43] స్నపన తిరుమంజనమునకు[44] ఉపయోగపడునట్లు, తిరుమలై నంబి పాపవినాశ తీర్థమునుండి తిరుమంజన తీర్థమును వేంచేపు చేసికొని వచ్చుటకు వర్షోపద్రవముచే శక్యము గా కుండ, అప్పుడు ఆళవందార్లు తామే స్వయముగ, రంగదాసుని కైంకర్య రూప మగు దివ్య కూపమునుండి తిరుమంజన తీర్థమును తోడి తెచ్చి సమర్పించి, శ్రీ స్వామివారికి తిరుమంజనమును జరిపించిరి గాతియు, ఆ కూపమునకు 'అళగప్పిరానార్' అను తిరునామమును[45] గూడ నుంచిరి.'

అను కథయును స్థలమున ప్రసిద్ధమై యుండుటచే, దీనిని శ్రీమద్రామానుజులవారు ఆలకించి, 'మనకు సంబంధించినవా రందఱును ఈ కూపమును 'అళగప్పిరానార్' అనియే వ్యవహరింతురుగాక ! అను కట్టడిని అనుగ్రహించిరి.

## దైవాధిష్ఠితము లగు తింత్రిణీ చంపక వృక్షములకు నిత్యారాధనము నేర్పఱచుట

"వన మధ్యే తరో ర్మూలే స్వామి పుష్కరిణీ తటే
తిష్ఠన్తం పుండరీకాక్షం శ్రీభూమిసహితం హరిమ్
చిఞ్చావృక్షస్యమూలే తు ప్రాదు రాసీ జ్జనార్దనః
తిన్త్రిణీవృక్షమూలస్థం వల్మీకస్థం పరం హరిమ్ "

42. ప్రసాదములను 43. భోగ శ్రీనివాసులు

44. ఆగమోక్త ప్రకారము చేయు అభిషేకము. 45. విలక్షణ నామధేయమును.

అని భూగోళ వరాహ పురాణమునను, వామన పురాణమునను జెప్పఁబడి యున్నట్లు, ఒక కల్ప విశేషమున శ్రీ వేంకటాచలపతి-

"ఉన్నిద్ర తిన్త్రిణీకత్వ మేష్యత్యయ మ్మహోరగః"

అను పురాణ ప్రసిద్ధి ననుసరించి, తిరువన్దాళ్వాన్ల (ఆదిశేషుల) అంశమగు దివ్య తింత్రిణీ వృక్షస్య[46] అధః ప్రదేశమున ఆవిర్భవించెను. ఇట్లు కొన్ని రోజులు గడచెను. తదుపరి, 'రంగదాసుఁడు' అను నొకే పరమ భాగవతుఁడు, దక్షిణ దేశము నుండి తిరుమలకు వచ్చి, అచ్చట నిత్య వాసము చేయుచు, పెరుమాళ్ళయందలి నిరవధిక ప్రీతి ప్రకర్షముచే నొక దివ్యాలయమును నిర్మింపవలయునని యెంచి, స్వామివారికి వెనుక భాగమున నున్న తింత్రిణీ వృక్షము - ఉన్నిద్ర తింత్రిణీ వృక్షమై,[47] ఒక కొమ్మలో చిగురు, ఒక కొమ్మలో కాయలు, ఒక కొమ్మలో పూవులు ఒక కొమ్మలో ఆకులు, ఒక కొమ్మలో పండ్లు గలిగి, ఇట్లు విచిత్రాకారమై, భగవంతుని దివ్య మంగళ విగ్రహము నందలి ప్రీతి ప్రకర్షముచే గొడుగు పట్టినట్లు విస్తృతమై యుండుటను బరికించి, ఏమి చేయుటకును తోచక, ఏమి చేయుదమా యను విచారముతో బరివ్యాకులుఁడై యుండెను.

ఆ నాఁటి రాత్రి ఆ తింత్రిణీ వృక్షము, ఆ ప్రదేశమును విడచి, స్వామికి ఈశాన్య దిగ్భాగమున నొక శరపాతదూర విప్రకృష్టమై[48] అమరియుండెను రంగదాసుఁడీయాశ్చర్యమును వీక్షించి, ఆశ్చర్యచకితుఁడై, 'ఈ వృక్షము సాక్షాత్తుగ ఆ యాదిశేషుని యంశమే' అని ప్రపత్తి జేయుచు -

46. విలక్షణమైన చింతచెట్టుయొక్క

47 అన్ని వేళలయందును చిగిరించియే యుండు చెట్టుగా నుండి

48 బాణము యథోక్తముగ ప్రయోగింపఁబడిన, ఎంత దూరము నది పడునో, అంత దూరమున నుండునదియై

"ఆకాశస్థం తదా దృష్ట్వా పీతనీలాకృతిం శుభమ్
పార్శ్వస్థ శంఖచక్రాభ్యాం గదాసిభ్యాం విరాజితమ్
దేవస్య పరితో భూమౌ శిలాకుడ్యం తదాఽకరోత్
వాసస్థానం చతా రాజ దారుభిః సుమనోహరైః."

అని భూగోళ వరాహమున నున్నటుల, ఒక సన్నిధినిఁ గట్టెను.'

అని, పురాణమున ప్రసిద్ధమై యున్నందునను - 'కొన్ని కొన్ని సమయములలో, శ్రీ వేంకటాచలపతియును, ఆ తింత్రిణీ వృక్షము క్రింద ఆస్థానమై యుండి, బ్రహ్మాది దేవతలకు సేవను ప్రసాదించెను' - అని ఆ దివ్య స్థలమున శిష్ట గోష్ఠిలో అవిగీతమైన ఐతిహ్యము ప్రసిద్ధమై యుండెను. అదియునుఁగాక, ఇప్పు డెల్లఱికిని ప్రత్యక్షముగనే ఆ వృక్ష ఛాయయును, వృక్షమునకు విస్తారమును మాత్రము ప్రదర్శించుచున్నదై, సూర్య గతివలన తూర్పు పడమరలకు వ్యాపింపనిదై, నిశ్చలమై యున్నది. అందుచే, 'ఆ వృక్షము ఆదిశేషుని యంశమే' - అని నిశ్చయింపఁదగి యున్నది.

'అలర్ మేల్ మంగై నాయ్చ్చియార్లు, తామే, ఆ తింత్రిణీ వృక్షమునకు నైరుతి దిగ్భాగమున, స్వామివారికి దక్షిణ పార్శ్వముగ, వెనుక ప్రక్క సంశ్లిష్టమైయుండు[49] నొక చంపక వృక్షమునకు క్రింది భాగమున వేంచేసియుండి, బ్రహ్మాది దేవతలకు సేవను ప్రసాదించెను' - అని యొక ఐతిహ్య మున్నందునను, ఆ వృక్షము గూడ - సర్వ కాలములయందును పుష్పితముగను, పల్లవితముగను ఉండుటచేతను, ఆ వృక్షము అమ్మవారికి అంతరంగపరిజనమని నిశ్చయింపఁదగి యున్నది.

ఇట్లు, ఇతర వృక్షములకంటె విలక్షణములైన ఆ రెండు వృక్షములను రంగదాసుఁడు తిరునందవన కైంకర్యము జేయునప్పుడు -

---

49. చేరియుండు.

"దేవాజ్ఞయా వర్ధయిత్వా తా వుభౌ దేవసేవితౌ
తిన్త్రిణీం చమ్పకం చోభౌ పాలయేత్తౌ నగోత్తమౌ."

అనియు -

"మమ చాస్థానికాం చించాం అన్యాత్యస్థానం చ చమ్పకమ్ "

అనియును భూగోళ వరాహమునను, బ్రహ్మ పురాణమునను కీర్తింపబడియున్నటుల, శ్రీ వేంకటాచలపతి - 'మా యిద్దరికిని ఆస్థానస్థలములై యుండు రెండింటిని ఛేదింపవలదు' అని నియమించుటచేత -

"ఆస్థాన చించా దేవస్య రమాయాశ్చంపకం తరుమ్"

అని భూగోళ వరాహమున ప్రసిద్ధములైన రెండు వృక్షములకును నిత్యారాధనము జరుగునట్లును ఎంబెరుమానార్లు[60] ఏర్పాటులొనగావించిరి.

## నాగాభరణమును సమర్పించుట

పూర్వకాలమున వీరనరసింహదేవుఁడను నొక గజపతి మహారాజు, తీర్థయాత్రాపరుఁడై, సేతు దర్శనము జేయవలయునని దక్షిణ దేశమునకు ప్రయాణమై వచ్చుచు, మార్గ మధ్యమున శ్రీ వేంకటాచల వైభవమును విని, విచ్చేసి, తిరుమల నెక్కి, స్వామి పుష్కరిణియందు గ్రుంకు లిడి, శ్రీ వరాహ పెరుమాళ్ళను, 'వేంగడత్తరి' అని ప్రసిద్ధిజెందిన శ్రీ నరసింహస్వామిని సేవించి, పిదప, సేవాక్రమము ననుసరించి, తిరువేంగడముడైయాన్లనుగూడ సేవించి, క్షేత్రోపవాసము మొదలగు నియమములతో నుండి, 'కలౌ వేంకటనాయకః'[61] అను ప్రభావమును ఆలకించి, స్వామి పాదారవిందములలో భక్తిపరవశుఁడై, శ్రీ స్వామివారి సన్నిధిలో నేదైన నొక కైంకర్య

60. శ్రీమద్రామానుజులవారు

61. కలి యుగమున ప్రత్యక్ష దైవము శ్రీ వేంకటాచలపతియే.

మును జేయవలయు' నని తలంచి, అచ్చట నుండు విద్వజ్జనముల రావించి, వారితో సంప్రదించెను వారలును -

"భూషణానాం కిరీట శ్చ వాహనానాం పరోరథః
గోపురం చ విమానానాం రత్నానాం వజ్ర ముత్తమమ్"

అని ఆగమ శాస్త్రములలో కీర్తింపఁబడియున్నది దీనిలో నీ మనస్సు నచించిన దానిని చేయుము' - అని ఆనతిచ్చిరి.

అంత నతఁడును దానిని విని, సంతుష్టాంతరంగుఁడై, ఒక గోపురమును కట్టవలయునని నిశ్చయించి, దానికి సాధను లగు మనుష్యుల నేర్పఱచి, కావలసిన ద్రవ్యముల నొసంగి, నిర్ణయము జేసి, పనిని ప్రారంభింపఁజేసి, తిరుమలను దిగి, 'కాశి, కాంచి' అను దివ్యనగరము లకును, శ్రీరంగము మొదలగు దివ్య క్షేత్రములకును జనుదెంచి, అచ్చట సేవించి, సేతు దర్శనము నొనరించి, మరల తిరుమలకు విచ్చేసి స్వామిని సేవించి, కట్టుచున్న గోపురమునుగూడ తిలకించి, సంతుష్టుఁడై దాన ధర్మములనుగూడ నొనరించి, పూర్ణ మనోరథుఁడై యుండెను.

ఆ నాఁటి రాత్రి ఆ గజపతి స్వప్నమున నొక సర్పము కనఁబడి, అతని ముందల నిలచి, 'ఓ గజపతీ ! ఈ తిరుమల నా శరీరమై యున్నది, ఇందు నీవు గోపురమును కట్టించుచుండుటచే, నా దేహమున అధిక భారము గలిగి, బాధయును అధికమై యున్నది. అందుచే నా స్వామి సన్నిధికిఁ బోయినచో - నా దేహమునందలి బాధ తగ్గిపోవును' - అని పలికి, కోవెలలో ప్రవేశించి, సన్నిధిలోనికి వెళ్ళి, తిరువేంగడ ముడైయాన్ల శ్రీవైకుంఠ హస్తమును చుట్టుకొని యుండెను.

రాజును ఇట్టి స్వప్నమునుఁ గని, ప్రబుద్ధుఁడై, భీతుడై, విద్వజ్జనముల కీ వృత్తాంతమును నివేదించి, 'ఈ స్వప్నమునకు

తాత్పర్యము మేమో సెలవిండు' - అని అడిగెను. అంత వారలును - 'ఈ పర్వతము శేషాచల మని వరాహ వామనాది పురాణములలో ఋషులు చెప్పిరిగదా! ఇట్లు శేషాకార మగు ఈ పర్వతమును ఛేదించుట, దానిపై రాళ్ళతో కట్టుట మొదలగు ఈ వ్యాపారము ఆదిశేషునకు బాధాకరముగను, భారముగను ఉండును' అని వాక్రుచ్చిరి.

పిదప, రాజు దీనిని విని చాల భయపడి, గోపురమును గూడ తదుపరి కట్టవలదని నియమించి, అంతటితో బోడిగనే నిలిపి, శ్రీ వేంకటాచలపతికి దివ్య హృదయ పంకేరుహమునకు ఈ మాత్రపు కైంకర్యమే సంతోషపదాయకముగా నుండునది - అని తీర్మానించుకొని, సంతుష్టుండై, 'శేషుని విషయమున అపచారపడితిమే' అని భయ భ్రాంతుండై, ఆ యపచార నివృత్తికై, శ్రీ వేంకటాచలపతికి ఒక నాగాభరణమును చేయించి, 'సన్నిధిలో దీనిని స్వామివారికి సమర్పింప వలయును' - అని సన్నిధిలో నుండువారలను ప్రార్థించెను అంత నచ్చటి పరిజనులు - 'స్వామివారికి నాగాభరణము నెట్లు సమర్పింతుము ?' అని సందేహించిరి.

అప్పుడు శ్రీ వేంకటాచలపతి ఒక భక్తునిపై ఆవేశించి, పూర్వము శేషునకును, వాయువునకును సంవాదము సంభవించి నప్పుడు -

"ఏవం వృత్తే వివాదేతు త్రాగా ద్ధరి రీశ్వరః
కిమేత దితి తౌ దృష్ట్వా శేషే జోకోఽతివిస్తరాన్ -
ప్రాహోద్వృత్తం తదా శేషం కావికార్యం సవిస్తయన్"

అను బ్రాహ్మ పురాణమున చెప్పఁబడియున్నటుల, మేము వాయు పక్షమునకుఁ జెందినవారమై యుండగా, అందుచే శేషునకు మిక్కిలి దుఃఖము గలిగె -

"శేషో గతమదః పశ్చాత్తస్మిన్నేవ నగోత్తమమ్
వాయవ్యే స్వామి సరసః నాగతీర్థే మనోరమే
ఉత్తరే శిఖరే పుణ్యే సాన్నిధ్యం జగతీపతేః
తప స్తేపే మహాఘోరం దివ్యం వర్ష సహస్రకమ్."

అనునట్లు, ఇచ్చటికి కేతెంచి, నాగ తీర్థపు గట్టుననుండి మమ్ము గుఱించి తపస్సు చేయుచున్నాఁడు. అతనియందు మా కిప్పుడు పూర్వ స్నేహము గలిగినది. అందుచే, లోకమున తండ్రి తన కుమారుని చేతులతో నెత్తి, అల్లారుముద్దుగ ఉపలాలించునట్లు, మేమును మా చేతియందితని నిప్పుడు ధరించుతుము" అని ఆనతిచ్చిరి

పిదప సన్నిధి పరిజనులు అందఱును సంభ్రమాశ్చర్య పులకిత గాత్రులై, స్వామివారి వైదుర హస్తమున[52] ఆ నాగాభరణమును సమర్పించిరి.

ఆ రోజు మొదలు - ఎమ్బెరుమానార్లు మంగళాశాసనము చేయుపర్యంతము స్వామివారికి ఒక తిరుహస్తమునందే నాగాభరణ ముండెను తరువాత ఎంబెరుమానార్లు, రాజు గనిన స్వప్నపు రీతిని కటాక్షించి, మఱి యొక తిరుహస్తమునకును సమర్పింపవలయు నని సంకల్పించి, ఒక నాగాభరణమును చేయించి, చుట్టును జుట్టుకొని యుండునట్టుల, అందములతో నొకటిగా జత జేసి, సేవాపరు లగు ఆశ్రిత జనులకు మనోజ్ఞములును భోగ్యమగు రీతిగా స్వామివారికి అలంకరింపఁజేసిరి.

## అళగసింగర్ స్వామివారిని సన్నిధిలో ప్రతిష్ఠించి నిత్యారాధనాదుల నేర్పఱచుట.

"పుణ్యే స్వామి సరస్తీరే పశ్చిమే నృహరిం హరిమ్
భక్త్యా పరమయా యుక్తః పూజయామాస శంకరః"

52. శ్రీపాదములు జూపు చేతికి.

అని స్కాందపురాణమున స్వర్ణముఖీ మాహాత్మ్యమునను -

"నీలకణ్ఠస్తు తత్తీరే ధ్యాయన్ నృహరి మాదరాత్
ఉమయా సహ విశ్వేశః కంచిత్కాల మువాస వై."

అని వారాహ పురాణమున అష్టోత్తర శత నామాధ్యాయమున నుండు నటుల, తిరుమలలో స్వామిపుష్కరిణీ తీరమున శంకరునకు సాక్షాత్కారమును ప్రసాదించుటకై ఆవిర్భవించిన శ్రీ నృసింహస్వామి యగు 'వేంగడత్తరి'[63] అను పెరుమాళ్ళు, ఆదికాలమునుండి నిత్యము గనే వైఖానసాగమ ప్రకారముగ తిరువారాధనమును స్వీకరించుచుండిరి.

ఇట్లుండ, ఒక కాల విశేషమున శైవ జనులు కొంద అచ్చటికి వచ్చి, 'మా దేవత యగు శివునకు పత్యక్షమైన శ్రీ నృసింహస్వామి సమీపమున మేము శివ ప్రతిష్ఠ చేసికొందుము' - అని వాదులాడ నారంభించిరి. అప్పుడు ఆ స్థలమున నివసించు శ్రీవైష్ణవులును, అర్చకులును, అందఱును గూడి, రాజాస్థానమునకుం జని, 'శ్రీవైకుంఠము నందలి క్రీడాచల మీ పర్వతము' - అని, వరాహ వామన మార్కండేయ బ్రహ్మాండ పురాణములయందు సుస్పష్టముగ అభివర్ణింపంబడిన ఈ విష్ణు క్షేత్రమున శివ ప్రతిష్ఠ అనుచితము' - అని యతని వద్ద నుపపాదించి, ఆ ప్రయత్నమును విరమింపంజేసిరి. ఆ శైవులును రాజాజ్ఞచే అచ్చటినుండి వెడలిపోయిరి.

పిదప, ఆ స్థలమున నివసించు పెద్దలు - 'ఇట్లు దేవతాంతరములకు సాధకులగు ఈ అళగియ సింగర్ స్వామివారు[64] ముందటివలె ప్రసిద్ధులై, ఆరాధ్యులై యుందురేని, కలియుగ మగుటచే, దేవతాంతరములందు ప్రీతి గలవారిలో ఏ యొక్కరికేని ఇట్టి బుద్ధి గలిగినచో - ఇయ్యది దేవతాంతర స్థానముగను సిద్ధింపవచ్చును. మఱియు, ఈ

63 శ్రీ వేంకటాచలమున నుండు నృసింహస్వామి.

అళగియ శింగర్ స్వామివారు, లక్ష్మీసనాథులుగ లేనందున, ఉగ్ర మూర్తిగా నున్నారు. కనుక, వీరికి నిత్యారాధనము లుప్త మగునట్లు చేసి, వీరిని అప్రసిద్ధులుగ చేయువలయు' నని నిర్ణయించుకొని, అట్లే చేసిరి.

ఈ వృత్తాంతములను ఎంబెరుమానారులు ఆలకించి, స్వాంత రంగమున మిగుల చింతించి, 'వీరు పురాణ ప్రసిద్ధులగుటచేతను, ఆళ్వారుల శ్రీ సూక్తులకు విషయు లగుటచేతను, వీరికి నిత్యారాధనము లుప్తమైనచో - ఈ స్థలమునకే చాల అనిష్టములు సంభవించును' - అని యోచించి, 'వీరు ప్రత్యేకమైన సన్నిధిలో నున్నందునగదా, పూర్వసంభవములకు అమర్యాద సిద్ధించినది, అందుచే, వీరిని తిరువేంగడముడైయాన్ల సన్నిధిలోనే వేంచేపు చేయువలయును' - అని తీర్మానించుకొని, స్వామివారికి ఈశాన్య దిగ్భాగమున, ఉగ్రవేగము శమించునట్లు విమానాభిముఖముగ[55] ప్రతిష్ఠను చేయించి, 'నృసింహోగ్రస ముందు స్థలములలో పరాభిభవము సంభవింపదు' - అను శాస్త్రార్థమునుగూడ మనస్సునం దుంచుకొని, వారికి నిత్యారాధనము జరుపబడునట్లు కట్టు దిట్టములు జేసిరి.

## మార్గ మధ్యమున శ్రీనృసింహస్వామిని ప్రతిష్ఠించుట

మార్కండేయ మహాముని శ్రీ వేంకటాచల యాత్ర జేయునపుడు, తిరుమలలో మార్గమధ్యమున -

" అదృష్ట్వా వేంకటం శైలం మధ్యే మార్గం దదర్శహ
నరసింహం గుహాస్థానం లోకవిఖ్యాతవైభవమ్

---

54 సుందరు లగు శ్రీ నృసింహస్వామివారు.

55 వారి దృష్టి విమానముపై బడునటుల, విమానమున కెదురుగ,

లక్ష్మీనృసింహ ! ప్రహ్లాద వరదా వ్రతే వైభవ !
దాసానుదాసం దేవేశ ! మాం పాహి మధుసూదన !
ఇతి ప్రణమ్య శుద్ధేన స్వామి పుష్కరిణీం గతః "

అనుశతుల, 'శ్రీ నృసింహస్వామి ఆ మార్కండేయునకు ప్రత్యక్ష మైతి' - అని మార్కండేయ పురాణమున నున్న క్రమమును శ్రావ్య లోచనం జేసి, వారు ఆవిర్భవించిన గుహా ప్రాంతమునందే, ఒక దేవాల యమును నిర్మింపంజేసి, ఆ నృసింహస్వామిని శ్రీ వైఖానసాగమ ప్రకారముగ ప్రతిష్ఠను చేసి, వారికి నిత్యారాధనము జరుగునట్లు ఏర్పాటు జేసిరి.

## ఏడవ ఉత్సవము రోజున - పెరుమాళ్ళు అనన్తాళ్వాన్ల నంద వనము వేంచేయినట్లు కట్టడి చేయుట.

అనంతాళ్వాన్లు, ఒక తిరునందన వనము నేర్పఱచి, అందుండి పుష్పములం గోసికొనివచ్చి, తోమాలల గట్టి, ప్రతి నిత్యమును స్వామివారికి సమర్పించుచుండిరి. అట్టి సమయమున తిరువేంగడ ముడైయాన్లు, అనంతాళ్వాన్లు చేయు కైంకర్యమున తా మత్యంత ప్రీతులైన ప్రకారమును, వారి భావ శుద్ధిని అందఱును గుర్తెఱుగ నిలయునను సంకల్పముతో, ఒక పురటాసి ( భాద్రపద ) బ్రహ్మో త్సవ కాలమున, ఏడవ తిరునాళ్ళ దినమున, రాత్రి కాలమున, తాము అలర్ మేల్ మంగైయును, రాజ కుమారుఁడు - రాజ కుమార్తెయునై, ఆళ్వాన్ల ఉద్యాన వనమునకు విచ్చేసి, పుష్పాప చయము జేసికొని బయటికి వచ్చు సమయమున, అనంతాళ్వాన్లు వారలం జూచి, 'దొంగలు వచ్చి పుష్పములం గోసికొనివెళ్ళుచు న్నారు' - అని వారలను పట్టుకొనవలెనని వారలను తెలుపుగ,

రాజ కుమారుఁడును అప్రదక్షిణముగా సన్నిధినిఁ జుట్టి వచ్చి, మఱల తిరునంద వనము వాకిట సాక్షాత్కరించి, అంతర్హితుఁ డయ్యెను. అనంతాళ్వాన్లు అతనిని వెంబడించి పరుగెత్తుచు, తిరునంద వనపు వాకిటకు వచ్చినంతనే ఆతనిని చూచితే పోయిరి' - అను ఐతిహ్యము, తిరువేంగడ ముడైయాన్లకు ప్రతి సంవత్సరము అనుష్ఠేయము గావలెను - అని ఎంబెరుమానారులు సంకల్పించి, ఏడవ తిరునాళ్ళ దినమున ఉద్యాన వన విహారార్థముగ స్వామివారు వేంచేయునపుడు సన్నిధికి అప్రదక్షిణముగ వేంచేయువలయునని కట్టడి చేసిరి.

## చిత్రకూట దివ్యదేశమునకు మంగళాశాసన మొనరించునటుల ఏర్పాటు చేయుట

క్రిమికంఠుఁ డను నొక అవ్యాపదేశ్యుఁడు[56] అనేక జన్మార్జిత పాప పరవశుఁడై, తన రాజ్యమగు శోళ దేశమున అనేకము లగు విష్ణుద్రోహములఁ జేసి, కావేరీ తీరమున కణ్వమహామునికి ప్రత్యక్షమైన శ్రీ గోవిందరాజస్వామి దివ్యక్షేత్రమగు తిరుచిత్రకూట మను దివ్య దేశమున[57] శ్రీ గోవిందరాజస్వామివారి సన్నిధిని సమూలముగ ధ్వంస మొనరించెను.

ఆ వృత్తాంతమును శ్రీమద్రామానుజులవారు విని, పురాణ ప్రసిద్ధమై, శ్రీ కులశేఖర పెరుమాళ్ళు, తిరుమంగై యాళ్వార్లు - అను ఇద్దరాళ్వారులును కీర్తించిన దివ్యస్థలము ఈ రీతిగ సమూలముతో ధ్వంసమైపోగూడదు - అని తలంచి, భవిష్యత్ జ్ఞానముచే[58] పూర్వజ్ఞు లగుటవలన, ఆ దివ్యదేశ న మఱల భగవదావిర్భావము సంభవిం

---

56 చెప్పఁదగనివాఁడు

57 ఈ దివ్య దేశము చిదంబరమున, శ్రీ నటరాజస్వామివారి ఆలయముననే ఉన్నది.

58 రాఁబోవు కాల విశేషముల గుర్తెఱుఁగు బుద్ధి విశేషముచే

చుటకై, తిరుమల ఉడిగారమున శ్రీ గోవిందరాజ పెరుమాళ్ళు తిరువేంగడ ముడైయాన్ల అభిమానాంతర్భూతులై వేంచేసియుండుటంబట్టి, ప్రతి నిత్యము తిరువేంగడ ముడైయాన్లు రాత్రి అర్ధయామ ప్రసాదమును ఆరగించిన పిదప, అర్చకులు శ్రీ శఠగోపమును వస్త్రముతోఁ గప్పి, చేతితో వేంచేపు చేసికొని, ఛత్ర చామరములతో - 'వెన్ఱిమాలై యిట్టాన్' అను తిరుయిందెఱుమునకు[59] దక్షిణాభిముఖులై నిలువ, అప్పుడు దేవాలయాధికారులు కట్టియమును విన్నపించి, 'అరుళప్పాడు' (హెచ్చరిక) శ్రీ చిత్రకూటకైంకర్య ధురంధరులై, తిరువేంగడ ముడైయాన్ల దేవాలయాధికారము గూడా నిర్వాహకులైన 'సేనముదలియాళ్వార్లు' అను - సన్నిధి పారుపత్యమునుఁ జేయు శ్రీ వైష్ణవులకు పరివట్టమునుఁ గట్టి, శ్రీ శఠారిని ప్రసాదింపవలయును - అని కట్టడి జేసిరి.

## ఇతర దివ్యదేశ విలక్షణముగ
## అధ్యయనోత్సవాదుల నేర్పఱచుట

తిరువేంగడ ముడైయాన్లు, ఆళ్వార్ తిరువరంగ పెరుమాళ్ అరయర్లకై,[60] అధ్యయనోత్సవమున ఇతర దివ్యదేశముల వలెగాక 'ఇయల్పా' దివ్యప్రబంధము మొదలుగా - నాలాయిర దివ్యప్రబంధమును ఇరువదిమూఁడు దినములు చొప్పున ప్రతిసంవత్సరము అవధారణ జేయునట్లును, అనంతరము శ్రీ వరాహ పెరుమాళ్ళు ఒక రోజు అధ్యయనోత్సవమును పరిపాలించునట్లును, పిదప - శ్రీ గోవిందరాజ పెరుమాళ్ళు దివ్యప్రబంధముల అవధారణ జేయునట్లును, ఇట్లు కొన్ని ఉత్సవములను తిరువేంగడ ముడైయాన్లతో ఏక కాలముగఁ గాక, భిన్నకాలములలో పరిపాలించునట్లును ఏర్పాటు చేసిరి.

---

59 బంగారు వాకిలికి ముందున్న మంటపమే యిప్పటిది

60 దివ్య ప్రబంధమును దివ్యగానముతో సాభినయముగఁ బాడుచు, శ్రీరంగమున వేంచేసి యుండు స్వామికి — 'అరయర్లు' అని పేరు.

## మార్గశీ మాసమున శ్రీకృష్ణస్వామినే శయ్యాబేరముగ జేయుట

తిరువేంగడ ముడైయాన్ల సన్నిధిలో స్నపన బేరమగు అళగ ప్పిరానార్లు రాత్రి కాలముల ప్రతి నిత్యము శయ్యా బేరమై, పందిరిపట్టెమంచముపై శయనించునట్లు, శ్రీ వైఖానసాగమమున జెప్పఁబడియున్నట్లు, పూర్వము పెరియాళ్వార్ల తిరుకుమార్తె యగు శ్రీ ఆండాళమ్మవారు కృష్ణునితోడి సంశ్లేషానుభవమును ఆకాంక్షించి, మార్గశీ మాసము ముప్పది రోజులును, ప్రతి దినము ఒక్కొక పాశురముగ ముప్పది పాశురములైన దివ్య ప్రబంధమును అనుగ్రహించుట చేతను, 'వేంగడ ఎత్తెక్కనైన్న విది త్తియే' (శ్రీ వేంకటచలపతికే నన్ను అంకితము చేయుమా కామదేవా!) అని ఇతరము లగు అర్చావతారములను పరిత్యజించి, మొదట తిరువేంగడ ముడైయాన్లనే ఆకాంక్షించుట చేతను, విభవావతార అర్చావతారములకు ఐతిహ్య మున్నందునను, శ్రీ వైఖానసాగమమున ఒక సంహితలో మార్గళినెల యంతయును శ్రీకృష్ణుఁడే శయ్యాబేరమై యుండవలసినట్లు విధి గనఁబడుచున్నందునను, పెరతయి పక్షమును శ్రీకృష్ణునే శయ్యాబేరముగ విధించుటచేతను, మార్గళి మాసము ముప్పది రోజులును శ్రీకృష్ణస్వామియే పట్టెమంచమున పవ్వళించి, జగత్తుల నుజ్జీవింపఁజేయునట్లు కట్టు దిట్టము నేర్పఱచిరి.

## తిరుమలైనంబి సన్నిధిలో శ్రీమద్రామాయణ కాలక్షేపము చేయుట; స్వయంవ్యక్తము లగు శ్రీపాదములను, తత్పార్శ్వమున ఆళ్వారులను ప్రతిష్ఠించుట

తిరుమలైనంబిగారు ఆళవందారుల నియమన ప్రకారము తిరుమలలో నిత్యవాసము చేయుచు, మూఁడు సంధ్యలయందును తిరువేంగడ ముడైయాన్లను సేవించుచు, ప్రతి నిత్యము ఆకాశగంగా తీర్థము

నుండి తిరుమంజన తీర్థ కైంకర్యమును నిర్వహించుచు, మంగళాశాసన పరులై వేంచేసియుండు కాలమున, శ్రీమద్రామానుజులవారు ఆళవందారుల నియమమును అనుసరించి, శ్రీమద్రామాయణ పాఠార్థమై శ్రీరంగమునుండి బయలుదేరి, తిరుమల అడివారమునకు విచ్చేసిరి. తిరుమలైనంబిగారును వీరికై, ఒక సంవత్సర కాలము ప్రతి నిత్యము ప్రాతఃకాలములయందు తిరుమంజన కైంకర్యమును పూర్తి జేసికొని, స్వామివారిని సేవించి, సుహా ప్రసాదమును తీసికొనివచ్చి, రామానుజులవారికి సమర్పించి, తిరుమల అడివారమున నొక తింత్రిణీవృక్షము క్రింద[61] నొక గుండురాతివద్ద పారాయణ ప్రసాదించి, మధ్యాహ్నకాలమున యాగానుయాగములు[62] నిర్వర్తించుకొని, సాయంకాల సేవకు తిరుమలకు వేంచేయుచుండిరి

ఇట్లు కొన్ని రోజులు గడుచుచుండగా, ఒకానొక సమయమున, తిరుమల తిరువేంగడ ముడైయాన్లను ధ్యానించి, 'స్వామీ ! దేవరవారు అద్యపర్యంతము ఆళవందార్ల కటాక్ష విశేషమున త్రిసంధ్యాకాలములలో సేవను ప్రసాదించుచుంటిరి ఇప్పుడు శ్రీమద్రామాయణ పార నిమిత్తముగ మధ్యాహ్న సేవ లేకున్నది' - అని విచారాక్రాంతులై, కన్నులు మూసిరి అప్పుడు స్వప్నమున తిరువేంగడ ముడైయాన్లు సాక్షాత్కరించి, నంబిగారిని చూచి, 'మీకు మధ్యాహ్న సేవనుగూడ ప్రసాదించితిమి' - అని ఆనతిచ్చిరి. అంతట నంబిగారును ప్రబుద్ధులై, పూర్వపు రీతిగ తిరుమంజన తీర్థకైంకర్యమును పూర్తి జేసికొని, తిరుమల అడివారమున యథాస్థానమున వేంచేసియుండిరి. ఎంబెరుమానారులును తిరుపతినుండి అచ్చటికి విచ్చేసిరి అప్పుడు, అచ్చట మృగమద కస్తూరికా కర్పూర పరిమళము లు నలు.

61. చింతచెట్టు.

62. భగవన్నివేదనమును, స్వాత్మనివేదనమును.

దెసలను గ్రమ్ముకొనెను అంత నంబిగారును, ఎంబెరుమానారులును - 'ఇది యేమి ?' అని ఆలోచించుచు, నలు దెసలc బరికింపcగా, ఆ తింత్రిణీ వృక్షము క్రింద నుండు ఆ గుండు రాతిపై, తిరువేంగడ ముడైయాన్ల తిరువడిఘళ్ళు ( శ్రీ వేంకటాచలపతి శ్రీపాదపద్మములు ) రెండును సాక్షాత్కరించెను.

ఆ తిరువడిఘళ్ళను సేవించి, నంబిగారును, తాము గనిన స్వప్న వృత్తాంతమును ఎంబెరుమానార్లకు వివరించిరి పిదప, సర్వేశ్వరుని సంకల్ప సిద్ధిని కండ్లార గాంచి, ఇర్వురును ఆశ్చర్యచకితులై, ఆ స్వయం వ్యక్తమగు తిరువడిఘళ్ళను సేవించి, దానిక్రిందుగ పదుగు రాళ్వారులను, తిరువడిఘళ్ళతో నొకే శరీరముగc దోచునటుల వేంచేపు జేసి, ఆ తిరువడిఘళ్ళకు ఒక దివ్యాలయమునుగూడ గట్టించి, ప్రతిష్ఠార్చనాదు లెల్లను శ్రీ వైఖానసాగమ ప్రకారముగc జేయించి, తీర్థ ప్రసాదాద్యన్వయమునుcగూడ పరిపాలించి, ప్రబంధ శేషమును తిరువడిఘళ్ళ సన్నిధిలో అనుసంధించి, శాత్తుముఱను ( ఉత్తర శాంతి పాఠమును ) గూడ చాల వైభవముతో జరిపిరి.

## కృపామాత్రప్రసన్నాచార్యు లగు శ్రీమద్రామానుజులవారు గోవింద నామోచ్చారణతో తిరుమల నెక్కునట్లు ఏర్పాటు చేయుట

" ముచ్యతే సంశయ శ్చోచ్చైః గోవిన్దేతి పునః పునః "

అనునటుల, నైమిశారణ్యవాసు లగు కొందఱు మహర్షులు, సూత ముఖమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమును విని, తిరువేంగడ యాత్ర జేయునపుడు, ఇతరము లగు భగవన్నామముల నుపేక్షించి, 'సదా గోవిన్ద కీర్తనమ్' ( ఎల్లప్పుడు గోవిందనామ సంకీర్తన చేయవలయును ) అని ప్రమాణము ననుసరించి, 'గోవిందా !' అను తిరు

నామమునే ఉచ్చైస్స్వరముతో అనేక పర్యాయములు కీర్తించుచు, శ్రీ వేంకటాచల యాత్రను చేసిరి' - అని, శ్రీ వారాహ పురాణమున నున్న అర్థ విశేషమును మనస్సునం దుంచుకొని, 'ఈ శ్రీ వేంకటాచల క్షేత్రము దేవతాంతర గంధ మెయ్యదియును లేని విష్ణు క్షేత్రము' - అని లోకమున పండిత పామర సాధారణముగ నెల్లరును గుర్తెరుంగుటకై, శ్రీ వేంకటాచల యాత్ర నొనరించు పరమ భాగవతులును గూడ, ఆ మహర్షులవలెనే, పదే పదే గోవిందనామోచ్చారణమును జేయుచు, యాత్ర నొనరింపవలయు ననియును కట్టుదిట్టము గావించిరి.

## శ్రీరామ లక్ష్మణ సీతా విగ్రహములను స్వామివారి సన్నిధిలో ప్రతిష్ఠించుట

" కృతమాలా నదీతీరే విశ్వమ్భరకృతే హరిః
ఆవిరాసీత్ రఘువరో విభీషణ భయాపహః "

అని వాసిష్ఠ రామాయణమున నున్నటుల, 'వైగై' అను నదీ తీరమున దక్షిణ మధురా నగరికి పశ్చిమ దిగ్భాగమున నుండు 'కురు విత్తురై' అను నగరమున 'విశ్వంభరుడు' అను నొక మహాముని, చక్రవర్తి కుమారులగు శ్రీరామచంద్రులు సముద్ర తీరములో విభీషణుని విషయమున -

" ఆనయైనం హరిశ్రేష్ఠ ! దత్త మస్యాభయం మయా "

అని అభయప్రదానము జేసిన అనుగ్రహ విశేషమునం దత్యంత ప్రవణుడై, తనయం దట్టి పరిపాకమును కటాక్షింపవలయును — అని ఆ పెరుమాళ్ళనుగూర్చి తపస్సు జేసెను. అప్పుడు పెరుమాళ్ళను ఆ యాశ్రితుని విషయమైన కృపా పారవశ్యముచే, వాని స్వప్నమున తాము ను, శ్రీ ఇళైయ పెరుమాళ్ళు(లక్ష్మణ స్వామియు)ను ధనుర్ధరులై యుండునట్లును, తమ సన్నిధిలో —

"విభీషణకృతే సర్వం విజ్ఞాప్య హరిపుంగవః
యథేష్టం కురు రాజేన్ద్ర! త్యుచ్చర న్నంజలి వ్యధాత్ "

అనునటుల, శ్రీ మహారాజులు (సుగ్రీవుఁడు) శ్రీ విభీషణాళ్వార్ల నిమిత్తము ఉచిత వాక్యములఁ బలికి, 'స్వామి తమచిత్తమున కనుగుణముగ కటాక్షింపవలయును' — అని అంజలి హస్తులై సేవించుచున్నట్లును, శ్రీ హనుమానులు (తిరువడి) "స ఏష దేశః కాల శ్చ" (అట్టి దేశము, కాలము నిదియే) అని శ్రీ విభీషణాళ్వార్లను అంగీకరించుటకు అనుకూలము లగు కొన్ని విజ్ఞాపన వాక్యములను పెరుమాళ్ళ సన్నిధిలో నిలచి విజ్ఞాపనను జేయుచున్నటులను —

"వాయుసూను ర్మహాతేజా విభీషణ ముపస్థితమ్
దర్శయ స్తం తదాకాశే నిర్దిశ్యోద్ధృతపాణినా "

అనునటుల, అంగద పెరుమాళ్ళను ఆకాశమున వచ్చి నిలచియున్న శ్రీ విభీషణ పెరుమాళ్ళను అంగుళి నిర్దేశముచేఁ జూపుచున్నట్లును ఉండు సన్నివేశముతో సేవను ప్రసాదింప, కండ్లార గాంచి, ధన్యుఁడై, ప్రబుద్ధుఁడై, అట్టి సంస్థాన విశేషమును తనకు నిత్యోపాస్యముగ నుండునటుల అర్చారూపముగ నేర్పఱచుకొని, చిరకాలము భక్తితో నారాధించెను.

అట్టి శ్రీ రామచంద్రమూర్తియు, శ్రీ లక్ష్మణస్వామియును ఆ 'మరువితుఱై' అను దివ్య నగరమున ఒక కలహము సంభవించిన కారణముచే, ఒక భక్తుని ముఖమున 'మమ్ము తిరుమల ఆఁడివారము నకు వేంచేపు జేసికొనిపొమ్మఁడు' — అని నియమింప, ఆ భక్తుఁడును అట్లే స్వామివారిని వేంచేపు చేసికొని, తిరుపతిలో వేంచేసియున్న ఎంబెరుమానార్ల సన్నిధికిఁ దీసికొని వచ్చెను.

అప్పుడు ఎంబెరుమానార్లు శ్రీ తిరుమలనంబివద్ద సేవించుచున్న శ్రీమద్రామాయణమున శ్రీ విభీషణాభయ ప్రదాన సమయమై యుండెను. శ్రీ నంబియు, ఎంబెరుమానార్లును వీరలు అచింతితముగ వేంచేసిన విషయమునుఁ బలికించి, సంతుష్టాంతరంగులై, వారలు వచ్చిన వృత్తాంతముల నెల్ల నాలకించి, అత్యంత ప్రముదితాంతరంగులై, ఆ నాఁడు శ్రీ విభీషణాళ్వాన్లను అనుగ్రహించినట్లు,ఇప్పుడును ఈ అభయప్రదాన సమయమున మనలనుఁగూడ అనుగ్రహించుటకే స్వామివారు వేంచేసి రని నిశ్చయించి,మునుపు - రావణ భవనమునుండి జనకనందిని విచ్చేసి, పెరుమాళ్ళ దివ్య సన్నిధిలోఁ జేరినటుల, వీరలకు వైవాహిక మంగళమును నిర్వర్తింప వలయునని సంకల్పించి, ఒక పిరాట్టిని (దేవ విగ్రహమును) అవతరింపఁజేసి (చేయించి), ఆ చక్రవర్తి తిరునుగనార్లకు[68] తిరుక్కల్యాణమును యథావిధిగ జరిపించి, వారి శ్రీపాదముల సేవించి, మంగళాశాసనము జేసి, "కడైన్ద పాఱ్కడల్ కిడన్దు", "కాలనేమియై క్కడిన్దు", "ఏళ్ రఙ్గళుమ్ ... ఉయ్మ్మినో" అని ఆళ్వార్లు అనుగ్రహించిన శ్రీసూక్తి సత్య మగునటుల, తిరుమలలో తిరువేంగడ ముడైయాన్ల సన్నిధిలో వేంచేపు జేయించి, నిత్యారాధనముల పరిపాలించునట్లు కట్టు దిట్టములఁ జేసిరి.

## 'తిరుక్కురుపై' గ్రామమున శ్రీ స్వామివారిని, కురుపై నంబిని ప్రతిష్ఠించుట

కలియుగారంభమున తొండమాన్ చక్రవర్తి, తిరువేంగడ ముడైయాన్ల తిరువడి ఘళ్ళలో అంతరంగభక్తుడై, సకల విధ కైంకర్యములనుఁ జేయుచుండు కాలమున, తిరుమలకు ఈశాన్య దిగ్భాగ

68. శ్రీ రామచంద్రమూర్తికి.

ముఁన[64] యోజనదూర విప్రకృష్ట మగు 'కురువై' అను గ్రామమున నిత్యవాసియై, తిరువేంగడ ముడైయాన్ల తిరువడి ఘళ్ళలో — నిర వధిక భక్తి యుక్తుఁడైన కులాల వంశజుఁడగు నొక విష్ణు భక్త శ్రేష్ఠుఁడు, తన దేవ యాత్రకు ఉచితములగు భాండముల నిర్మించిన పిదప, తన భక్తి ప్రకర్షమునను మట్టిని పిసికి, నాలుగు పుష్పములను జేసి, శ్రీ వేంకటాచలపతి పాదారవిందములకూర్చి నిత్యము సమర్పించుచుండెను.

అతఁడు చరమ శరీరి[65] యగుటచే, ఆ పుష్పములు చక్రవర్తి సమర్పించిన స్వర్ణ కమలపుష్పముల పై నుండగా, దీనిని చక్రవర్తియును ఒక రోజు అర్చక ముఖమున విని, తానును స్వయముగఁ జూచి, ఇట్టి భక్తాగ్రేసరుని దాసునకు నెఱుకపఱచవలయు నని స్వామి వారి నడిగెను.

స్వామియును — 'చెప్పగూడదు' అని అనగా — 'అవశ్యము చెప్పవలయును' అని చక్రవర్తి పట్టు బట్టెను. ఆ భక్తుఁడును — 'నన్ను ఎవరికిని ప్రకాశము చేయవద్దు, అట్లు ప్రకాశ పఱచినచో — మరణించెదను' — అని మునుపే శపథము చేసియుండుటచే, స్వామియును - 'చెప్పఁగూడదు' అనిన, చక్రవర్తియును పెరుమాళ్ళను నిర్బంధించి అడిగెను. పిదప, స్వామియును — తమ భక్తునకు చరమ కాలము[66] వచ్చిన దని గుర్తెఱింగి, 'తమ భక్తుఁడు ఫలాని వాఁడు, ఫలాని ఊరిలో నున్నాఁడు' అని ఆనతిచ్చిరి. అంత నప్పుడే, ఆ భక్తుని సేవింప వలయు నని చక్రవర్తి బయలుదేర, అప్పుడు - 'నీ వొక్కఁడవే వానిని జూడఁబోదువుగాక!' అని పెరుమాళ్ళు సెల విచ్చిరి.

---

64 ౩. ఆమడ దూరమున నుండు

65 యోగ సిద్ధి నొంది, చరమ శరీరము గలవాఁడు.

66. కడతేరు సమయము.

అటులనే యంగీకరించి, చక్రవర్తియును ఒంటరిగనే బయలుదేరి, అతని గ్రామమునకు వెళ్ళి, అతని మ్రోల నిలువ, అప్పుడు ఆ భక్తుండును దివ్యజ్ఞాని యగుటచే, ఎదురుగ నిలచియున్నవాండు చక్రవర్తి — అని ఎఱింగి, 'శ్రీ వేంకటాచలపతి నన్ను ప్రకాశపఱచెను, ఇంక నాకు ఈ శరీరము వలదు' అని నిశ్చయించి, తన చేతిలో నున్న భాండ నిర్మాణ సాధన మగు త్రెడ్డును గైకొని, తన తలపై మోదికొనెను.

ఆ నాండు శుక్రవార మగుటచే తిరువేంగడ ముడైయాన్లకు అప్పుడు తిరుమంజన కాలమై, కిరీటము మొదలగు తిరువాభరణములం దీసియుంచిన సమయమై యుండెను. అట్టి దివ్య మంగళ విగ్రహ సన్నివేశము తోడనే శ్రీ స్వామివారు ఆ నంబికి సాక్షాత్కరించి, అతనిని స్వీకరించి యనుగ్రహించిరి.

ఇట్టి వృత్తాంతమును ఎంబెరుమానారులు ఆలకించి, 'తిరువేంగడ ముడైయాన్లు, ఇట్లు ఆశ్రిత పరతంత్రుండు,[67] ఆపత్సఖుండు,[68] అను విషయమును ఇతర చేతను లెల్లరునుగూడ నెఱింగి, ధన్యులు గావలయును' — అను ఉదార బుద్ధితో, ఆ 'కురువై' అను గ్రామమున, తిరువేంగడ ముడైయాన్లను కిరీటము - మొదలగు తిరువాభరణము లెవ్వియును లేకుండునట్లును, అనావృత శిరస్కులుగా[69] నుండునట్లును వేంచేపు జేసి, వారి సన్నిధానమున త్రెడ్డు పట్టుకొని యున్న చేతితోడ ఆ కురువైనంబి విగ్రహమునుంగూడ నుండు

67 తన నాశ్రయించినవారలకు స్వాధీనుండై యుండువాండు.

68 ఆపదలలో నెయ్యమై యుండువాండు

69. ఆచ్ఛాదన మెయ్యదియును లేని శిరస్సు గలవాండు

నటులఁ జేసి, వారలకు ఒక ఆలయమునుఁగూడ కట్టించి, దానిలో ఆ విగ్రహములను ప్రతిష్ఠించి, నిత్యారాధనము జరుగునట్లు ఏర్పాటుల నొనరించిరి.

## 'తన్నీరముదు తిరుత్తల్' అను తిరుమంజన కైంకర్యమును ఏర్పాటు చేయుట

పెద్ద తిరుమలనంబిగారు, తిరుమలలో తిరువేంగడ ముడైయాన్లకు నిత్యము పాపవినాశ తీర్థమునుండి పెరియ తిరుమొళి యను సంభాషణముతో తిరుమంజన తీర్థమును తెచ్చుచు, కైంకర్యమును జేయుచుండ, తిరువేంగడముడైయాన్లు, వా రనుష్ఠించు కైంకర్యమున తమ హృదయము పల్లవించిన రీతిని ఎల్లఱును ఎఱుంగ వలయు నని మనోరథము గొన్నవారలై, ఒకానొకనాఁడు నంబిగారు తిరుమంజన తీర్థమును దెచ్చు మార్గమున నొక వ్యాధాకారుఁడై, చేతిలో విల్లును ధరించి, నంబిగారి ముందు నిలచి, 'తాతా! దాహము వేయుచున్నది, తీర్థమును కొంచెము మిండు' - అని ప్రార్థింప, శ్రీ నంబిగారును ఆ వ్యాధునిఁ జూచి, దీనిని తిరువేంగడ ముడైయాన్లకై కొనిపోవుచున్నాను, ఈ తీర్థము మనుష్యార్హము గాదు' - అని సెలవిచ్చి, తిరుమొళిని అనుసంధించుచు, భగవ దనుభవావిష్ట హృదయులై, తిరుమంజన తీర్థమును వేంచేపు జేసికొని పోవుచుండిరి.

అంత వ్యాధుఁడును, నంబిగారికి తెలియకుండునట్లు వారి వెనుకఁ బోవుచు, చేతిలో నున్న బాణాగ్రముచే, తిరుమంజన ఘటమునకు ఛిద్ర మొనరించి, ఆ రంధ్రము ద్వారా వెలుపడి, ధారగ బడుచుండు తీర్థమును తన హస్తములతోఁ బట్టి త్రాగెను.

నంబిగారును కొంత దూర మరిగిన పిమ్మట, తీర్థ మంగయును పోయినందున, తలపై నుండు తీర్థ ఘటము తేలిక యైపోవుటచే

తీర్థము పోయిన వైనము నెఱింగి, విచారపడి, వెనుదిరిగి చూచి, వ్యాధుని యా దుష్ట చేష్టితమును గనుఁగొని, మిగుల దుఃఖించి, 'ఓరీ, వ్యాధుఁడా! తిరువేంగడ ముడైయాన్లకు గొంపోవుచున్న తీర్థమున నిట్టి ద్రోహము నాచరించితివే!' అని, ఆక్రోశముతోఁ బలికిరి.

అంత నా వ్యాధుఁడును నంబిగారిని తిలకించి, 'స్వామీ! మీరు విచారపడవలదు, సమీపమున వేఱు తీర్థమును జూపించెదను, నాతో దయచేయుఁడు' — అని వినయము గదుర బలికి, ఆకాశగంగా తీర్థమునకు బిలుచుకొని వెళ్ళి, ఆ మడుగులో తీర్థము లేకపోఁగా — ధనుస్సున బాణము ననుసంధించి, ఒక గుండురాతికి క్రిందుగ ప్రయోగించి, ఆ బాణము తగిలిన గుండురాతి క్రిందుగ, అవిచ్ఛిన్న మగు నొక తీర్థధార బహు వేగముగ ప్రవహించెను పిమ్మట, వ్యాధాకారు లగు తిరువేంగడ ముడైయాన్లును — 'తాతా! ఇటుపై ఈ తీర్థమునుండియే మాకు నిత్యముగ తిరుమంజన తీర్థమును గొనితెచ్చి యిండు' — అని అనతిచ్చినట్లు, తమ ఈశ్వరత్వమును స్మరింపఁజేసి, అంతర్హితులైరి.

పిదప, నంబిగారును, ఆ యాశ్చర్యమునుఁ గని, తిరువేంగడ ముడైయాన్ల లీలా రస విశేషము నునయుం దిట్లు ప్రవహించినదే! ఆహా! ఏమి ఆ దివ్యక్రమము! అని, నితాంత ప్రముదిత స్వాంతరంగులై,[70] ఆ తీర్థపు బండనుండియే తిరుమంజన తీర్థమును వేంచేపు జేసికొని వచ్చి, సన్నిధిలో పూర్వమువలె సమర్పించిరి. అప్పుడు తిరువేంగడ ముడైయాన్లును - అర్చక ముఖమున హెచ్చరిక (అరుళప్పాడు)ను బలికి, 'నంబీ! దేవరవారు గొనితెచ్చిన తీర్థము వలన మార్గ మధ్యముననే మా దాహము తీరినది' — అని అనతిచ్చిరి.

70. మిక్కిలి సంతసించిన చిత్తము గలవారలై

నంబిగారును — 'ఆహా! ఏమి ఈ వినయాకార మున్న క్రమము!' - అని సంతసించి, ఆ రోజు మొదలు, ప్రతి నిత్యమును ఆకాశ గంగా తీర్థధార నుండియే తిరుమంజన తీర్థమును దెచ్చుచు, ఆ కైంకర్యమును నిర్వహించుచు వేంచేసియుండిరి.

కొన్ని రోజు లిట్లు గడచిన పిదప, నంబిగారి యవతార సమాప్తి కాఁగా, ఎంబెరుమానార్లు దానిని విని, వారి శ్రీపాద పద్మముల యందలి ప్రేమాధిక్యమున, ఆ నాఁడు నంబిగారిని మార్గమధ్యమున కటాక్షించిన దినము అధ్యయనోత్సవమునకు అనంతర దినము[71] నుండినందున, ఆ తిరుమంజన కైంకర్య మహోత్సవమును అధ్యయన మహోత్సవమునకు కడపట ప్రతి సంవత్సరమును జరుపునట్లు కట్టడి నేర్పఱచిరి.

### పరిష ద్వేంకటేశ్వరులకు నిత్యారాధనాదుల నేర్పఱచుట

బ్రాహ్మ పురాణమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున తొండమాన్ చక్రవర్తి వృత్తాంతము గల ప్రకరణమున, చక్రవర్తికి శ్రీ వేంకటాచలపతి ప్రత్యక్షమై, హితోపదేశ ముఖమున మాటలాడుచు, అతనికి ఇష్టదైవమై యుండు రోజులలో - చక్రవర్తి శత్రుజయార్థమై దేశాంతరములకు బయలుదేరి, వెళ్ళిన స్థలము లన్నిటి యందును జయము సిద్ధించి, ఒక చోట మాత్రము అపజయము సంభవించెను. అంత శత్రువులు తఱుముకొని రాఁగా, చక్రవర్తియును పరుగిడి వచ్చి, తిరుమల అడివారము నందు గుహలో ప్రవేశించి, పెరుమాళ్ళ సన్నిధికి జని, వారితో తన పరాభవములను విన్నవించుకొనెను.

తిరువేంగడ ముడైయాన్ను అతని దీనాలాపముల విని, ఉపసాంత్వన వచనముచే అతని దుఃఖములను పోగొట్టి, 'ఓ చక్రవర్తీ!

71. మరురోజు.

నీకు జన్మాంతర పాపశేషము కొంచె మున్నందున, నీ కీ పరాభవము సంప్రాప్తమైనది. ఇటుపై వచ్చు కాలమున అన్నియు నీకు విజయములే సిద్ధించును. శత్రు జయమునకై బయలుదేరుము' — అని యాన తిచ్చిరి. అతఁడు మాత్రము పూర్వపు అపజయ సంఘటనను దలంచుకొని, వెఱగుపడి, ధైర్యము చాలనందున — వలదుస్వామీ! వలదు అని చెంపలు వైచుకొనెను

అప్పుడు శ్రీ వేంకటాచలపతి, 'చక్రవర్తీ! భయపడకుము, మాకు అసాధారణాయుధములైన శంఖ చక్రములను నీకు యుద్ధమునకు సహాయముగ నిచ్చెదము. వానిని గలుపుకొని వెళ్ళుము.' అని అనుగ్రహము మీఱ ఆనతిచ్చిరి అంత చక్రవర్తియును విశ్వసించి, తిరుమల అడివారమునకు వచ్చి, హతశేషమైన[72] సైన్యములఁ బరికించి, చింతాక్రాంతుఁడై యుండెను

ఆ సమయమున, కృపామూర్తి యగు శ్రీ వేంకటాచలపతి, అనంత గరుడ విష్వక్సేనాదులను తమ అసాధారణ పరిషజ్జనములతో కూడ —

"గరుత్మన్నిహ సర్వే వై వసామ గిరిమూర్ధని
త్వం గిరే దక్షిణం సానుం ఆసాద్య వస నిత్యశః
శేషాగచ్ఛ వసత్వం చ తార్క్ష్యోధః శైలరూపధృక్ "

అని వామన పురాణమున చతుర్థాధ్యాయమున నున్నట్లు, వైనతేయ విష్వక్సేనులచే నధిష్ఠితమగు గిరి శిఖరమునకు పడమరగ నొక శిఖరమున, అర్చామూర్తియై యావిర్భవించి చక్రవర్తికి సేవను ప్రసాదించి —

---

72. చావగా మిగిలియున్న.

"మా భైషీః పుత్ర ! భద్రం తే చక్ర శంఖౌ దదామి తే
తాభ్యాం గచ్ఛ పురీం దివ్యాం తౌ తే శత్రూన్ హనిష్యతః
ఇత్యుక్త్వా తౌ దదౌ తస్మై తాభ్యాం సహ జగామ సః
తౌ చ శత్రూన్ నిహత్యాశు కృత్వా రాజ్య మకంటకమ్"

అని బ్రహ్మాపురాణమం దున్నటుల, శ్రీ సుదర్శన — పాంచజన్యముల నతనికి చేదోడు వాదోడుగా నుండునట్లు అనుగ్రహించెను.

పిదప ఆ దివ్యాయుధములు రెండును, చక్రవర్తి సన్నిధాన మున దివ్య పురుషాకారములై సాక్షాత్కరించి, 'చక్రవర్తీ ! యుద్ధ మునకు బయలుదేరుము' — అని ప్రేరేపించెను. అంత చక్రవర్తి యును శ్రీ వేంకటాచలపతి వాగ్దానమును సత్య మని నమ్మి, ఆ యాయుధములనుఁగూడ గైకొని బయలుదేరి శత్రువులను జయించి మరలి వచ్చి, శ్రీ వేంకటాచలపతి దివ్యసన్నిధికి విచ్చేసి, వినయ వినమితోత్తమాంగుఁడై, శ్రీవారిని సేవించి, అఖండ భూ మండలాధిపతియై, తిరువేంగడ ముడైయాన్ల తిరువడి ఘళ్ళలో భక్తి పరిపూర్ణ మనోగతుఁడై, చిర కాలము సర్వ భోగముల ననుభ వించుచు, పిదప, తిరువేంగడ ముడైయాన్ల పరిపూర్ణ మగు దివ్య కృపకు పాత్రుఁ డాయెను' — అని బ్రహ్మాండ పురాణపు కథ ప్రసిద్ధ మగుట మాత్రమే గాక, ఆ నాఁడు శేషగిరి శిఖరమున చక్రవర్తికి తమ పారిషదులతోఁగూడ సాక్షాత్కరించిన స్వామియే, నేటికిని 'పరిష ద్వేంకటేశ్వరులు' అను వ్యవహారముతో అందరికిని సేవను ప్రసాదించుచున్నారు.

ఇట్లు శేషగిరి శిఖరమున ప్రాదుర్భవించిన పరిష ద్వేంకటేశ్వ రులకు శ్రీ మద్రామానుజులవారు, ప్రతి నిత్యము అవశ్యములైన వడపప్పు, పానకము, పండ్లు, టెంకాయ — మొదలగువానిని అరగింపు జేయునటుల కట్టడి నేర్పఱచిరి.

ఈ రీతిగ తిరుమలలో అనుద్ఘాటితములైన[73] ధర్మముల నుద్ఘాటితముల నొనర్చియు,[74] జీర్ణములైన[75] ధర్మముల నుద్ధరించియు, దేవతాంతర గంధము[76] రాకుండునట్లు, శ్రీ వేంకటాచలపతి, సౌశీల్య[77] — ఆశ్రిత పారతంత్ర్య[78] — ఆపత్సఖత్వాది[79] కల్యాణ గుణ గణములను గోప్యాంతరస్థులుగూడ నెఱుంగునటులను, స్వామి వారి సిరి సంపదలు నిరుపద్రవములై, ఉత్తరోత్తరము అభివృద్ధము లగునటులను మంగళాశాసనము జేసి, ఇంకను తిరుమలకే అసాధారణ ములైన కొన్ని ధర్మములను ప్రవర్తింపం జేయవలయు నని సంకల్పించి —

తిరుమలలో ననుష్ఠింపవలసిన

ఆచార వ్యవహారముల కట్టుదిట్టములు

"వైకుంఠ లోకాత్ గరుడేన విష్ణుః
క్రీడాచలో వేంకట నామధేయః
ఆనీయ స స్వర్ణముఖీ సమీపే
సంస్థాపితో విష్ణు నివాస హేతోః "

అని మార్కండేయ పురాణమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యములో శ్రీ వైకుంఠ లోకమునందు క్రీడాచల మని ప్రసిద్ధమై,

---

73. అప్రకాశములై (ఎవరికిని తెలియనివై యుండును.
74. ప్రకాశింప (ఎల్లరికిని తెలియునట్లు) చేసియు.
75. నష్టములైన (లుప్తములైన)
76. ఇతర దేవతల సంబంధపు వాసన గూడ
77. అందరితోడను కలసి మెలసి యుండుట.
78. తన నాశ్రయించినవారికి సర్వస్వాధీనుడై యుండుట.
79. ఆపదలలో అభయమిచ్చి కాపాడు ఆప్త మిత్రుడై యుండుట.

"వైకుంఠా దాగతత్వా చ్చ వైకుంఠాద్రి రితి స్మృతః"

అనియు —

"గత్వా తు పరమం ధామ క్రీడాచల మిహానయ
హిరణ్మయ మహా శృంగం పంచోపనిషదాత్మకమ్."

అనియును శుద్ధ వారాహ పురాణమున పరమ పదమున క్రీడాచల మని ప్రసిద్ధమై,

"అయం కదాచి ద్దేవానాం శ్రీనివాస ఇవా బభౌ"

అని బ్రహ్మాండ పురాణమున, శ్రియఃపతియొక్క దివ్య మంగళ విగ్రహ మనియును —

"అనన్తోఽహం మహాదేవ! స్థాస్యామి గిరిరూపధృత్."

అనియును —

"శ్వేత వృషా మణ్డల భువి స్థాస్యామి రమయా సహ."

అని వారాహ పురాణమున ఆదిశేషుని శరీరమనియు, ఇట్లు కల్ప భేద ముచే వికల్పింపఁదగినదై, అప్రాకృత మగు శ్రీ వేంకటాచలమును —

"శుకాద్యా మునయః కేచిత్ భృగ్వాద్యా శ్చ తపోధనాః
ప్రహ్లాద ప్రముఖాః పుణ్యాః అంబరీషాదయో నృపాః
విష్ణో రేషా పరం దేహం మన్వానా స్సం నగోత్తమమ్
ఏధ్యా మాక్రమితుం భీతాః పర్యన్తే ష్వేవ వర్తినః
తన్నిర్గత నదీష్వేవ కుర్వాణాః స్నాన తర్పణే
తపః కుర్వంతి వాంఛంతః సాక్షా త్కర్తుం జనార్దనమ్."

అనునటుల, పరావర తత్త్వజ్ఞులలో ప్రధాను లగు శుకాది మహర్షు లును, ప్రహ్లాద ప్రముఖులైన పరమ భాగవతులును, అంబరీషాదు లగు రాజర్షులును, 'సర్వస్మా త్పరుఁడైన[81] శ్రీమన్నారాయణుని

---

80 ఉత్కృష్టములు, అనుత్కృష్టములు నగు పదార్థముల యాథాత్మ్యమును గుర్తెఱింగిన వారిలో శ్రేష్ఠుడు

81. అన్ని వస్తువులకంటెను మిన్నయైన.

వ్య మంగళ విగ్రహమే యిది' — అని అధ్యవసించి, ప్రాకృత శరీర ములఁ గొని అధిరోహించుటకు భీతులై, అడివారమునసే యుండి, గవ త్సాక్షాత్కారమును ప్రార్థించిరి' అని, స్కాంద వామన రాహాది పురాణములలో నున్న రీతిని, భగవ త్ప్రసాదాసాదిత మల దివ్య జ్ఞాన పరిపూర్ణు లగు ఆళ్వారులును, అట్లే ప్రాకృత రీరముతో ఈ పర్వతమును ద్రొక్కక, తిరుమల అడివారము ండియే మంగళాశాసనముఁ జేసిన క్రమమును స్మరించి, సర్వజ్ఞు గు తామును, ముందొక యాత్రలో — ఆళ్వారులవలె తిరు లను అధిరోహింపక, అడివారమునసే కొన్ని దినములు నివసించుచు, రుమల నంబివారి సన్నిధిలో — ఇతిహాస శ్రేష్ఠమైన శ్రీమద్రా మాయణమును అధికరించి, శ్రీ వేంకటాచలపతినిఁ గూడ మంగళా సనముఁ జేసి, తమ ఐతిహాసికాచార్యు లగు[83] తిరుమల నంబి రును, తమకు ప్రియ శిష్యు లగు అనందాళ్వానులును, శ్రీ వేంకటా లపతి దివ్యాంతరంగము సంతోషించునటుల కైంకర్యముల యుచు వచ్చుచుండుటచే, తాముసు తృప్తి జెంది, సంతో ంచుచున్నవారు, తిరుమలలో నిత్యవాసు లగు మనుష్యుల ప్రవృ ులు, శ్రీ వేంకటాచల వైభవమును, పూర్వకాలమున క్షేత్రవాసు గు మహర్షుల అనుష్ఠాన విశేషములను, శ్రీ వేంకటాచలపతికి ప్రీతి ర మగు శాస్త్రార్థమును తెలిసికొనఁజాలక, స్వేచ్ఛామూలమై నుండుటను బరికించి, వీరలు జ్ఞానాజ్ఞానమూలముగ నొనరించు తీర్థాంశములను[84] నివర్తింపఁజేయుటకై, ఒక శాస్త్రార్థ మర్యాదను పసిద్ధ పఱుపవలయు నని బద్ధ సంకల్పులై,

---

2 భగవంతుని దివ్యానుగ్రహముచే పొందఁబడిన నిష్కల్మషము లగు జ్ఞాన భక్తి వైరాగ్య ములతో గూడియుండు

3. ఇతిహాస మగు శ్రీ మద్రామాయణమును సాధించిన ఆచార్యు లగు

4. ఉత్సవముగఁ జేయుచున్న చెడ్డ పనులను.

"కేచిత్ కైంకర్య నిరతాః కేచి ద్బ్రహ్మాది నిష్ఠితాః
ధ్యాన నిష్ఠా స్తపో నిష్ఠాః కేచి దుద్యాన కారిణః
విగ్రహాలోకనపరాః తత్రాసన్ మునిపుంగవాః"

అని స్కాందపురాణమున సువర్ణ ముఖరీ మాహాత్మ్యమున నున్నట్లు తలంచి, తిరుమలలో కైంకర్య పరులైనవారు మాత్రమే నిత్య వాసము జేయునట్లును, తిరుమల అడివారమున నివసించు గుణానుభవ పరులును, సంసారులును ఉత్సవ కాలములలో తిరుమల నధిరోహించి, స్వామివారిని సేవించి, దిగివచ్చునట్లును –

"కందమూల ఫలాద్యాశ్చ నోపభోజ్యా స్వతస్త్రితః
తత్రోపన్నా స్తు రాజేన్ద్ర ! యత స్త్వప్రాకృతో గిరిః"

అని స్కాంద పురాణములో-సువర్ణ ముఖరీ మహాత్మ్యమున, తిరుమల అప్రాకృత స్థాన మగుటచే, అందుత్పన్నములై, దేవాలయమునకు భోగ్యములుగ వైష్ణవాగమ సిద్ధములైన కందమూలాదులగు సకల పదార్థములను -

"కందమూలాని వస్తూని భోజ్యాని చ హవీంషి చ
నివేద్య పురతో విష్ణోః తత్ప్రసాదోపజీవనః"

అని ఆ ప్రకరణముననే పునరుక్తమై యున్నందున స్థలాంతరము నుండి వచ్చినట్టివై, దేవాలయములకు భోగ్యములుగ జెప్పబడిన పదార్థములను గూడ, స్థలవాసులు తమ తమ గృహములలో పాకముం జేయక, సన్నిధిలోనే పాకమును జేయించి, శ్రీ వేంకటాచలపతి ఆరగించిన పిదప, ఆ మహాప్రసాదమునుం గొనిపోయి, గృహారాధనము లలోగూడ నివేదనము జేసి, కాలోచితములగు హవ్య[85] కవ్యాదుల[86]నుంగూడ నడపించుకొని దేహధారణము చేయునట్లును -

---

85 హవ్యము = దేవతల కివ్వదగిన యన్నము

86 కవ్యము = పితృదేవతల కివ్వదగిన యన్నము

"దేవార్పితై ర్గంధమాల్యైః హవిషా చ మహర్షయః
ఆచరన్త్యర్చనాం విష్ణో రూమ స్తత్ర మహీధరే"

అని బ్రహ్మోత్తరఖండ ఏడవ అధ్యాయములో నున్నందున, స్థల వాసులు, తమ గృహారాధనములకుగూడ దివ్యోద్యానములలోని పత్ర పుష్పాదులను సంగ్రహింపక, శ్రీ వేంకటాచలపతికి సమర్పించి యనుగ్రహించిన పత్ర పుష్పాదులనే, తిరువారాధనమునకు నుపయోగించుకొని, ఆ శేషమును స్వీకరించియే తాము ఉజ్జీవించునటులను, ఇది ఉపలక్షణమై, భగవంతుని దివ్యాధరబింబమునకు భోగ్యముగ సమర్పింపబడు పయః పరమాన్న సూపాపూపాదులను గూడ,[87] క్షేత్రవాసులు తమ తమ గృహములలో పాకము చేయకుండునటులను, సన్నిధికి అనుచితములగు శాక పాక ఫలమూలములను క్షేత్రవాసులు తమ తమ యిండ్లలో నుపయోగించుకొనునట్లును -

"కిలావ న్నగత ప్రాణాః ప్రాణినః సర్వ ఏవ హి."

అనునట్లు, సకల మనుజులకును - ఎల్లపుడును దేహధారణము జేయుట అన్నమూల మైనందున అన్న భాగమును మాత్రము వారి వారి గృహములలోఁ జేసికొని భుజించునట్లును, తిరుమలలో నివసించు చేతనులకు ప్రసవముగాని, మరణముగాని ప్రాప్తమగుటకు ముందే, స్థలాంతరమునకు దీసికొని వెళ్ళునట్లును, ఒకవేళ అచింతితముగ మరణములు సంభవించినను అడివారమునకుఁ దీసికొనిపోయి, చరమ శరీర శోధనము[88] జరుపునట్లును -

"మృగ పక్షి శుకాదీనాం రూపం కృత్వా పరాత్పరః
క్రీడతే రమయా సార్ధం సూరిభి స్తత్ర వర్తతే"

87 పాలు పరమాన్నము, పప్పు, అప్పడములు మొదలగునవి భోగ్య పదార్థములు

88. దహన సంస్కారము.

అని వామన పురాణమున నున్నట్లు, తిరుమలలో నుత్పన్నము లగు మృగ పక్షులుగూడ భగవత్స్వరూపము లగుటచే, వానిని తామస పురుషు లెవ్వరును హింసింపఁగూడ దనియు, ఉత్సవ కాలములలో దిగ్బలి యోగ్యము లగు దివ్య నగర వీథులలో - పాదుకా వాహనా ద్యారోహణము[89] కూడ దనియు -

"వేంకటాచల యాత్రాయాం పాద మేకం మునీశ్వరాః
బ్రహ్మహత్యాది పాపఘ్నం సంసారార్ణవ తారకమ్ "

అని వామన పురాణాదులలో అనేక స్థలములందు కీర్తింపఁబడి యుండుటచే, బ్రహ్మహత్యాది పాప నివృత్తికిని, భగవత్ప్రాప్తికిని సాధనముగఁ జెప్పఁబడిన శ్రీ వేంకటాచల యాత్రలో దేహయాత్ర శేవము గు వాహనా ద్యారోహణము అనుచిత మగుటచేతను, విశేషించి తిరుమల నెక్కునపుడు పాదుకా - వాహనములు కూడ వనియు -

"చణ్డాల యవనా ద్యైశ్చ పతితైః పాపిభి ర్నరైః
నారోఢుం శక్యతే దివ్యో హ్యప్రాకృత శిరోచ్చయ "

అనియు—

"చణ్డాల యవనా ద్యైస్తు పాపిభిశ్చ నాస్తికైః
నారోఢు మపి య శ్శక్యః పావనః పర్వతోత్తమః "

అనియును వామన పురాణాదులలో నున్నందున, చండాలాదులు తిరుమల నెక్కఁగూడ దని యు కట్టుదిట్టములు నేర్పఱచిరి.

ఇట్టి విశేషాచారములు తిరుమలలో నెంత స్థల పర్యంతమనఁగా -

"ఇతి పృష్టః శిర, ప్రాహ స్వామి న్నిత్యచ్యుతం వచః
స్వామిం స్తయా సదా యత్ర స్థియతే వేంకటేశ్వర !
తత్రైన దేవ! స్థాతవ్యం మయా వృషగిరీశ్వర :
ఇతి పృష్టః పునః ప్రాహ నీలమేఘ సమద్యుతిః

89. చెప్పులు వేసికొని వాహనము నెక్కుట.

ఆకల్పం చ వసామీహ వేంకటాచల భూధరే
త్వమ ప్యత్ర మృడానీశ! మహాదేవ వస ప్రభో!
సపత్నీకాయా మస్యాద్రే, శోచిష్కేశ దిగీశ్వర!"

అని వరాహ పురాణములో సప్తమాధ్యాయమున నున్నట్లు, తిరుమలలో శ్రీ వేంకటాచలపతి తనను సేవింపవచ్చిన బ్రహ్మాది దేవతలను బంపు ప్రకరణమున, రుద్రుఁడు స్వామివారిఁ జూచి, 'దేవరవారి సన్నిధిలో దాసుఁడు అనుమతిని పొంది నివసించెదను' అని విజ్ఞాపనముఁ జేయఁగా - అందులకు శ్రీ వేంకటాచలపతి - 'తిరుమల అడివారమున నిచ్చటికి యోజన దూరము విప్రకృష్ట మగు ఆగ్నేయ దిక్కున నివాసము జేయుదువుగాక!' అని ఆనతిచ్చిరి. సన్నిధిలో నుండవలయునని తలంచినవానికి 'అడివారమునకు నొక యోజన పరిమిత మగు దిక్కులో నుండుము' - అని స్వామివారు నియమించినందున, ఆ యాగ్నేయ దిక్కున నుండు శివస్థాన పర్యంతము స్వామిసన్నిధి' అని తోచుచున్నందునను -

"వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన"

అనియు -

"శ్రీమాన్ వృషగిరి శ్చాయం పావనానాం చ పావనః"

అనియును శ్రీ వేంకటాచలము సర్వోత్కృష్టమై, పరమ పావనమైనది అని యున్నను -

"తీర్థస్య పరిత స్తీరే పుణ్యే యోజనమాత్రకే
తపః పరమ మాస్థాయ న్యవసన్ మునిస త్తమాః
నిరంతరం హర్షయుక్తాః త త్ప్రసాదాభిలాషితాః"

అని కొందఱు మహర్షులు స్వామి పుష్కరిణిని చుట్టి, ఒక యోజన విస్తార మగు ప్రదేశము విశేషించి పరమ పావనముగ నిశ్చయించి, భగవ త్సన్నిధివలె అధ్యవసాయము జేసి, తపస్సు నొనరించుచు, నిత్య వాసముగ నుండిరి - అని సువర్ణముఖరీ మహాత్మ్యమున నుండుట

చేతను, శ్రీ స్వామిపుష్కరిణికి చుట్టును ఒక యోజన దూరము మాత్రము ఈ ఆచార మర్యాద అనుష్ఠేయము - అని పెద్దలు నిర్ణయించిరి ఇట్లు పరమ పావన మైన స్థలమును శ్రీ వేంకటాచల పతి దివ్య సన్నిధిగనే ప్రపత్తి జేసి యుండవలయును.

ఇట్లు తిరుమలలో స్థల వాసులు అనుష్ఠింపవలసిన ఆచారములను స్వాంతరంగమున నిశ్చయించి, శ్రీ వేంకటాచలపతిగూడ తన దివ్య సన్నిధిలో నిటుల నడిపించునట్లు సంకల్పించి, అనుగ్రహింపవలయును - అని నిర్ధారణము జేసికొని, శ్రీ నంబిగారితో మనవి చేయఁగా, నంబిగారును దీనిని విని, అత్యంత ప్రీత మనస్కులై, ఇట్టి ఎంబెరుమానుల సంకల్పమును తిరువేంగడ ముడైయాన్లు సఫలము జేయఁగలరు' అని యోచించుచు, కనులు మూసిరి. ఆ రోజు రాత్రి వారి స్వప్నమున తిరువేంగడ ముడైయాన్లు సాక్షాత్కరించి, 'రండి నంబిగారూ! మేము మునుపు ఎంబెరుమానార్ల నియమన ప్రకారము శంఖ చక్రముల ధరింప నిష్టపడినట్లు, ఇప్పుడుగూడ వారి నియమనము మాకు మిక్కిలి యిష్టముగా నుండును' - అని ఆనతీయ, నంబిగారును విని, ప్రబుద్ధులై, స్వప్న వృత్తాంతమును లోకమున పండితులు, పామరులు - ఎల్లరును ఎఱుంగునట్లు ఆనతీయవలయును - అని సన్నిధిలో విజ్ఞాపనము చేసిరి.

అప్పుడు శ్రీ వేంకటాచలపతి, ఒక భక్తునిపై ఆవేశించి, 'మేము రామావతారమున వసిష్ఠాదుల నాదరించినట్లు, మాయొక్క సర్వస్వామిత్వపరత్వమును శ్రీభాష్య నిర్మాణాది ముఖమున వ్యవస్థాపించిన మా భాష్యకారుల[90] నియమనముగూడ ఆదరించెదము. మనకు సంబంధించినవారెల్లరును ఈ ఎంబెరుమానార్ల నియమన

90 శ్రీమద్రామానుజులు.

మును ఆదరింపఁగలరు' - అని ఆనతిచ్చిరి. పిదప, అందఱును ఈ భగవదనుగ్రహమును విని, సంతుష్టులై యుండిరి.

అప్పుడు శ్రీ వేంకటాచలపతి యంతరంగమునకు అంతరంగులైన శెంగనిరాయన్ - అను నొక అర్చకస్వామి, శ్రీ శఠకోపము నెత్తి, అందఱి శిరస్సులపై నుంచి, 'మహర్షు లగు భాగవతు లనేకులు ఈ స్థలమున అనుష్ఠించినవై, శ్రీ వేంకటాచలపతికి మిక్కిలి ప్రీతిపాత్రమైన ఈ ఆచార మర్యాదలను ఈ తిరుమలలో ననుష్ఠించినవారలు, ఎంబెరుమానార్లకు అంతరంగు లగుదురు; అనుష్ఠింపనివారు స్వామివారి దివ్యాజ్ఞా రూపమగు వేదమునకు బాహ్యు లగుదురు' - అని దివ్యాజ్ఞను ప్రకటింపఁగా, ఎల్లఱును ఏక ముఖముగ సంగీకరించిరి.

ఈ ప్రకారము, భగవదాజ్ఞాసిద్ధములైన సదాచార విశేషముల నెల్లఱును అనుష్ఠించుచుండు కాలమున, తిరుమల నంబిగారి శిష్యుఁడైన ఒక వైష్ణవస్వామి మాత్రము ఒకనాఁడు ప్రకృతి వశ్యుఁడై, శ్రీ వేంకటాచలపతికి సమర్పించిన పుష్ప మాలికను ధరించుకొనెను. ఆఁటి రాత్రి నంబిగారి స్వప్నమున శ్రీ వేంకటాచలపతి ప్రత్యక్షమై, 'ఏమండీ! నంబిగారూ! మీ శిష్యుఁడు ప్రకృతి వశ్యుఁడై, మాకు పరిమళ ద్రోహమునుఁ జేసెను' - అని విజ్ఞాపింప, నంబిగారును దానిని విని, చటాలున మేల్కొని, పెరుమాళ్ళ సన్నిధికిఁ జని, స్వామీ! తిరుమాలల నెవ్వరికిని ప్రసాదింపవలదు. కలిదోషముచే, అనుకూలురకునుగూడ పాపబుద్ధి కలుగుచున్నది కనుక, నీ స్థలమున అమర్యాదలు సంభవించుచున్నవి. కాఁబట్టి, దాసుని విజ్ఞాపనమును సత్యమగునట్లు సంకల్పించి, అనుగ్రహింపవలయును' - అని మనవిఁ జేయ, స్వామియును ఈ వార్త నాలకించి, అప్రకముఖముగ 'మేము అర్చావతార పరిగ్రహము

చేసినది ఆశ్రితుల అభీష్టముల దీర్చుటకేగదా ! కాన, తమ తృప్తికై, ఈ నాఁడు మొదలుకొని, మేము ధరించిన పుష్పమాలిక మొదలగు వానిని ఎవరికిని ప్రసాదింపను' - అని ఆనతిచ్చిరి

## 'సేనాపతి జీయర్' అను ఏకాంగిని హనుమన్ముద్రికాదులతో శ్రీవారి కైంకర్యమును పరిపాలించుటకు ఏర్పఱచుట

ఈ వృత్తాంతముల నన్నిటిని ఎంబెరుమానార్లు విని, సంతుష్టాంతరంగులై, ఇట్లు క్షేత్ర మాహాత్మ్యసిద్ధముగను, భగవదనుగ్రహ మూలముగను నడచునట్లు కట్టుబడి నొనరించి, ఈ ధర్మములను భవిష్యత్కాలములయందును పరిపాలనము జేయుచు వచ్చుటకై,

"వర్ణినో నైష్ఠికే బుద్ధిః వైరాగ్యే యది దృశ్యతే
సంకల్ప్య బుద్ధిం తాం ధీరః కాషాయం ధారయే త్పటమ్ "

అను ఈశ్వర సంహితా వచనానుసారము, బ్రహ్మచారియై, ఆశ్రమాంతరములయందు విరక్తుఁడై, ఊర్ధ్వ రేతస్కుఁడై, ముద్రా పురస్సరముగ కాషాయ వస్త్రమును ధరించినవాఁడు నైష్ఠిక బ్రహ్మచారియౌనందున, అట్టి అధికారిని సంపాదించి, ఆతనిని శ్రీ స్వామివారి శ్రీ శఠగోపము, తిరుప్పరియట్టము మొదలగు బహుమానముల నెల్ల ప్రసాదించి, తిరువేంగడ ముడైయాన్ల కైంకర్యమున నియమించి, శ్రీ వేంకటాచలపతి దివ్య సంపదభివృద్ధులకు ఏ యొక్క న్యూనతయును[91] రాకుండునట్లు పరామర్శించుకొనుచు, ఉత్తరోత్తరము అభివృద్ధమగునట్లు, స్వామి సన్నిధిలో జరుగవలసిన ఆచారోపచారములకు లోప మెయ్యదియును రాకుండునట్లును, కైంకర్యపరులకును అపచార మేదియు రాకుండునట్లు హితోక్తుఁ బలికి, వారలద్వారా స్వామి కైంకర్యము నిత్యముగ నిర్విఘ్నముగ నడపించునట్లును, శ్రీ స్వామి వారి దివ్య మంగళ విగ్రహమునకును, దివ్యాధరబింబమునకును తగి

91. కొఱతయును

నటుల, సమస్తమైన ఔపచారిక[92] సాంస్పర్శిక[93] అభ్యవహారికము[94] లగు ఉపచారములను నతపి చుకొనుచు వచ్చుటకును, దేశాధిపతికిని శ్రీమద్రామానుజులవారి చరణారవిందములలో భక్తి కుదురునట్లు హితోపదేశము చేయుటకును, అతని మూలముగ తిరువేంగడ ముడైయాన్లు సమస్తమైన కైంకర్యములను, ఆరువారాధనమును స్వీకరించునట్లును, ఈ ప్రకారము ఇట్టి అనేకములగు భగవద్ధర్మముల నేర్పఱచుటకును, శ్రీ రామావతారమున ఏ యొక కొఱతయు రానీయక నిత్య కైంకర్య ధురంధరుడైన శ్రీ హనుమంతుని ముద్రగా నొక ముద్రాంగులీయకమును చేయించి, శ్రీ వేంకటాచలపతి నియమనమును పొంది, ఆ ఏకాంగి శ్రీవైష్ణవస్వామి నిత్యము దానిని ధరించియుండునట్లును, శ్రీ హనుమన్ముద్రాంకిత మగు నొక ఘంటను, హనుమన్ముద్రాంకిత మగు నొక కట్టారిలో గట్టి, కైంకర్య యాత్రాకాలములో ఘంటానాదము తోడనే హనుమన్ముద్రాంకిత మగు నొక ధ్వజమును పట్టుకొని, సేనై ముదలియార్ల (విష్వక్సేనులవలె) పరిపాలన ముద్రా నిర్వాహకుం డగుటకును, సన్నిధిలోని సర్వవిధము లగు పరికరములు గూడ ఆ ఏకాంగి శ్రీ వైష్ణవులకును విధేయతగా నుండి, శ్రీ స్వామి వారి కైంకర్యములకు ఏ యొక కొఱతయు రానీయక నడిపించునట్లును, ఆ హనుమన్ముద్రాంగులీయకముతో శ్రీ స్వామివారి భండారమునకు ప్రతి నిత్యము రాత్రి కాలములో అన్ని వాకిళ్ళకును ముద్ర వేయునట్లును, ఇవి మొదలుగాంగల అనేక భగవద్ధర్మములను నుద్ధరించుటకును, ఏకాంగి యగు అట్టి శ్రీ వైష్ణవస్వామికి 'సేనాపతి జీయర్' అను తిరునామము నుంచి, అరుళిప్పాడు (హెచ్చరికను) ప్రసాదించి, కైంకర్య నిర్వాహకు లగుదురుగాక - అని నియమించిరి.

92 ఉపచారక హేతువైన

93 స్పృశింపఁదగిన

94 భోజన యోగ్యమైన

## తిరుపతి పట్టణమున శ్రీ గోవిందరాజస్వామి సన్నిధిలో శ్రీ ఆండాళమ్మవారిని ప్రతిష్ఠించుట

పిదప, తిరుపతిలో శ్రీ గోవిందరాజ పెరుమాళ్ళ కైంకర్యములకును ఏ కొఱతయు రానీయకుండునటుల, తమకు శిష్యులైన గడియము యాదవరాయలకు అప్పగించి, శ్రీ గోవిందరాజుస్వామివారు శ్రీ చిత్రకూట దివ్యక్షేత్ర మహాత్మ్య సిద్ధమైన ఆని మాసపు తిరునాళ్ళను ప్రతి సంవత్సరము పరిపాలించునట్లును కట్టడి నొసగించి, శ్రీ గోవిందరాజుస్వామి దివ్య సంపదలు ఉత్తరోత్తరము అభివృద్ధమగునటుల —

"శ్రీశైలోపత్యకాయాం యతికులపతినా స్థాపితాం శ్రీనగర్యాం
గోదా గోవిన్దధామ్ని ద్యుతిమతి భగవ ద్దక్షిణే వ్యూహలక్ష్మ్యాః
ఇత్యావ్యాహ్యర్చ్యమానాం అవరకరధృతో త్ఫుల్లకల్హారహస్తాం
సేవే శ్రీ భట్టనాథాహ్వయముని తనయాం దేవ సమ్ప త్సమృద్ధ్యై"

అను అభియోక్తుల ప్రకారము శూడికొడుత్తనాచ్చియార్లగు (ఆముక్తమాల్యద యగు శ్రీ గోదాదేవిని) శ్రీ ఆండాళమ్మవారిని, వామహస్తమున కల్హార పుష్పమును ధరించునట్లు అవతరింపజేసి, ఆ దేవిని, ద్విభుజయై యుండునటుల, శ్రీ గోవిందరాజస్వామి దక్షిణ పార్శ్వమున ప్రతిష్ఠ చేయించి, యంత్రోద్ధారాదులనుగూడ జేయించి తిరువారాధనము పరిపాలించునటుల కట్టడి చేసియు, శ్రీ గోవిందరాజస్వామివారి నైమిత్తికోత్సవ కాలము లగు తెప్పోత్సవము, వనభోజనోత్సవము, పార్వేట ఉత్సవము, డోలోత్సవము మొదలైన ఉత్సవములను స్వీకరించుచున్నపుడు, పెరియాళ్వార్ల కుమార్తె యగు శ్రీ ఆండాళమ్మవారుగూడ వేంచేసి, ఉపచారముల స్వీకరించునట్లునుగూడ కట్టడి జేసిరి.

మఱియు, శ్రీ ఆండాళమ్మగారు - "వేఙ్గడవఱ్కెన్నై విదిక్కిత్తిరియే" అని భగవదనుభవము జేయుచున్నప్పుడు ప్రథమమున శ్రీ వేంకటాచలపతి ననుభవించుటకు ఆపేక్షించుచుండున, ఆమె తిరునక్షత్ర మగు తిరువాడిప్పూరమున తిరుమల ద్వారమునకు వేంచేసి, స్వయంవ్యక్తమైన శ్రీమత్పాదారవిందముల సన్నిధానమున వేంచేపుచేయునటుల కట్టడి జేసియు, ధనుర్మాసమున 'మార్గళి నీరాట్టము' అను నొక ఉత్సవమును సాప్తాహికముగ జరిపించుచు, గురుదినము తిరుత్తేరు ఉత్సవమును కటాక్షించుచున్నట్లును, 'కనుము' అనురోజు మనుష్యుల ఉత్సవమునకు నిషిద్ధమైనను, స్త్రీల కామ్యవ్రతానుష్ఠానములకు కొన్నింటికి ప్రశస్తమని చెప్పబడి యున్నందున, ఆ కనుము పండుగ రోజుననే, పెరియాళ్వారుల తిరుక్కుమార్తెయగు శ్రీ ఆండాళమ్మవారికిని, శ్రీ కృష్ణస్వామికిని తిరుమాల సమర్పించి, జగత్తును ఉజ్జీవింపజేయుటకును కట్టుదిట్టముల నొనరించిరి

## శ్రీ వేంకటాచలపతికిని, శ్రీ గోవిన్దరాజస్వామివారికిని ఐక్యమును పరిపాలించుట

శ్రీ వేంకటాచలపతియును, శ్రీ గోవిన్దరాజస్వామియును భిన్నాధికరణస్థులైనను,[95] శ్రీ వైఖానసాగమమున ఏకసంహితా సిద్ధములైన నిత్యారాధనోత్సవాదులను కటాక్షించుచున్నందున, ఒక సన్నిధిలో వేంచేసియుండు పంచబేరములవలె, ఐక్యము దోచునట్లు పరిపాలన మొనరించిరి.

## శ్రీ రామానుజ కూటమును నిర్మించుట

శ్రీ గోవిందరాజస్వామికి, శ్రీ వేంకటాచలపతికిని మంగళాశాసనపరులై యుండు పెద్దలగు పరమభాగవతులకై, గోవిందరాజ

95. వేఱు వేఱు స్థలములయం దున్నవారలైనను.

స్వామి సన్నిధికి ఉత్తరముగ నొక మాడ వీథిని గల్పించి, దానికి పార్శ్వములలో గృహారామాదులను నిర్మించి, దానికి – 'శ్రీ రామానుజ పురము' అను పేరు బెట్టి, అందు వారలను నిత్య వాసము జేయునటుల నియమించిరి.

## తిరుమల అడివారమున ఆళ్వారులను ప్రతిష్ఠించుట

ఇట్లు శ్రీమద్రామానుజులవారు తిరుమల తిరుపతి దివ్య క్షేత్రమున అనేక భగవద్ధర్మములను, శ్రీవైష్ణవ ధర్మములను, ప్రవర్తింపజేసి, పిదప శ్రీరంగమునకు వేంచేయునట్లు ప్రయాణము జేసి, ఆ పురమునకు విచ్చేసిరి.

"శేషో వా సైన్యనాథో వా శ్రీపతి ర్వేతి సాత్త్వికై:
ఇతి సర్వై ర్వితర్క్యాయ యతిరాజాయ మంగళమ్."

అనియు –

"పాషండ ద్రుమషండ దావ దహనః చార్వాక శైలాశనిః
బౌద్ధ ధ్వాన్త నిరాస వాసర పతిః జైనేభ కణ్ఠీరవః
మాయావాది భుజఙ్గ భంగ గరుడః త్రైవిద్య చూడామణిః
శ్రీరంగేశ జయధ్వజో విజయతే రామానుజోఽయం మునిః"

అనియు కీర్తింపబడినటుల, సన్న్యాసిత్వ్రిద్విజ వనార్థమై, శ్రీనాథ – శేష – శేషాశనాదుల అవతారమో ? అని వికల్పింపదగిన దివ్యావతార వైభవముగ గలవారలై, వైదిక సార్వభౌము లగు శ్రీమద్రామానుజాచార్యులవారు తామే –

"శుకాద్యా మునయః కేచిత్ భృగ్వాద్యా శ్చ తపోధనాః
ప్రహ్లాద ప్రముఖాః పుణ్యాః అంబరీషాదయో నృపాః
విష్ణో రేవా పరం దేహం మన్యానా స్తం నగోత్తమమ్
పద్భ్యా మాక్రమితుం భీతాః పర్యంతే ష్వేవ వర్తినః

తన్నిర్గతే జలే ష్వేవ కార్యాణాం స్నాన తర్పణే
తపః కుర్వంతి వాంఛన్తః సాక్షాత్కర్తుం జనార్దనమ్ "

అనునట్లు, పరాపర తత్త్వ విదగ్రేసరు లగు శుకాది పరమ యోగులును, ప్రహ్లాద ప్రముఖు లగు పరమ భాగవతులును తిరుమలకును, అందు సర్వసులభుఁడై వేంచేసి యున్న శ్రీ వేంకటాచలపతికిని తారతమ్యబుద్ధి లేనివారలై, సమాన ప్రతిపత్తిఁ జేసి, తమ ప్రాకృత శరీరముతోఁడ తిరుమలపై అడుగిడకుండునట్లు, భగవదనుగ్రహ ప్రాప్త విశుద్ధ విజ్ఞాన పరిపాకు లగు ఆళ్వారులును "శెన్నువణంగుమినో శేణుయర్ వేంగడత్తై" అనియు - "శెఙ్గయల్ తిళైక్కుమ్ శునై తిరువేంగడ మడై నెఞ్జమే" అనియు — "తిరువేంగడ మామలై ఒన్ఱుమే తొళనమ్ వినై నోయ్ తీర్ప్పదువుమ్" "తిరువేంగడమ్ కణ్డక్క శమఙ్గళ్ పీడు తరుమ్ తడమ్ కున్ఱమే" "ఉయ్యక్కొళ్వాన్ నిన్ఱ వేంగడమ్ నీళ్ శిలత్తుళ్ళన" "కణ్ణరువి వేఙ్గడమే వానోర్ క్కుమ్, మణ్ణోర్ క్కుమ్ వైప్పు" "వేంగడమే మెయ్ వినై నోయ్ తీర్ప్పదువుమ్" "వేంగడత్తుచ్చి" అనియును ఇత్యాది స్థలములయందు తిరువేంగడమునకు, తిరువేంగడ ముడైయాన్లతో భేదమును పాటింపక, తమకు పరమ ప్రాప్య మియ్యదియే - అని అధ్యవసాయము గలవారలై, 'తిరుమలనుఁ ద్రొక్కము' అని తీర్మానించుకొని, అడివారమున నుండియే మంగళాశాసనము జేసిన క్రమము ననే యనుసరించి తిరుమలలో ఆళ్వారుల ప్రతిష్ఠ జేయక, తిరుమల అడివారమున తిరుమలతో ఏక శరీరు లగునటుల ప్రతిష్ఠను జేయించిరి.

### శ్రీ గోవిందరాజస్వామి వారిని గూడ అడివారమున ప్రతిష్ఠించుట

ఇట్టి సమయమునకు సరిగా, చిత్రకూట క్షేత్రమునుండి వేంచేసిన శ్రీ గోవిందరాజ పెరుమాళ్ళను తిరుమల అడివారమున

శ్రీవేంకటాచలపతితో గూడ విశేషముగ శ్రీవైఖానస సాగమ ప్రకారము దివ్యముగ ప్రతిష్ఠను జేయించి, అధ్యయనోత్సవము మొదలగు కొన్ని ఉత్సవములు పరాస్పరావిరోధముగ[96] పరిపాలించునటులను కట్టుదిట్టముల నేర్పఱచిరి.

## శ్రీ వేంకటాచలపతికిని, శ్రీ గోవిందరాజస్వామికిని ఐక్యమును బోధించు మాహాత్మ్య ప్రకారములు

కాశీరాజు సంతానార్థము భార్యా సహితుండై వచ్చి, శ్రీ వేంకటాచలపతిని భక్తిమీఱ సేవించి పిలువగ, శ్రీ వేంకటరమణుండును 'దేహి మే దదామి తే' (ఇచ్చుకుంటేనే వాయనమ్, పుచ్చుకుంటేనే వాయనమ్) అను రీతిగ పురాణ సిద్ధమైన లీలా విశేషమును ఎల్లఱు నెఱింగి ఆశ్రయించి, ఉద్దీపింపవలెనని సంకల్పించి, రాజ మహిషికి సాక్షాత్కరించి, 'మేము నీకు సంతానము ననుగ్రహించెదము; నీవు మాకు కావలసినంత భూమిని సమర్పింపుము' అని ఆమెను అడిగిరి. ఆమెయును భర్తృ పరతంత్రత గలుగుచు, 'భర్త అనుమతి కావలయును' అనిన, శ్రీ వేంకటేశ్వరుండును - 'అట్లైన మాకును మా యన్నగారగు శ్రీ గోవిందరాజస్వామివారి అనుమతి కావలయును' అని ఆనతిచ్చిరట !

ఈ స్వప్న వృత్తాంతము ఆ దివ్యదేశమున ప్రసిద్ధమైనందున ఒక సన్నిధిలో నున్న పంచ బేరములకు నుండు ఐక్యమువలె, వీరలకును అర్చావతారైక్యము దోచుచుండుటను కటాక్షించి, శ్రీమద్రామానుజులవారు శ్రీ వేంకటాచలపతి ప్రతిసంధ్యా కాలమునను తిరువారాధనము స్వీకరించుచున్నపుడు వేద పారాయణమును విని యనుగ్రహించు సమయమున, శ్రీ వేంకటాచల మాహాత్మ్యముతో గూడ శ్రీ చిత్రకూట మహాత్మ్యముతో పాటు, శ్రీ వేంకటాచల మాహాత్మ్య

96. ఒక దానితో మఱియొక దానికి విరోధము లేనట్లు

ముతో కూడ శ్రీచిత్రకూట మాహాత్మ్యముతో పాటు, శ్రీ వేంకటాచల మాహాత్మ్యమును విని యనుగ్రహించుచున్నపుడు — "ఊన్ వాడ కణ్ణాదు" "వాఴి మఱన్దై పోగి" అను రెండు తిరుమొళులను విని యనుగ్రహించుటలను, అటులనే, శ్రీ గోవిందరాజస్వామియును 'ఒళివిల్ కాలమ్" "ఉలగముణ్ణ పెరువాయా" మొదలైన దివ్య ప్రబంధములను అనుగ్రహించుటలను, మఱియు — తిరుమల తిరుపతి దివ్య క్షేత్రములు రెండును చేరి ఒకే దివ్య క్షేత్ర మని సిద్ధించుటకై, శ్రీవైష్ణవుల తిరుమాళిగలలో ఉత్సవ కాలమునందు,'తిరువేంగడ ముడైయాన్, శ్రీ గోవిందరాజన్, అలర్ మేల్ మంగై నాయ్చ్చియార్, ఆళ్వార్ తిరుమగళార్ సంభావనై' (శ్రీ వేంకటాచలపతి శ్రీ గోవిందరాజ, అలిమేలుమంగ, అండాళమ్మలకు సంభావన) అని రెండు స్థలములయందును ఏక రీతిగ సంభావనలు సమర్పించునట్లు నియమనమును గల్పించిరి — అని, శ్రీ వేంకటాచల నిత్య నివాస రసికులగు పెద్దలు ఆనతిత్తురు

## శ్రీ వేంకటాచలపతి

## దివ్య ప్రబంధముల నాలకించు ప్రకారము

మార్గళి మాసమున ముప్పది రోజులును, బ్రహ్మ ముహూర్తమున తలుపులు దెఱచు సమయమున, తిరుప్పావు, తిరుప్పళ్ళి యెళుచ్చి — ప్రబంధముల అనుసంధానము. అందు మొదటి దినమున మాత్రము తిరువారాధనము జరిగి, ఆరగింపు ముగిసిన వెనుక, తిరుప్పావు, తిరుప్పళ్ళి యెళుచ్చుల అనుసంధాన ప్రారంభము మరునాటి దినము నుండి తిరువారాధన కాలమున — తిరుప్పావు, తిరుప్పళ్ళి యెళుచ్చుల అనుసంధానము; మధ్యాహ్న కాలమునందు — ఉపదేశరత్నమాల, సాయంకాలమున — తిరువాయిమొళి నూత్తం

దాది అనుసంధానము తిరుక్కార్తిగ మొదలుకొని, అధ్యయనోత్సవము వఱకును ఉపదేశరత్నమాల, తిరువాయ్ మొళి నూత్తందాదుల అనుసంధానము

మిగిలిన మాసము లయందు, ప్రాతః కాలమున తోమాల సేవ జరుగునపుడు — తిరుప్పావై, తిరుప్పళ్ళి యెళుచ్చుల అనుసంధానము, మధ్యాహ్న కాలమున తోమాల సేవ జరుగునపుడు - శిఱియ తిరుమడల్ అనుసంధానము, సాయంకాలమున నిత్యానుసంధానము అనుసంధేయము

దాని ప్రకార భేదము :-

ప్రథమమున - తిరుపల్లాండు, తరువాత — పూచ్చూడల్, కాప్పిడల్, శెన్నియోంగు, తిణ్ణీల మేలాప్పు, ఊనేరు శెల్వత్తు అంగనెడుమదిల్, తాయె తందై, ఊన్వాడ ఉణ్ణాను, వాడమరుదిడై, ఒళివిల్ కాలమ్, శెలగ కండ పెరువాయా, కంగులుమ్ పగలుమ్, ఆళి ఎళ, అమలనాది పిరాన్, కణ్ణినుణ్ శిఱుత్తాంబు — అనునవి అనుసంధేయములు.

నాయ్చ్చియార్ తిరుమొళి, పెరుమాళ్ తిరుమొళులు — అను తిరుమొళులు అనుసంధించునపుడు, ఆయా ప్రబంధముల తనియన్లను అనుసంధింప నవసరము లేదు. ఏకదేశమున ఆ తిరుమొళులు అనుసంధించుటచేత అమలనాది పిరాన్, కణ్ణినుణ్ శిఱుత్తాంబు — అను ప్రబంధముల రెండింటిని పూర్ణముగ అనుసంధించుటచేత, తనియన్లు కూడ అనుసంధింపవలయును ఇట్లు పూర్వాచార్యుల నియమనము.

నిత్యానుసంధానముతో గూడ 'కంగులుమ్ పగలుమ్' ప్రబంధమును, మధ్యాహ్నమున తోమాల సేవ జరుగునప్పుడు 'శిఱియ తిరుమడల్' అను ప్రబంధముల ననుసంధించుటకు కారణ మేమనగా -

పూర్వకాలమున, పరమ భాగవతులు గుంపు గూడి, భగవ దను భవపరులై యుజ్జీవించు పరమ భోగ్యమైన శ్రీరంగ దివ్య క్షేత్రమున నిత్య వాసము జేయుచు, పెరుమాళ్ళ (శ్రీరంగనాథుల) తిరుమేనియందు (దివ్య మంగళ విగ్రహమునందు) అత్యంత వ్యామోహము గలిగియుండు ఒకానొక స్వామి శ్రీస్వామి పుష్కరిణిలో స్నానమాచరించి, శ్రీ వరాహస్వామిని సేవించి, సేవాక్రమముగా లోపల ప్రవేశించి, శ్రీ భాష్యకారుల చరణారవిందముల కెఱగి, వెన్నుమూలైయిట్టాన మంట పమునకు విచ్చేసి, శ్రీగరుడాళ్వార్లను, శ్రీద్వారపాలకులను సేవించి, శ్రీమద్రామానుజులవారి యెదుట, వారి పురుషకారముగ తిరువేంగడ ముడైయాన్లకు దండము సమర్పించి, లోన ప్రవేశించి, కులశేఖర పడి వద్దకు జని, తత్సమీపమున నిలచి, 'ఆపాదచూడ మనుభూయ హరిం శయానం' అను వాసనతో శ్రీపాదపద్మములు మొదలుకొని కిరీటము వఱకును బాగుగా అనుభవించి, పూర్వ వాసనచే అవశముగ "కంగులుమ్ పగలుమ్" అను దశకమును దేవగానముతో మేళవించి పాడిరి.

అంత శ్రీ వేంకటాచలపతియును ప్రహృష్టాంతరంగుండై, అర్చక ముఖమున అరయర్ స్వామీ! పూర్వము ఆళ్వార్లు మా విషయమున వ్యాముగ్ధులై, నాయికా దశను పొందినవారై, యమ్మనుభవించిన ప్రకారముగ ఇప్పుడు మీరు అనుకరించి చూపితిరి, అందుచే, మాకు ఈ తిరువాయిమొళి చాలా ఇంపుగ నున్నది, ఇటులనే, మా యందలి యుత్కట ప్రావణ్యముచే, నాయిక దశను పొంది, పరకాలు లానతిచ్చిన దివ్య ప్రబంధములలో నొకదానిని అనుకరించి చూపుడు' - అని కుతూహలాక్రాంతచిత్తుండై పలుకంగా, అప్పుడు ఆళ్వార్లరయరులును అతిమాత్ర ముగ్ధ హృదయులై, అతడు ప్రసాదించు సార్ద్రవచనములయందు అత్యంత ప్రవణులై, "కారార్ వరై క్కొంగై" అని యారంభించి, పరకాలులు మడలూరిగ భగవంతుని

అనుభవించిన ప్రకారమును, పరవశ గాత్రులై, నాయికా దశానుభవమును ఆనతిచ్చిరి.

ఆ క్రమము నెల్ల శ్రీ వేంకటాచలపతి యాలకించి, సంతుష్ట హృదయములై, తమ శ్రీపాద పద్మ స్వరూపులగు శ్రీ శఠకోపులను, తిరుమాల మొదలగు బహుమానముల నెల్ల అనుగ్రహింప, ఆళ్వార్ అరయర్ స్వామివారు స్వీకరించి, కృతార్థులై యుండిరి

అప్పుడు సన్నిధిలో నుండు పెద్దలగు అంజని వెళ్ళర్, ఎంబెరుమానార్, తిరువేంగడ జీయర్ - మొదలగు వారు రండఱును సంతుష్టాంతరంగులై, ఈ మధ్యాహ్న సమయమున తోమాల సేవలో తీయ తిరుమడల్ - దివ్య ప్రబంధమును అనుసంధింపగా, చెవులార విని, తోమాల సేవను కండ్లార సేవించిరి. ఈ భగవదాజ్ఞననుసరించియే తిరు వీథులలో ఉత్సవము జరుగునప్పుడును, ఈ 'తిరుమండల్' దివ్య ప్రబంధమునే సేవింపవలసి యున్నది - అనియు -

మునుపు, శ్రీరంగనాథులు ఇచ్చటికి వలస వచ్చి, కొంత కాలము వేంచేసి యుండి, తిరిగి తమ దివ్య దేశమునకు వేంచేయునప్పుడు తమకు అసాధారణమైన "కంగులుమ్ పగలుమ్" అను తిరువాయ్ మొళిని విని, తిరువేంగడ ముడైయాన్లు మిగుల సంతుష్టులైనందున, నిత్యము సాయం కాలములయందు నిత్యానుసంధానముతో పాటు, ఈ తిరుమొళి గూడ అనుసంధింపబడవలయును అని నియమించిరి.

## అధ్యయనోత్సవ కాలములయందు శ్రీ వేంకటాచలపతి దివ్య ప్రబంధములను అలకించు క్రమము

'కణ్ణి రముడు వళి తిరుత్తమ్' అను తిరుమల నంబిగారి తిరు మండప తీర్థైంకర్యోత్సవముతోఁగూడ అధ్యయనోత్సవము మొత్తము ఇరువది నాలుగు రోజులు అందు చిన్న అధ్యయనోత్సవము, మార్గళి మాసమున శుక్ల పక్షైకాదశికి ముందు పదునొకండు రోజులు'

మొదటి రోజు - రాత్రి, ముదల్ తిరువందాది మొదలుకొని మూండు తిరువందాదులు, నాన్ముగన్ తిరువందాదియును, తిరువిరుత్తము - అను నీ దివ్య ప్రబంధములయందలి మొదటి పాశురములు అనుసంధేయములు

రెండవ రోజు - ఉదయము. 'ఇయల్పా' వెయ్యి పాశురములు అను సంధేయములు. రాత్రి తిరుప్పల్లాండు తొడక్కము.

మూండవ రోజు - ఉదయము, పెరియాళ్వార్ తిరుమొళి రెండు పత్తులు, రాత్రి - శెన్నియోంగు పది పాశురములు.

నాల్గవ దినము - ఉదయము పెరియాళ్వార్ల తిరుమొళిలోని మిగత భాగము ; రాత్రి - 'విణ్ణీల మేలాప్పు' పది పాశురములు

ఐదవ రోజు - ఉదయము తిరుప్పావు, నాయ్చ్చియార్ తిరు మొళి ; రాత్రి - ఊనేరు శెల్వత్తు.

ఆఱవ రోజు - ఉదయము, పెరుమాళ్ తిరుమొళి మొదలు కొని, కణ్ణినుణ్ శిరుత్తాంబు కడపటివఱకును, ముదలాయిర మంతయును. రాత్రి - పెరియ తిరుమొళి తొడక్కము, అది యెట్లనఁగా - 'వాడి నేన్ వాడి' తిరుమొళియును, 'తాయే తందై' అను తిరుమొళియును.

ఏడవ రోజు - ఉదయము, పెరియ తిరుమొళి రెండవ పత్తు ; రాత్రి - 'వాడ మరుదిడై పోగి' అను తిరుమొళి.

ఏనిమిదవ రోజు - ఉదయము, పెరియ తిరుమొళి మూండ పత్తు, నాల్గవ పత్తును, రాత్రి, 'కుండై నాళ్ మత్తై' అను తిరుమొళి.

తొమ్మిదవ రోజు - ఉదయము - ఐదు, ఆరు, ఏడు పత్తుల రాత్రి- 'తెళ్ళియార్ దేవార్ కన్నమ్' అను తిరుమొళియును

పదియవ రోజు - ఉదయము, ఎనిమిది తొమ్మిది పత్తులు, రాత్రి 'కాదిల్ కడిప్పిట్టు' అను తిరుమొళియును.

పదునొకండవ రోజు - ఉదయము, పదియవ పత్తు, పదునొకండవ పత్తును, రాత్రి, తిరుకుఱుం దాండకమ్ - అను ప్రబంధము పెరియ తిరుమొళి, శాత్తుముఱైయును

ఇట్లు పదునొకండు రోజులలోను, రాత్రులయందు అరయర్ కోయిల్ తిరువాయి మొళికి దేవ గానముతో ననుసంధింతురు మఱి దినమున ప్రాతః కాలమున, మిగిలిన ప్రబంధ భాగము అంతయును అనుసంధింపవలసినది

అనంతరము శుక్ల కాదశి మొదలు పెద్ద అధ్యయనోత్సవము పదిరోజులు. అందు ప్రతి దినము ప్రాతః కాలమున, భగవన్నివే నానంతరము నాలుగు వేదములును, ఇతిహాస పురాణములును, అనుసంధేయములు. రాత్రి కాలమున నిత్యము తిరువాయిమొళి దివ్య ప్రబంధమును ఒక్కొక్క పత్తు అనుసంధిపవలయును. పదునొకండవ రాత్రి — కణ్ణినుణ్ శిఱుత్తాంబు దివ్య ప్రబంధము అనుసంధింపవల యును పన్నెండవ రోజు రాత్రి - నూత్తందాది దివ్య ప్రబంధము

అటుపై మఱురోజు శ్రీ వరాహస్వామికి అధ్యయనోత్సవము న పరిపాలింపవలయును అందులకు మఱు దినము తణ్ణీర మదువళి తిర త్తుఱై తిరునాళ.

తిరుమలలో అధ్యయనోత్సవ సమయమున రెండవ రోజు మొదలుకొని, ఇరువది మూడవ రోజువరకును, సాయం కాలమున - మలైనిన్ర పెరుమాళ్ళు తిరువీధులు వేంచేయునపుడు, ఉత్తరపు తిరువీధిలో శిఱియ తిరుమడల్ ప్రబంధమును అనుసంధింపవలయును. అధ్యయనోత్సవమున మొదటి రోజు తిరుమామణి మండపమున ఉచిత కాలములయందంతను అనుసంధింపవలయును.

శ్రీ సేనై మొదలియాళ్వార్ల తిరు నక్షత్ర దినమున, మలైకునియ పెరుమాళ్ళు, శ్రీ సేనై ముదలి యాళ్వార్ల సన్నిధికి వేంచేపు చేయునప్పుడు తిరువిరుత్తమును అనుసంధింపవలయును.

తిరువేంగడ ముడైయాన్కు, పెద్ద అధ్యయనోత్సవము శాత్తుముఱ రోజున, నిత్యమువలె, శ్రీ సేనై ముదలి యాళ్వార్లతోను, ఎంబెరుమానార్లతోడను, తిరుమామణి మండపమున, తిరువాయిమొళిని శ్రవణ పేయముగ నాలకించిన తదుపరి, వేదములను, మొదట ఉత్తర శాంతి పాఠములతో ముగించిన పిదప, పెరుమాళ్ళ తీర్థము, శ్రీ శఠకోపము, ప్రసాదములు వినియోగమైన యనంతరము, ఎంబెరుమానారులు పెరియ పెరుమాళ్ళను (శ్రీ వేంకటేశ మూల బేరమును) మంగళాశాసనము జేయుటకై, తిరుమామణి మండపమునుండి ప్రదక్షిణముగ బయలుదేరి, జీయరులు, శ్రీవైష్ణవులు, అర్చకులు - అందఱును చేరి, స్తోత్ర రాజమును అనుసంధించుచుండ ఉత్సవముగ వేంచేసి, వెన్నుమాలై యిట్టాన్ తిరు మంటపమున పెరియ పెరుమాళ్ళ సమక్షమునకు వచ్చి నిలిచిన వెంటనే, జీయర్లు దలగువారు, ఎంబెరుమానార్లు అనుసంధించునట్లు, తిరుప్పల్లాండు రెండు పాశురములను, "ఒళివిల్ కాలమ్", "ఉలగ మ్మండ పెరువాయా", "తాయే తన్దై" అను పాశురములను, "అఖిల భువన జన్మ" అను శ్లోకమును, శరణాగతి గద్యమున పూర్వ ఖండమును అనుసంధింపగా, ఆ సమయమున,

తిరువేంగడ ముడైయాన్లును, తోమాల, తిరుప్పరివట్టము శ్రీ శఠగోపము, ప్రసాదము, పెరుమాళ్ళు కట్టి విడచిన పీతాంబరము, శ్రీపాద పద్మములు - మొదలగు బహుమానములను సెల్లి అనుగ్రహింప, మరల ఎంబెరుమానారులు అనుసంధించునట్లు 'అగల గిల్లేన్', 'ఒళివిల్ కాలమ్', 'తాయే తందై' అను మూండు పాశురములను, 'అఖిల భువన జన్మ' అను శ్లోకమును, 'మనో వాక్కాయై' అను గద్య చూర్ణికను అందరును చేరి అనుసంధింతురు.

పిదప సన్నిధి పరికరములు -

"శ్రీ రంగరాజ చరణాంబుజ రాజహంసః
శ్రీ వేంకటేశ కరుణా కలశార్ణవేన్దుః
శ్రీ దేవరాజ జయ దీక్షిత వాఙ్మయశ్రీః
రామానుజో విజయతే యతిరాజ రాజః"

అనియు -

"సర్వదేశ దశాకాలే ష్వవ్యాహత పరాక్రమా
రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతామభి వర్ధతామ్
రామానుజార్య దివ్యాజ్ఞా ప్రతివాసర ముజ్జ్వలా
దిగన్త వ్యాపినీ భూయాత్ సా హి లోక హితైషిణీ."

అను శ్లోకమును అనుసంధింప, "అరుళప్పాడు నమ్మ్ రామానుశన్" (మన రామానుజులకు హెచ్చరిక) అని పెరుమాళ్ళు అనుజ్ఞను ప్రసాదింపంగా, ఎంబెరుమానారులను కృతార్థులై, తిరుగ ప్రదక్షిణముగా బయలు వెడలిన సమయమున రామానుజీయు లందఱును - యతిరాజ వింశతి మొదలగు స్తోత్రముల ననుసంధింప, సమస్త నృత్త గీత వాద్యములతో తమ సన్నిధికి విచ్చేసి, నీరాజనమును స్వీకరించి, తమ వారలకు

తీర్థము, ప్రసాదము, అనంతాళ్వాన్లు - మొదలగు బహుమానములు
నెల్ల ప్రసాదించి, అనుగ్రహింతురు.

ఇట్లే, పండ్రెండవ రోజునను - 'నూత్తందాది' సేవ అయిన
పిదప, ఎంబెరుమానార్ల మంగళాశాసన క్రమము.

ఈ క్రమము అప్పటి పెద్దల నియమనము.

ఇట్లు ఇతర దివ్య స్థల వ్యాప్తమగు ఎంబెరుమానార్ల మంగళ
శాసన క్రమమే 'తిరుమలలో మూల బేరము ప్రధానము' అనుటకు
కారణము - అని పెద్దలు వక్కాణింతురు.

## బ్రహ్మోత్సవ సమయమున సేవాకాలక్రమము

తిరుమల బ్రహ్మోత్సవ మొదటి రోజు ఉదయమున ప్రబంధాను
సంధానము లేదు. రాత్రి - మొదటి తిరువన్దాది.

రెండవ రోజు ఉదయము, సాయంత్రము - రెండవ తిరువందాది

మూఁడవ రోజు, ప్రాత స్సాయంకాలయందు - మూఁడవ తిరు
వందాది.

నాల్గవరోజు ప్రాత స్సాయంకాలముయందు - నాల్గవ తిరు
వందాది.

ఐదవ రోజు ఉదయము ఒక పర్యాయము తిరువిరుత్తము అను
సంధేయము. పిదప, ముదలాయిరమును ఆరంభింపవలయును. రాత్రి
గూడ, తిరువిరుత్తము ఒక పర్యాయము అనుసంధానము జేసి, పిదప
ముదలాయిర శేషము అనుసంధానము.

ఆరవ రోజు ప్రాత స్సాయంకాలములయందు - ఒక పర్యా యము పెరియ తిరుమన్దాది ప్రబంధమును అను సంధించి, పిదప - ముద లాయిర శేషమును అనుసంధింపవలయును.

ఏడవ రోజు ఉదయము తిరుమొళి తొడక్కము. శ్రీ నాదన వన విహార కాలము లయందును, రాత్రి కాలమునను తిరుమొళియే అనుసంధేయము.

ఎనిమిదవ రోజు తిరు త్తేరువద్దను తిరుమొళియే ద్వితీయావృత్తిగ అనుసంధేయము. తిరు త్తేరు స్వస్థానమునకు చేరియున్నప్పుడు పెరి యాళ్వార్ తిరుమొళికిని శాత్తుముఱను జరుపవలయును. తిరుమొళి శాత్తుముఱ జరిగిన తరువాత, తిరువెళుకూ త్తిరుక్కై, శిరియ తిరు మడల్, పెరియ తిరుమడల్ — అను మూడు ప్రబంధములును అను సంధేయములు. తిరు త్తేరులో నుండి దిగి, సన్నిధికి వేంచేయునపుడు, తిరువాశిరియము. రాత్రి - ముదలాయిర శేషము.

తొమ్మిదవ ఉత్సవమున — ఉదయము ముదలాయిర శేషము, తిరుక్కుఱున్దాణ్డకము, తిరునెడున్దాణ్డకము. మధ్యాహ్నము చూర్ణాభి షేక సమయమునను, తిరువీథిలో వేంచేయునపుడును - తిరుచ్చన్దవిరు త్తము రాత్రి సమయమున - నూత్తన్దాది, అవకాశ మున్నచో ఆవృత్తి, తదుపరి - ఎంబెరుమానార్ల సన్నిధిలో శాత్తుముఱ జేయ వలెను.

పదియవ ఉత్సవమున - శ్రీ పుష్పయాగ సమయమున, ద్వాద శారాధన సమయమున - తిరువాయిమొళి అనుసంధేయము. ఆరవ ఉత్సవమున, సాయం కాలము న - వనోత్సవార్థము చూర్ణాభిషేక మును స్వీకరించి తిరువీథిలో వేంచేయునపుడు అనుసంధానము లేదు

## తిరుమలలో ఇయల్పా ప్రబంధమునఁ దప్ప, మిగిలిన ముప్పాయిర ప్రబంధములందును, తిరువేంగడ ముడైయాన్ల విషయక మగు పాశురము లను రెండు సారు లనుసంధానము చేయుటకును ఇయల్పాలోని పాశురముల రెట్టింపకుండుటకును కారణము

శ్రీమద్రామానుజులవారు శ్రీమన్నాథమునులవద్దనుండి వచ్చుచున్న సంప్రదాయ ముఖమున 'శెన్దమిళ్ పాడువార్ తామ్ వణఙ్గుమ్ దేవర్ ఇవర్' (విశిష్ట మగు ద్రావిడ భాషలో గానము చేయు ముదలాళ్వార్లు భజించు దైవ మితఁడు) అని వినియున్న ప్రకారము, మొట్టమొదటి ఆళ్వార్లగు ముమ్మువ్వురి యభిప్రాయమును బాగుగ నెఱింగి యుండుటచే, 'మూఁడు తిరువన్దాదులయందును తిరువేంగడ ముడైయాన్లే ప్రతిపాద్యులు' అనియు - ఈ తిరువన్దాదులలో, తిరుమంత్రమున వ్యక్త చతుర్థ్యమును ప్రతిపాదించుటద్వారా సమానార్థ మగు ఇయత్పా శేషములకును ఇతఁడే ప్రతిపాద్యుఁడు - అని నిశ్చయించి, అధ్యయనోత్సవమున తిరువేంగడ ముడైయాన్లు మొట్టమొదట ఈ ప్రబంధమును ఆలకించునటుల నియమించుటచే, ఇయల్పా ప్రబంధమునకు తిరువేంగడ ముడైయాన్లే ప్రతిపాద్యులు. అందుచే తిరువేంగడ ముడైయాన్లే విషయ మగు పాట్టులను రెట్టింపవలదు - అని పూర్వుల నియమనము.

'ఉలగమున్డ పెరువాయా' 'తాయే తన్దై' మొదలగు తిరువాయ్మొళులవలె, ఆళ్వారులను భగవద్విషయమున ఆజన్మసిద్ధ మగు ప్రావణ్యమును ప్రతిపాదించుటనుబట్టి, తిరువిరుత్తమున 'ముళైయో ముళు ముత్తుమ్' అను పాశురమును అనుసంధాన కాలమున రెట్టించుట. 'యాదేను మోరాక్కై' అను పాశురమును రెట్టించుట తిరు

కోట్టియూర్ నంబిగారి ఐతిహ్యమునుబట్టి - అని పెద్దలు వ్రాకు-త్తురు.

'తిరుమల తిరుపతి దివ్య దేశములు రెండును జేరి ఒకే దివ్య క్షేత్రము' - అని శ్రీమద్రామానుజులవారు నియమించిరి - అను ఐతిహ్య ముండుటచే, తిరుపతిలో శ్రీ గోవిందరాజస్వామివారు అధ్యయనోత్సవమును పరిపాలించువఱకును, తిరుమలలోని శ్రీ వైష్ణవులు, తమ తిరుమాళిగలలో దివ్య ప్రబంధముల అధ్యయనాధ్యాపనములు నిర్వర్తింపగూడదు.

దివ్య ప్రబంధములలో శ్రేష్ఠ మగు తిరువాయ్‌మొళి మొదలుకొనిగాని, ఇతర ప్రబంధములను మొదలుకొనిగాని అనుసంధింపక, ఇయల్పా ప్రబంధమును మొదట ఆరంభించి అనుసంధించుటకు కారణము - శ్రీ పెరియవాచ్చాన్పిళ్ళైస్వామివారు 'కలియన్ అరుళ్ప్పాడు' అను గ్రంథమున ప్రసాదించిన శ్రీమద్రామానుజులవారి నియమనమే.

**తిరువేంగడ ముడైయానులు, శ్రీ గోవిందరాజస్వామి వారును - ఇద్దఱును దివ్య ప్రబంధముల కర్ణ పథ విషయము లనుగాఁ జేసికొను (విను) నపుడు సెట్టింపవలసిన (రెండు సారులు అనుసంధింపవలసిన) పాశురముల అనుక్రమణిక.**

ఇయఱ్పా, ముదలాయిరము, పెరియ తిరుమొళి, తిరుక్కుఱున్దాణ్డకము, తిరునెడు న్దాణ్డకము, తిరువాయిమొళి, నూత్తందాదులు, ఉపదేశరత్నమాల అను వరుసతో - ఇయఱ్పాలో - తిరువిరుత్తమున సెట్టింపవలసిన పాశురములు - (1) ముత్తైయో ముత్తుమున్ (2) యాదానుమోరాక్కై.

శిఱియ తిరుమడల్‌లో - (1) నారాణావో మణివణ్ణా - నాగణై యాయ్ (2) వారాయ్ ఎన్ ఆరిడరై సిక్కాయ్ (3) శీరార్ తిరువేఙ్గడమే తిరుక్కోవలూరే ఆరామమ్ శూళ్గ్న్ద అరఙ్గమ్ - అను మూడు వాక్యములు

పెరియ తిరుమడల్‌లో - (1) పొన్నియలు మాడక్కవాటమ్ కడైన్ద పుక్కు ఎన్నుడైయ కణ్ణిప్పనోక్కినేన్ (2) మన్నుమరఙ్గత్తెమ్ మామణియై (3) తెన్ తిల్లైచ్చిత్తిరకూటత్తు ఎన్ శెల్వనై (4) మిన్నిమళై తవళుమ్ వేఙ్గడత్తెమ్ విత్తగనై (5) మన్ననై మాలిరుఞ్జోలై మణాళనై అనునవియును –

ముదలాయిరమున –

పెరియాళ్వార్ తిరుమొళిలో - (1) శెత్తిమొళివట్టమ్ (2) ఉన్నియుమ్ ఓక్కవైయిల్ (3) శెఙ్గమలక్కళిలిల్ (4) ఎన్నిదుమాయమ్ (5) మిన్ననైయ నుణ్ణిడైయార్ (6) తెన్నిలఙ్గై మన్నన్ (7) మచ్చొడు మాళిగై యేఱి (8) కొణ్డల్ వణ్ణా ఇఙ్గే పోదర్ కణ్డాయ్ (9) కడియార్ పొళిలణి వేఙ్గడవా (10) మూన్ఱెళు త్తదనై (11) తన్నడియార్ శిఱన్ద గత్తు (12) ఎఙ్గళాయిన (13) ఉఱగల్ ఉఱగల్ (14) పరు ప్పదత్తు.

తిరుప్పావులో - 1. ఓఙ్గి యులగళన్ద 2. నాయగనాయ్ 3 ఉన్దు మదగళిత్త 4. మారివాలై 5. అన్ఱి వ్వులగమ్ 6. కూడారై.

నాయ్చ్చియార్ తిరుమొళిలో - 1. మత్తనన్ నఱుమల్ర్ 2 కాట్టిల్ వేంగడమ్ 3. వెళ్ళై విళి శంగు 4. మెన్నడై 5. శఙ్గమా కడల్ 6. మదయానై 7. నాఱు నఱుమ్పొళిల్ 8. పాడుమ్ కుయిల్

గాళ్ 9. మళైయే మళైయే 10. పొంగోదమ్ శూళ్న్ద 11. మూడ వెనెన్ మణియినై.

పెరుమాళ్ తిరుమొళిలో - 1. వాయో కీశైజిగుం 2. వన్ పెరుమానగమ్ 3. శెదియాయ 4. దేవరైయుమ్ 5. తరు తుయరమ్ కడలై.

తిరుచ్చన్ద విరుత్తములో - 1. శెళుమ్ కోళుమ్ పెరుమ్ పని 2. నడన్ద కాల్గళ్ 3. కరణ్డ మాడు 4. కడైన్దు పాఱ్కడల్ 5 అరజ్గనే దరఙ్గనీర్ 6. కులఙ్గళాయ 7. ఇరన్దురైప్పదు 8. వైదు నిన్నై 9. అత్తనాగి.

తిరుమాలైలో - 1. పచ్చై మామలై 2. కుడదిశై 3. మేమ్పొరుళ్. అమలనాది పిరాన్‌లో - మున్ది పాయ్.

పెరియ తిరుమొళిలో -

1. ఎమ్బిరానెన్దై 2. కులన్దరుమ్ 3. పేశుమిన్ తిరునామమ్ 4. వన్దాయ్ ఎన్మనమ్ 5. కూడి యాడి 6. ఉళ్ళమ్ కనిన్దిరుక్కుమ్ 7. వెన్దిఅల్ పిరరిల్ 8. మానవాయ నజ్గమ్ 9. ఎయ్యచ్చి దెన్దదు 10 కరు ముగిల్ పోల్వదోర్ మేని 11. ఎన్ తుణై ఎన్ఱు 12. అన్ఱియ వాణన్ 13 వేడాన్ తిరువేంగడమ్ 14 చిన్దై తన్నుళ్ 15 వాన్పురి యుగ మన్నన్ 16 చిన్దనై యై 17 తుళఙ్గునీళ్ముడి 18 కులైయార్న్ద 19. అఙ్గువెన్నరగత్తు 20 శేయోఙ్గు 21. ఎఙ్గళుక్కరుళ్ శెయ్‌గిన్ఱ 22. శేఅవరైమున్ 23. నీణిలా ముత్తత్తు 24. అరువిశేర్ వేంగడమ్ 25 తరఙ్గనీర్ 26 మిన్ఱానై 27. మత్తుమోర్ దెయ్వమ్ 28. మంజైయాడ మాముది 29 పణ్ణులా మెన్మొళి 30 పున్నైవళర్ 31. వలమ్పురి యాళియనై 32. పొన్నై మామణియై 33. శొల్లాయ్)

పైజ్ఞిళియే 34. ఇజ్ఞే పోదుమ్ కొలో 35. కొణ్డై యుణ్ గణుమ్ 36. తేనోడు వణ్డాలుమ్ 37. ఏడై నిన్ఱ 38. మేమ్బినో వృళు.

తిరుక్కుఱున్దాణ్డకము ముత్తము.

తిరునెడుందాండకములో - 1. సిరగుత్తాయ్ 2. పొన్నానాయ్ 3. పట్టుడుక్కుమ్ 4. ముళైక్కదిరై 5 కన్రుమేయ్త్తు 6. మైవణ్ణ నఱుమ్ కుఞ్జి.

తిరువాయిమొళిలో — 1. కణ్ణావాన్ 2. నమ్బియై 3 ఎన్దాయ్ తన్ తిరువేంగడత్తు 4 పఙ్బనాభన్ 5 వేంగడజ్గళ్ 6. కున్ఱమేని 7 నాయ్పునలన్దరువి 8. ఇలింగ త్తిట్ట 9 వనమాయ్ నిలజ్కోణ్డ 10. వానవరువాయ్ 11. అగలగిల్లేన్ 12. ఎన్ తిరుమగళ్ శేర్ 13. ఇన్ఱిపోగ 14. తలై మేల్ పునై న్దేన్ 15. మేయాన్ వేంగడమ్ 16. తిరుమాలిరుంశోలై మలై యే 17. ఉత్తేనుగన్ద 18 కోలమలర్ పావై.

రామానుశ నూత్తందాదిలో - 1. కళ్ళార్ పొళిల్ 2. మొళియైక్కక్కుమ్ 3. తాళ్వొన్ఱిల్లా 4. ఆణ్డుగళ్ నాళ్ 5. నిన్ఱవణ్ కీర్తియుమ్ 6. ఇదుమే.

తిరువాయిమొళి నూత్తన్దాది పాశురములలో - కోయిల్ తిరువాయిమొళి పాశురము లన్నిటికి రెట్టబడి.

ఉపదేశ రత్నమాలలో - (1) ఆళ్వార్ గళ్ వాళి (2) ఉణ్డై వైగాశి (3) ఇన్దా తిరువాడిప్పూరమ్ (4) ఆళ్వార్ గళ్ తాఙ్గళ్ (5) ఎమ్బెరుమానార్ (6) తెళ్ళియదా నమ్బిళ్ళై (7) నమ్బెరుమాళ్ (8) అన్న పుగళ్ (9) జ్ఞానమనుట్టానమ్.

తిరుక్కుఱున్దాణ్డకము ప్రత్యేక ప్రబంధ మైనను, తిరుమంగై యాళ్వారులు సంసారమునందలి ఆర్తివలన, తిరునెడున్దాణ్డకముతో

ప్రథమమున ఒకే సమయమున జెప్పఁబడుటచే, ప్రత్యేకా
నము దానికి లేదు. కాఁబట్టి, శాత్తుముఱ సమయమున దీని
ముఱయును లేదు. అందుచే, అనుసంధాన సమయమున ఒ
రము రెట్టపడి. అనఁగా - 'పిణ్ణియార్' అను పాశురమును రెట్టి
అర్థగౌరవముచేత.

తిరుప్పళ్ళియెళుచ్చికి వక్తృభేద ముండి, ప్రత్యేక
మైనను, తిరుప్పావుతో గూడ, ప్రబోధన పర మగుటచే, ఏ
పాదక మగుటవలన, ప్రత్యేకముగ అనుసంధానము లేకుండు
సన్నిధిలో ప్రత్యేకముగ శాత్తుముఱై లేనందునను - ఒక పా
రెట్టింపవలయును. ఈ పౌర్వాపర్యమునకు హేతువు - 'అజ్ఞ
ఒక సంతతియాయ్ 'అను రీతి' ఆండాళమ్మవారికిని ఆళ్వారులు
లగుటచేత.

తిరువాశిరియము ప్రత్యేక ప్రబంధమైనను, గాథా స
టచే, ప్రత్యేకముగ అనుసంధానము, శాత్తుముఱయును క
మగుటచే, ఒక పాశురమే రెట్టింపవలయును.

రామానుజ నూత్తన్దాదిలో - 'ఇరుప్పిడమ్' అను పా
రెట్టించుట అర్థ గౌరవముచేత.

తిరువాయిమొళి మొదలగు ఇతర ప్రబంధములకున
ముఱై చేయునపుడు — రెండు పాశురములను రెట్టింపవలయు

ఉపదేశ రత్నమాలలో - 'మన్నుయిర్ కాళ్' అన
రము మణవాళ మహామునుల శ్రీ సూక్తి కానందున, ప్రబం
బహిర్భూత మగుటచేతను, కిడాంబి అప్పళ్ళాన్లు మణవా
మునుల విషయముగ ఆనతిచ్చిన దగుటచేతను, ప్రబంధముతో
శాత్తుముఱ సమయమున ఒక పర్యాయము అనుసంధేయమ
సంప్రదాయము.

తిరుమల బ్రహ్మోత్సవమున, వీథిలో వనుసంధించిన మువ్వాయిర ప్రబంధమునకును, రామానుశ నూత్తందాదికిని ఇయల్ శాత్తు ఎంబెరుమానార్ల సన్నిధిలో అనుసంధింపవలయును.

తిరువాయిమొళి - మొదలైనవానిని అనుసంధించునపుడు ఒక పాశురమును మాత్రమే రెట్టించి, తిరుప్పల్లాణ్డులో రెండు పాశురములను జేర్చి రెట్టించుటకు హేతువు - భాగవతుల విషయమున మంగళా శాసనము చేయుట - భగవద్విషయ మంగళాశాసనమునకు ఎల్ల యగుటయే.

## వెణ్ణుమాలైయిట్టాన్ తిరుమంటప శబ్దమునకు అర్థము

వెణ్ణు శిశుపాలుని జయించి, మాలై యిట్టాన్ - శ్రీ రుక్మిణీదేవి కంఠమున మాలను వేసినవాఁడు - అని. ఇది శ్రీకృష్ణస్వామికి పేరు. అందుచే, వెణ్ణుమాలై యిట్టాన్ పెరుమాళ్ళు - అనుదానికి 'శ్రీకృష్ణ శర్మ' యనియు, 'రామానుజ దాసుఁడు' అనియును పేరు దక్షిణ దేశమున ప్రసిద్ధమై యున్నది.

పూర్వ కాలమున - 'వెణ్ణుమాలై యిట్ట పెరుమాళ్' అను నొక బ్రాహ్మణుఁడు మధ్య రాష్ట్రమును రక్షించుచు, ప్రభువుగా నుండెను. అతఁడు తిరువేంగడ ముడై యాన్లకు మంటపమును కట్టించుటచే, అతని పేరే ఆ మంటపమునకు ప్రసిద్ధ మాయెను - అని పెద్దలు అనతిత్తురు.

## మలై కునియ నిన్ర పెరుమాళ్ శబ్దమునకు అర్థము

మలై - తిరుమలను, కునియ - పూర్ణముగ, నిన్ర పెరుమాళ్ - నిలచియున్న పెరుమాళ్ళు - అని. దీని ననుసరించియే, 'నిలై యారనిన్రాన్'

అని ఆళ్వారులు ఆశతిచ్చిరి. 'శ్రీ వృషశైల మాస్థిత విభుః' అనియు, 'అగ్రిం వ్యాస్య సమాస్థితో విభుః' అనియును అభియుక్తులను అను గ్రహించిరి.

## శ్రీ చూర్ణ పరిపాలన సమయమున సేవాకాలక్రమము

సర్వ దివ్య దేశములయందును శ్రీ చూర్ణపరిపాలనము చేయునపుడు అనుసంధేయములు భిన్న భిన్నములై యున్నను, తిరుక్కాణి కను ఆరంభించి - అధ్యయనోత్సవము వఱకును అన్ని చోట్లను ఒకే ప్రకారము.

అ దెయ్యది యనగా -

(1) ముదలాయిరము (2) పెరియ తిరుమొళి (3) ఇయల్పా - అను క్రమముగ నుండు దివ్య ప్రబంధముల తనియనులును రామానుజ నూత్తన్దాది తనియన్లును అనుసంధించి, ఇయల్ శాత్తు అనుసంధింపవలయును తిరువీథిలో అనుసంధాన పక్షమునను 'ఉపదేశ రత్నమాల' అనుసంధేయము.

కొన్ని స్థలములయందు - తిరుప్పల్లాండు, కణ్ణినుణ్ శిఱుత్తాంబు, తిరువాయ్ మొళి, తిరువిరుత్తము - అను ఈ ప్రబంధముల తనియన్లమాత్రము అనుసంధింతురు.

## దేవయాళ్ శిఙ్గన్ ఘుట్టై - శబ్దార్థము

'దేవయాళ్' శబ్దము అపశబ్దము. కాని, దేవి యగు పిరాట్టి (మహాలక్ష్మి) యొక్క పరిజనము - అని అర్థము. అందుచే, మడపళ్ళి నాయ్చ్చియార్ల పరిజనము - అని సిద్ధించుచున్నది. 'శిఙ్గన్' అను నొక దాసుఁడు, తిరుమలలో నివసించుచు, మిక్కిలి భగవద్భక్తి యుక్తుఁడై

పూర్వకాలమున శ్రీ వేంకటాచలపతి సన్నిధికి వంట చెఱకు కైంకర్య మును నిర్వహించుచుండెను. తిరువేంగడ ముడైయానులును, 'ఆ భక్తుడు తన కభిమతుడు' అని అందఱును ఎఱుంగుటకై, అతని చరమ కాలము సమీపించినప్పుడు - 'అతని శరీర శోధన (దహన సంస్కార) మునకు మన సన్నిధినుండి కాష్ఠములు గొనిపోయి చరమ దేహ శోధన మును చేసి, అర్చకులు మొదలగువారందఱును అనువర్తించి రండు' - అని నియమనము చేసిరి. అందుచే, అతడు చేయు కైంకర్యము నకు - 'శిఙ్గన్ ముత్తై' యను పేరు ప్రసిద్ధులు కలిగినవి. 'ముత్తై' అనగా - 'ఉచిత కృత్యము' అని యర్థము.

## జీయర్ శబ్దార్థము

జీయర్ శబ్దము స్వామివాచి. అనగా - 'స్వామి' అను అర్థ మును దెల్పునది ఈ యర్థము జీయర్ పడి శ్రీవచనభూషణ వ్యాఖ్యానమున - 'మాఱనేరినమ్బి విషయమాగ పెరియనమ్బి ఉడైయవర్కు' అను స్థలమున చూడనగును.

## బ్రహ్మోత్సవములో మొదటి దినము దివ్యప్రబంధానుసంధానము లేకుండుటకు కారణము

తిరుమల తిరుపతులలోని శ్రీ వేంకటాచలపతి - శ్రీ గోవింద రాజస్వామివార్ల సన్నిధులలో, మొదటి బ్రహ్మోత్సవమున గోష్ఠిన దివ్య ప్రబంధానుసంధానము లేకుండుటకు కారణము - చెప్పట నుండు నొక ఐతిహ్యము అది ఎయ్యది యనగా —

శ్రీ వైఖానస శాస్త్రమునందు ఆనంద సంహితలో —

" అవాహ్య యజ్ఞశాలాయాం కలశే ప్రథమేఽహని
సాయ మారభ్య దేవేశం దీక్షితో వేదపారగై:
వేదారంభం చరేత్ విద్వాన్ విష్ణో ర్యాగాత్ తత శ్చరేత్ "

అను నటుల, ధ్వజారోహణోత్సవములతో, మొదటి యుత్సవము రోజున సాయం కాలమున యాగశాలలోని కలశముల యందు దేవతా వాహనము జేసి, ఆరాధనమును జేసిన తరువాత, వేద పారాయణము నారంభించుట ప్రమాణ సిద్ధ మగుటచే, దానికి సమాన మగు ద్రావిడ వేదమునకును తొడక్కము తదనంతరమే ఉచిత మని, ఆనాటి రాత్రి తిరువీధిలో ఇయల్ తొడక్కమ్ జరుపవలయును - అని ఎంబెరుమానార్లు నియమించి రని, చిరోపాసిత సద్వృత్తు లగు వారలు ఆనతిత్తురు.

అట్లైన ప్రబంధములలో శ్రేష్ఠ మగు తిరువాయిమొళి మొద లుగాగాని, ఇతర ప్రబంధములు మొదలుగాగాని అనుసంధింపక, ఇయల్పా మొదలుగ ఆరంభించి అనుసంధించుటకు హేతు వెయ్యది యన - 'ఎంబెరుమానార్లు తామే సోపపత్తికముగ అట్లు నియమించిరి' అని పెరియవాచ్చాన్‌పిళ్ళై ప్రసాదించిన 'కలియన్ అరుళప్పాడు' అను రహస్యమున జూడ నగును.

## తిరుమంజన తీర్థ గౌరవము

స్థలవాసు లగు పెద్దలును, జీయరులును, శ్రీ వైష్ణవులును - 'తిరువేంగడ ముడైయాన్లు, తిరుమల నంబిగారు గొనివచ్చిన తిరు మంజన తీర్థమును వ్యాధ రూపులై, ఎదు జేగి యారగించిన క్రమ మును ఎల్లరును ఎఱింగి యుజ్జీవింపవలయును' అని తీర్మానించుకొనిన వారలై, అధ్యయనోత్సవమునకు కడపట, పెరుమాళ్ళను - ఉదయ వర్లను ఆకాశ గంగా తీర్థపు మార్గమునకు వేంచేపు జేసికొని వెళ్ళి, ఆకాశ గంగా ధారలోనుండి తీర్థమును గైకొని, తిరుమొళి అనుసంధా నముతో గూడ, తిరుమంజనమును వేంచేపు జేసికొని, పెరుమాళ్ళ

తోడను, ఎంబెరుమానార్ల తోడను తిరువీథి ప్రదక్షిణముగ వేంచేయు చుండ, శ్రీ వైష్ణవులకు వీథులలో తమ తమ గృహముల ముందంతటను నడపావడలు, పాద్య - గన్ధ - ధూప - మంగళ దీప - తాంబూలాదులను సమర్పించుచుండ, ఇట్లు వరుసగా కోవెలకు వేంచేసి, శ్రీ పురుషసూక్తా ద్యనుసంధానముతో శ్రీవారి శ్రీపాదపద్మములకును, శ్రీ శఠగోపమునకును, తిరుమంజనమును సమర్పించి, కర్పూర నీరాజనా ద్యనేకోపచారములుగూడ సమర్పించి, శ్రీ రామానుజ దర్శన ధర్మముల వర్థిల్ల జేయుచు, కృతార్థులై యుందురు.

ఈ ఉత్సవమునకు - 'తణ్ణీ రముదువళి తిరుత్తుగై' అను తిరు నామము ప్రసిద్ధమై యున్నది. తణ్ణీరముదు - తిరుమల నంబిగారు ఆకాశ గంగనుండి వేంచేపు జేసికొనివచ్చు తిరుమంజన తీర్థమును, వళి తిరుత్తుగై - మార్గ మధ్యమున ఆరగించుట అనఁగా -

" పపౌ జలం సాదర మంబుజాక్షః
శ్రీశైలపూర్ణాయ నమోఽస్తు తస్మై. "

అనునటుల, తిరువేంగడ ముడైయాన్లు ఆదరించి ఆరగించునటుల జేయుట.

" కృచ్ఛ్రాత్ పాపవినాశపూరితపయః కుంభం దధానం శిర -
స్యాయాన్తం శబరాకృతిః పథిహరః శ్రీశైలపూర్ణం గురుమ్
తాతేత్యర్థితవాన్ న దత్త ముదకం పీతం ఘటాన్తం శరా -
ఘాతా దుద్ధృత మాదరాత్ ప్రముదితం శ్రీ నాయకే నామునా
ఖిన్నే శ్రీశైలపూర్ణేఽ ప్యథ పయసి హృతే తద్విషాదాన్నిషాదా -
కారః కారుణ్యత స్తం కరతల మవల మ్బ్యానయన్ స్వేమణాద్రిమ్
భిన్దన్ తద్రన్ధ్రజైషా ఘనతరఝ నదీ వేఙ్కటేశప్రియా తత్
తోయం దేయం త్వయాఽహ ర్నిశ మితి సవద న్నచ్యుతోఽభూ దదృశ్యః
తాతేతి సమ్బోధ్యయ మఙ్గనాద్రౌ ఆసీయమానా జ్జల పూర్ణకుమ్భాత్
పపౌ జలం సాదర మమ్బుజాక్షః శ్రీశైలపూర్ణాయ నమోఽస్తు తస్మై. "

అని ఎల్లఱును తిరుమల నంబిగారి తిరువడులయాదలి ప్రేమాతిశయము వలన ఇట్లు శ్లోకములను అనుసంధించిరి.

## చిన్న తిరుమల నంబిగారిని 'తోళప్పర్' అని వ్యవహరించుటకు కారణము

ఈ తిరుమల నంబిగారి కుమారులగు చిన్న తిరుమలనంబి గారికి — 'తోళప్పర్' అని తిరునామము గది వచ్చుటకు కారణ మేమనగా —

" శ్రీమ ద్భాష్యకృతో హ్యభేద కథకైః వాదే పణే ప్రస్తుతే
సామైక్య శ్రుతిభేదవాక్యహృదయా న్యుక్త్వా నిశీథే హరిః
మిత్రం భాష్యకృతో జగాద స చ యం సర్వస్య మిత్రం జగౌ
తం శ్రీ భూధర పూర్ణపుత్ర మవరం శ్రీశైలపూర్ణం భజే "
" భారద్వాజ కులామ్భోధిం ప్రజ్ఞా భక్త్యమృతార్ణవమ్
శ్రీశైల పూర్ణతనయం మిత్రతాత గురుం భజే. "
" శ్రీమ ద్వేంకటనాయకేన జగతాం తాతేన వాక్యాత్పరమ్
తాతే త్యాదరతో హి యస్య మహిమా లోకే ప్రసిద్ధం గతః
తం తాతస్య చ తాత మార్యశరణం శ్రీశైలపూర్ణం గురుం
భారద్వాజకులీన మాశ్రితనిధిం ప్రజ్ఞానిధిం సంశ్రయే.
అని పెద్దలు కీర్తించుచుండుటయే.

## తిరుమలలో వలెనే తిరుపతిలో గూడ శ్రీ రామానుజ దర్శన - ధర్మములను పాలించుట

తిరుమల తిరుపతులలో నిత్యవాసు లగు పెద్దలు, ఎంబెరుమానార్ల నియమనము ననుసరించి, తిరువేంగడ ముడైయాన్లు స్వీకరించుచున్నటుల, శ్రీ గోవిందరాజస్వామివారును, అటులనే ( తు చ తప్పకుండ ) ఐతిహ్యములను, అధ్యయనోత్సవము - మొదలగు శ్రీ రామానుజ దర్శన ధర్మముల నన్నిటిని స్వీకరించునటులను కట్టడి జేసిరి

## అధ్యయనోత్సవ విశేషములు

పెద్ద తిరువధ్యయనోత్సవము కడపటి రోజు సాయంకాలమున, శ్రీ నమ్మాళ్వార్లు పల్లకిలో వేంచేసి, తిరువేంగడ ముడైయాన్లనకును, శ్రీ గోవిందరాజస్వామి వారికిని దివ్యము తోచునటుల, మొదట - తిరుమలై యాళ్వార్లను ( శ్రీ వేంకటాచలమును ), తిరువేంగడ ముడయాన్లను ( శ్రీ వేంకటాచలపతిని ) మంగళాశాసనము జేసి, శ్రీవారి పాద పద్మములను సేవించుటకై, నృత్య - గీత - వాద్యములతోడను, జీయరులు, వైష్ణవులు — మొదలగువారి స్తోత్ర గద్యానుసంధానముల తోడను, శ్రీ గోవిందరాజస్వామివారి సన్నిధి ప్రదక్షిణముగ బయలు దేరి, తిరుమల అడివారమునకు పొలిమేర యని, శిష్ట గోష్ఠిలో ప్రసిద్ధమైన 'పెండై పెండై' అను గ్రామమునందలి తిరుమంటపమున వేంచేసి, తిరుమల యాళ్వార్లను, తిరువేంగడ ముడైయాన్లను, కస్త్రమేన్ని, అగలగిల్లేన్, ఒళిబిల్ కాలమ్ అను పాశురములను అనుసంధించి, శ్రీ పాద పద్మముల సేవించి నిలువగా, అట్టి సమయమున తిరువేంగడ ముడైయానులు గూడ, పరివట్టములు, మహాప్రసాదము, అభయ హస్తము తాము ధరించి విడచిన పీతాంబరము మొదలగు బహుమానముల నెల్ల పంపి యనుగ్రహించగా, వాని నన్నిటిని స్వీకరించి కృతార్థులై, తిరిగి తిరువీధి ప్రదక్షిణముగ వేంచేసి, శ్రీ గోవిందరాజ స్వామివారు పేరోలగ మండు తిరుమామణి మంటపమునకు విచ్చేయగా, అటుపై శ్రీ గోవిందరాజస్వామివారును తిరువారాధనము స్వీకరించి —

" ముద్గాన్నం వ్యంజనోపేతం ప్రభూతం తు నివేదయేత్. "

అనునటుల విశిష్ట క్రమమున ప్రసాదముల నారగించి, తిరువాయ్‌మొళి సేవాకాలమునకుగూడ చెవి యొగ్గి, అనుగ్రహించిన పిదప, వేదముల శాత్తుముఱ అయిన పిమ్మట, తిరువాయ్‌మొళి శాత్తుముఱ సమయమున నమ్మాళ్వారులు శ్రీ గోవిందరాజుల వారి తిరువడిఘళ్ళను జేరిన పిదప, కట్టియమును విజ్ఞాపన చేసెదరు.

" శ్రీ వేంకటాచలవిభో రపరావతార!
గోవిన్దరాజ! గురుగోప కులావతార!
శ్రీపూ తధీశ్వర! జయాదిమదేవదేవ!
నాథ ప్రసీద నతకల్పతరో! నమ స్తే! "

" లీలావిభూతిజనతా పరిరక్షణార్థం
దివ్య ప్రబోధ శుకయోగి సమప్రభావమ్
స్వామిన్! భవ త్పద సరోరుహ సాత్కృతం తం
యోగీశ్వరం శఠరిపుం కృపయా ప్రదేహి. "

అను శ్లోకములను అనుసంధించుచు —

" శ్రీ వేంకటాచలపతి యపరావతారా! తిల్లై గోవిందరాజా! శ్రీ పుళ్ళిరాజా! ఆళ్వారులను లోకోపకారార్థమై, ఈ లీలా విభూతియందు మఱల అవతరింప నను గ్రహింపవలయును "

అని విజ్ఞాపన చేయఁగా, పిదప - సర్వేశ్వరుఁడును ఆళ్వారులను అట్లే అనుగ్రహింపఁగా - ఆళ్వారులును కృతార్థులై, ప్రసాద వినియోగానంతరము, శ్రీ రామానుజ సంబంధు లగువా రందఱును - శ్రీ పరాంకుశ పంచవింశతి, నక్షత్రమాలై — అను ప్రబంధముల ననుసంధింప, సమస్త గీత వాద్యములతోఁ గూడ తమ సన్నిధికి వేంచేసి, అందఱికిని తీర్థ - ప్రసాద - మధురకవులను ప్రసాదించి, రామానుజార్య దివ్యాజ్ఞను వర్ధిల్ల జేయుచు, అందఱిని సంరక్షించునట్లు కట్టడి చేసిరి

ఇట్లు, గోవిందరాజస్వామివారును అధ్యయనోత్సవము స్వీకరించిన తరువాత, ఒక దినమున నిత్యులతోడను, పరాంకుశ పర

శాలాది ముక్తులతోడను కూడి, ఆళ్వార్ తీర్థమునకు వేంచేసి, అచ్చట తిరుమంజనమును స్వీకరించి, పూర్ణముగ ఆరగించి, వినియోగమైన పిదప, సమస్త పరివారములతోడను, నిత్యముక్తులతోడనుగూడ తిరిగి వచ్చి, కోవిలలో వేంచేయునటుల, ముందున్న పెద్దలు కట్టడి నొనరించిరి.

శ్రీ గోవిందరాజస్వామివారు, చిన్న అధ్యయనోత్సవమున నాలుగవ రోజు రాత్రి తిరుమామణి మంటపమున 'విణ్ణీల మేలాప్పు' అను ప్రబంధమును చెవి యొగ్గి వినునపుడు, ఆళ్వార్లతోడను, ఆచార్యులతోడను ఆండాళమ్మవారినిం గూడ, తను శేర్తిలో దివ్య సింహాసనమున వేంచేపు జేయునట్లు పెద్దల నియమనము.

ఇట్లు శ్రీ గోవిందరాజస్వామివారును, చాల కాలము ఎంబెరుమానార్ల నియమానుసారము అధ్యయనోత్సవమును పాలించుచుండ, ఇట్లు కొంత కాలము గడచిన పిమ్మట, ఆ సమయమందున్న పెద్దలు - ఇట్టి యుత్సవమున ఒక విశేష మేదియైనను ఉండవలయునని తలచి, ముందు మాదిరి, శ్రీ గోవిందరాజులవారు అధ్యయనోత్సవమునకు వేంచేసి, మరల తిరువీథి ప్రదక్షిణముగ వేంచేసి, శ్రీ గోపుర ద్వారమున గోవర్ధనోత్సవపు తిరుమంటపమున విజయము చేసి యుండఁగా - నిత్యులు, ఆళ్వారులు, ఆచార్యులు - మొదలగువారందఱును స్వామి పార్శ్వములయందు సేవించుచు నిలువగా, అప్పుడు వీరలకు తిరుమాల, శ్రీ శఠగోపము - మొదలగు బహుమానముల నెల్ల ననుగ్రహించిన తరువాత, అరయర్ స్వామివారు ఆళ్వారాచార్యులగు వీరల విషయమున ఒక్కొక్క తనియను, వారలు పాడించిన ప్రబంధములయందలి మొదటి పాశురములను అనుసంధించునటులను, కట్టియమును విజ్ఞాపన

చేయువారలు, ఆళ్వారాచార్యుల విషయముగ ఒక్కొక్క శ్లోకమును అనుసంధించుచు వీడ్కోలు సలుపునటులను కట్టుదిట్టములఁ జేసిరి

## వీడ్కోలు సలుపు క్రమము, పాశురముల క్రమము, శ్లోకముల క్రమము

మొదట శ్రీమన్నాథమునులకు పరివట్టము, తిరుమాల, శ్రీ శఠగోపము - మొదలగువానిని ప్రసాదించి, అనంతరము అరయర్లకును బహుమానము ప్రసాదించిన తరువాత, అరయన్లును శ్రీ శఠగోపము, తిరుమాలలు, తిరుప్పరివట్టములు మొదలగు పెరుమాళ్ళ ప్రసాదములను బంగారు పళ్ళెరములో బెట్టుకొని నిలువఁగా, ఇప్పుడు అర్చకులు నిత్యముక్తు లెల్లటికిని క్రమముగ శ్రీ శఠగోపము మొదలైనవానిని ప్రసాదించిన పిదప, అరయర్లు నిత్యముక్తుల విషయమైన వారి వారి తనియన్లను మొదట అనుసంధించి, వారు సాధించిన ప్రబంధముల యందలి మొదటి పాశురములను దేవగానమున మేళవించి యనుసంధింతురు అట్టి సమయమున కట్టియమును విజ్ఞాపనము చేయువారలు, నిత్యముక్తు లెల్లటికిని క్రమముగ తత్తద్విషయములగు శ్లోకముల ననుసంధించి, వీడ్కోలు సలిపెదరు. అంతట అందఱును అనుజ్ఞ వడసి, కృతార్థులై, తమ తమ నిలయములకు వేంచేయుదురు.

మొదట - తిరువడి, తిరువందాళ్వాకు - 'శెన్రాల్ కుడైయామ్', 'నివాస శయ్యాసన', 'దాస స్సఖా' - అనునవి అనుసంధేయములు.

పొయిగై, పూదమ్, పేయ్ ఆళ్వార్లకు - 'కైదై శేర్', 'వైయన్దగళియా', 'ఎన్ పిఱవితీర', 'అన్బేదగళియా', 'శీరారుమ్ మాడమ్', 'తిరుక్కణ్డేన్' అనునవియును -

తిరుమళిశైయాళ్వార్లకు - 'నారాయణన్', 'నాన్ముగనై' 'ఎన్బవపుమ్' అనునవియును -

నమ్మాళ్వారులకు - 'కరివిరుత్తక్కళి', 'పొయ్‌నిన్ర' 'ఎన్బవపుమ్' అనునవియును -

శ్రీ కులశేఖరాళ్వార్లకు - 'ఇన్నముదమ్', 'ఇరుళిరియ' అనునవియును —

పెరియాళ్వార్లకు - 'పాణ్డియన్ కొణ్డాడ', 'పల్లాణ్డు పల్లాణ్డు' అనునవియును —

శ్రీ ఆండాళమ్మవారికి - 'అల్లినాళ్ తామరై మేల్', 'తై యొరు తిఙ్గళుమ్' అనునవియును అనుసంధేయములు.

అందఱికిని ప్రథమ ప్రబంధములు తనియన్ పాశురముల ననుసంధించుచు, ఆండాళమ్మవారికి మాత్రము చరమ ప్రబంధ తనియన్లను అనుసంధించుటకు కారణము - 'వేఙ్గడవఱ్కెన్నై విదిక్కిఱ్రియే' అని ప్రబంధాదిలో నుండుటయే యగును.

తొండరడిప్పొడియాళ్వార్లకు - 'మత్తుస్తుమ్', 'కావలర్ పుణై' అనునవియును —

తిరుప్పాణాళ్వారులకు - 'కాట్టవే', 'అమలనాదిపిరాన్' అనునవియును —

తిరుమంగైయాళ్వారలకు - 'వాళిపరకాలన్', 'వాడినేన్ వాడి' అనునవియును —

శ్రీ మధురకవులకు - 'వేఱొన్తుమ్', 'కణ్ణినున్ శిరుత్తామ్బినాల్' అనినియును -

శ్రీమద్రామానుజులకు - 'శొల్లిన్ తొగై', 'అఖిల భువన జన్మ' అనునవియును -

శ్రీ సేనై ముదలియాళ్వార్లకు - 'త్వదీయ భుక్తోజ్ఝిత' అనునదియును —

శ్రీమన్నాథమునులకు - 'నమోఽచిన్త్య' అనునదియును -

అరయర్లకు - 'నమోఽఽచిన్త్య' అనునదియు అనుసంధేయములు.

నిత్యసూరులు ఆనతిచ్చిన ప్రబంధము ఒకటియు లేనందున వారు చేయు కైంకర్యములను ప్రతిపాదించు శ్లోకములను అనుసంధిం వలయును.

ఆళ్వారులు పదునొకండు మందికిని - వారి వారి తిరువవతా క్రమమున వీడో్కలు. పిమ్మట, శ్రీ మధుర కవులకు, శ్రీ భాష కారులకు, మహారాజు లగు సర్వాశ్రితులకును బహుమాన మొసంగి తదుపరి సేనాపతులకు బహుమానము చేసి, పిమ్మట లోక మర్యా ననుసరించి అందఱికిని. పిదప, సేనై ముదలియార్లకు, ముక్తు లగ ఆళ్వారులకు, వాచక కైంకర్యమునకై వీడో్కలు ప్రసాదించు ప్ర రణమున, నిత్యసూరులు చేయు కైంకర్యము ననుసరించి ఉపచారమ సల్పి, వీడో్కలు ప్రసాదింపవలయును

## కట్టియము విన్నపము చేయునపుడు అనుసంధింపవలసిన శ్లోకముల క్రమము

" శ్రీ భూమినాయక దయాపర దివ్యమూర్తే
దేవాధిదేవ జగదేక శరణ్య విష్ణో
గోపాఙ్గనా కుచ సరోరుహ భృంగరాజ
గోవిన్దరాజ! విజయీభవ కోమలాంగ! "

" దేవాధిదేవ ఫణిరాజ విహంగరాజ
రాజ త్కిరీట మణిరాజ విరాజితాంఘ్రే
రాజాధిరాజ యదురాజ కులాధిరాజ
గోవిన్దరాజ! విజయీభవ గోపచన్ద్ర! "

అరుళిచ్చాడు - తిరువడి, తిరునందాళ్వాన్.

" కాసారయోగి పరమాద్భుత భక్తిబద్ధ
వాఙ్మాల్యభూషిత మహోత్పల రమ్యపాద!
గోపాధినాథ వసుదేవకుమార కృష్ణ
గోవిన్దరాజ! విజయీభవ గోకులేన్ద్ర! "

" శ్రీ భూతయోగి పరికల్పిత దీప్యమాన
జ్ఞానప్రదీప పరిదృష్ట గుణామృతాబ్ధే!
గోగోపజాల పరిరక్షణ బద్ధ దీక్ష
గోవిన్దరాజ! విజయీభవ గోపనన్ద్య! "

" మాన్యానుభావ మహదాహ్వయయోగి దృష్ట
శ్రీ శంఖ చక్ర కమలా సహితామలాంగ!
గోపీజనప్రియ చరిత్ర విచిత్ర వేష
గోవిన్దరాజ! విజయీభవ గోపనాథ! "

అరుళిప్పాడు - పొయిగ, పూదత్త, పే యాళ్వారులు.

" శ్రీమత్త్వదీయ పదపంకజ భక్తినిష్ఠ
శ్రీ భక్తిసారముని నిశ్చిత ముఖ్యతత్త్వ!
గోపీజనార్తిహరగోపజనాన్తరంగ
గోవిన్దరాజ! విజయీభవ గోపరత్న! "

అరుళిప్పాడు - తిరుమళిశై యాళ్వార్.

" శ్రీమత్పరాంకుశమునీన్ద్ర సహస్రగాథా
సంస్తూయమాన చరణామ్బుజ సర్వశేషిన్!
గోపాలవంశ తిలకాచ్యుత పద్మనాథ
గోవిన్దరాజ! విజయీభవ గోపవేష! "

అరుళిప్పాడు - శ్రీ శఠగోపులు.

" శేషాచలే మహతి పాదప పక్షిజన్మ
త్వద్భక్తితః స్పృహయతా కులశేఖరేణ

రాజ్ఞా పునః పున రుపాసిత పాదపద్మ
గోవిన్దరాజ! విజయీభవ గో రసజ్ఞ. ”

అరుళప్పాడు - శ్రీ కులశేఖరాళ్వారులు.

“ శ్రీ విష్ణుచిత్త కృత మంగళ దివ్యసూక్తే
త న్మానసాంబురుహ కల్పిత నిత్యవాస!
గోపాలబాల యువతీ విట సార్వభౌమ
గోవిందరాజ! విజయీభవ గో వృషేన్ద్రః ”

అరుళప్పాడు - పెరియాళ్వారులు.

“ శ్రీ విష్ణుచిత్త కులనన్దన కల్పవల్లీ
గోదాలతా న్త వినివేశిత మాల్యలోల!
గోపాఙ్గనా కుచ కులాచల మధ్యసుప్త
గోవిన్దరాజ! విజయీభవ గో ధనాఢ్య! ”

అరుళప్పాడు - ఆళ్వార్ తిరుమగళానులు.

“ భక్తాంఘ్రిరేణు మునినా పరమం తదీయ
శేషత్వ మాశ్రితవతా విమలేన నిత్యమ్
ప్రాబోధకస్తుతి కృతా హ్యవబోధితశ్రీ
గోవిన్దరాజ! విజయీభవ గోపబన్ధో! ”

అరుళప్పాడు - తొండరడిప్పొడి యాళ్వారులు.

“ శ్రీ ప్రాణనాయక మహాముని గీయమాన
దివ్యానుభావ దయమాన దృగంచలాఢ్య!
సర్వాత్మ రక్షణ విచక్షణ చక్రపాణే
గోవిన్దరాజ! విజయీభవ గోపికేన్ద్ర! ”

అరుళప్పాడు - తిరుప్పాణాళ్వారులు.

" భక్తోత్తమాయ పరకాల మునీన్ద్ర నామ్నే
విశ్రాణితాతుల మహాధన మూలమన్త్ర!
పూర్ణానుకంప పురుషోత్తమ పుష్కరాక్ష
గోవిన్దరాజ! విజయీభవ గోసనాథ! "

అరుళప్పాడు - తిరుమంగై యాళ్వారులు

" సత్యోత్తరే చరమ పర్వణి సత్కచిత్తే
శాన్తే సదా మధుర పూర్వశఠ వాఙ్మనీంద్రే
నాథ ప్రసన్న హృదయాంబుజ సన్దసూనో
గోవినరాజ! విజయీభవ కున్దదన్త! "

అరుళప్పాడు - మధు కవి యాళ్వారులు

" భక్త ప్రపన్నకుల నాయక భాష్యకార
సంకల్ప కల్పతరు దివ్యఫలామలాత్మన్!
శ్రీ శేషశైల కటకాశ్రిత శేషశాయిన్
గోవినరాజ! విజయీభవ విశ్వమూర్తే! "

అరుళప్పాడు - శ్రీమద్రామానుజులు.

" దేవ ప్రసీద కరుణాకర భక్తవర్యే
సేనాపతి ప్రణిహితాఖిల లోకభార!
శ్రీవాస దివ్యనగరాధిప రాజరాజ
గోవిన్దరాజ! విజయీభవ వేదవేద్య! "

అరుళప్పాడు - సేనాపతి యాళ్వారులు.

" శ్రీమచ్ఛరారి కరుణాశ్రిత దేవగాన
పారజ్ఞ నాథముని సన్నుత పుణ్యకీర్తే!
గో బ్రాహ్మణ ప్రియ గురో శ్రితపారిజాత
గోవిందరాజ! జగతాం కురు మంగళాని. "

అరుళప్పాడు - శ్రీమన్నాథమునులు.

ఈ శ్లోకమే అరయరులకును.



# శ్రీ రామానుజ వాఙ్మయము - తద్విశేషము

'విద్యా వారిధి - మహా కవి'

**శ్రీమాన్ విక్రాల శేషాచార్యులు**

⌘

"వన్దే వేదాన్త కర్పూర చామీకర కరండకమ్
రామానుజార్య మార్యాణాం చూడామణి మహర్నిశమ్."

## శ్రీ రామానుజ విజయము

శ్రీ భగవద్రామానుజులు శ్రీ వైకుంఠమునందలి నిత్యసూరులలో నొకరగు ఆదిశేషుని యవతారము భగవన్నియమనము నొంది, అప్పుడప్పుడు వారి భృత్యులును భూమండలమునందవతరించి, దుర్మత ఖండనము సలిపి ధర్మ సంస్థాపనము గావించుచుందురు. వారొనర్చిన ధర్మ సంస్థాపనము — శ్రీ విశిష్టాద్వైత పునరుద్ధరణము, చార్వాక - జైన - బౌద్ధాది దుర్మత నిర్మూలనము.

కనుకనే వీరిని గురించి —

"పాషణ్డ ద్రుమషణ్డ దావ దహన శ్చార్వాక శైలాశనిః
బౌద్ధధ్వాంత నివాస వాసరపతి ర్జైనేభ కంఠీరవః
మాయావాది భుజంగ భంగ గరుడ స్త్రైవిద్య చూడామణిః
శ్రీరంగేశ జయధ్వజో విజయతే రామానుజోఽయం మునిః."

పాషండులనెడి వృక్ష సంఘమును (అరణ్యమును) రగుల బెట్టిన కాఱుచిచ్చువంటివారును, చార్వాకులనెడు కొండలను బ్రద్దలు చేయు వజ్రాయుధము వంటివారును, బౌద్ధులను చీకటినిం బోగొట్టు సూర్యునివంటివారును, జైనులనెడి గజములకు సింహమువంటివారును,

మాయావాదు లనెడి సర్పముల భంజింప గరుడుఁడు వంటివారును, శ్రీరంగనాథుని గెలుపు టెక్కమువంటివారును అయిన యీ రామానుజమునిని, సర్వోత్కర్షముతో చెప్పుచున్నా రని పెద్దలు స్తుతించిరి.

ఈ మహనీయులు కలి యుగము — ౪౧౧౮ పింగళ వత్సరమున, వైశాఖ శుక్ల పంచమి ( A. D. 1017 ఏప్రిల్ 4 - వ తేదీ ) నాడు, శ్రీ పెరుంబూదూరులో నవతరించి, తమ యవతారముచేత భూమండలమును భూమణవంతము గావించిరి.

" కల్యబ్దే దివ్య కుంభే బుధజన వినతే వత్సరే పింగళాఖ్యే
చైత్రే మాసే గతే చ త్రియుత దశదినే దివ్యమానే హిమాంశౌ
పంచ మ్యార్ద్రౌ సమేతే సురగురు దివసే కర్కటాఖ్యే చ లగ్నే
శ్రీమాన్ రామానుజార్య స్సమజని నిగమా దాత్మ సంరక్షణార్థమ్.[2] "

ఇది శ్రీమద్రామానుజుల యవతార (జన్మ) మును నిర్దేశించు ప్రమాణ శ్లోకము.

## శ్రీ రామానుజ వాఙ్మయ పరిశీలనము

శ్రీ భగవద్రామానుజులకు సంబంధించిన వాఙ్మయ మనంతముగ నున్నది. అది శ్రీవారిచే రచితమైనదియు, శ్రీవారి విషయముగ మహర్షులు, శిష్య భక్త బృందము చేసిన ప్రమాణ స్తుతి రూపమునైయున్నది. అట్టి ద్వివిధమైన వాఙ్మయము ఎల్లరకును అవశ్య గ్రహణీయము. కావున అయ్యది యిట దిఙ్మాత్రముగ సూచింపఁబడుచున్నది.

---

2. ఈ కాలనిర్ణయము - మా తండ్రిగా రగు 'విద్యారణ్య పంచానన - విద్యా వాచస్పతి' శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులవారిచే రచితమైన 'అళ్వారాచార్య జనన దేశకాల నిరూపణము' అను గ్రంథమునుండి గ్రహింపఁబడినది.

— వ్యాసకర్త.

శ్రీమద్రామానుజులు బ్రహ్మసూత్రము లనఁబడు వ్యాస రచితమైన వేదాంత సూత్ర గ్రంథమునకు బోధాయనవృత్తి ననుసరించి శ్రీభాష్యమును రచించిరి.[3] ఈ శ్రీభాష్యమునందలి వారొనర్చిన సర్వసమ్మత మగు శాస్త్రార్థ ప్రతిపాదనమునకు వాగ్దేవతయైన సరస్వతీదేవి మిగుల సంతసించి, శ్రీవారికి 'భాష్యకార' బిరుదమును, సువర్ణ మయ మయిన లక్ష్మీహయగ్రీవ విగ్రహమును ప్రసాదించి గౌరవించెను. వ్యాకరణ శాస్త్రములలో పతంజలి ప్రణీతమైన భాష్యము పెద్దది యగుటచే, 'వ్యాకరణ మహాభాష్యము' అని పేరొందినట్లు, శారీరక (వేదాంత) శాస్త్రములో - రామానుజ రచితమైన ఈ భాష్యము గొప్పది యైనందున, దీనిని 'శారీరక మహాభాష్యము' అని మహర్షులు వ్యవహరించిరి ఈ నామమును మొదట - సర్వకారణ కారణము, సర్వేశ్వరుఁడు నగు శ్రీమన్నారాయణుఁడే ప్రతిపాదించియున్నాఁడు. ఈ యంశము ముం దుదహరింపఁగల స్కాంద పురాణమునందలి ౫౩-వ అధ్యాయమున, వైష్ణవ సంహితలో - అం దాగస్త్య సంహితా భూతపురీ మాహాత్మ్యమునందు -

" శారీరక మహాభాష్య గ్రంథకర్తా జితేంద్రియః. "

అను శ్లోకపంక్తి వలనఁ దెలియఁగలదు. తదుపరి ఆ బ్రహ్మసూత్రములకే 'వేదాంత సారము', 'వేదాంత దీపము' అను రెండు వ్యాఖ్య

---

3. ఈ శ్రీభాష్యము జ్ఞానావలంబులైన భారతీయ విద్వాంసుల వలననేగాక, వివిధ వేదాంత క్షేత్రములలో కఠోర కృషి యొనర్చి, మహోత్తమమైన పొత్తముల పంటఁ బండించిన 'డాక్టర్: థీబో' వంటి విజ్ఞాన ప్రధానులైన దేశాంతర విద్వాంసులచే సైతము - 'రామానుజ భాష్యము వ్యాససూత్రములకు తగి యున్నది' అని ప్రశంసితమై యొప్పుచున్నది ఇట్లీ రామానుజ భాష్యమును బహుధా ప్రశంసించిన డాక్టర్: థీబో పండితుఁడు, వారణాసిలో - విక్టోరియా సంస్కృత కళాశాలాధ్యక్ష పదవి నలంకరించి, శ్రీ శంకర - రామానుజ భాష్యములను రెంటిని ఆంగ్ల భాషలో ననువదించి యున్నాఁడు.

లను సంగ్రహముగా రచించిరి. ఉపనిషత్తులలో అద్వైతులకును, విశిష్టాద్వైతులకును భేదాభిప్రాయములు గల వాక్యము లన్నింటికిని అర్థమును తేటతెల్లముగఁ దెలుపుచు, వేదార్థ సంగ్రహమును రచించిరి. ఇట్లు భగవంతుఁడు దేవ స్వరూపముతో నుపదేశించిన ఉపనిషన్మంత్రములకేగాక, భగవద్రామానుజులు లీలా మానుష స్వరూపముతో ఆ భగవంతుఁడే ఉపదేశించిన 'భగవద్గీత' యనఁబడు నుపనిషత్తులకును 'గీతాభాష్య' మను పేర నొక భాష్యమును రచించిరి. శరణాగతి వైభవమును, రంగనాథ వైభవమును, వైకుంఠ వైభవమును ప్రతిపాదించు 'గద్య త్రయము'ను విరచించిరి. మఱియు, భగవదారాధన విధాన ప్రతిపాదితమైన 'నిత్య గ్రంథము' శ్రీ రామానుజులచే విరచింపఁబడినది. ఈ గ్రంథ సప్తకమునందు నిలువు టద్దమున నీడ వలె, వేదాంత శాస్త్ర సర్వస్వము స్పష్టముగను, సమగ్రముగను గ్రహింపఁదగి యున్నది.

భగవద్రామానుజులను గుఱించి రచితమై యుండు వాఙ్మయములో - స్తోత్ర, కావ్య, నాటకాత్మకములైన గ్రంథములు, పురాణములు మొదలు నేఁటి దనుక వెలువడినవి పరశ్శతములు కలవు. వానిలో - ధాటీ పంచకము, యతిరాజ వింశతి, యతిరాజ సప్తతి మున్నగు కొన్ని గ్రంథములు మాత్రము సూర్యాలోక భాగ్యమును పొంది, కడమవి అధిక సంఖ్యాకములు విద్వాంసులను సైతము తమ విషయములో - 'న హి సర్వ స్సర్వం జానాతి' యను నుడికి గుఱి గావించునవిగ నున్నవి. ఇట్లు సూర్యాలోకము నొందని గ్రంథములం దనేకములు కడు రసవంతములైనవి గలవు. రసవత్తరములైనను, ఇంది రాభ్యుదయము మొదలగు ననేక ప్రాచీన గ్రంథ రత్నములు సాగర గర్భంబున ముక్తాఫలరాసులవలె సూర్యాలోక భాగ్యము నొందక, మూల మూలల నణగి యుండునవి కొన్ని కలవు.

ఇందువలన, శ్రీ రామానుజ సిద్ధాంతానుయాయులకు - శ్రీమ ద్రామానుజులను గురించిన వివిధ రూపమగు వాఙ్మయము నెఱుంగవలెనన్న వాంఛ గల్గుట సహజము. కావున అట్టి వారి కుపయోగార్థమై, శ్రీవారి ప్రస్తావములచేతను, చరిత్రాంశములచేతను అలంకృతములైన గ్రంథ భాగములను, శ్రీవారి విషయకములైన స్తోత్రములు, కావ్యములు నాటకములు మున్నగు వాఙ్మయ మిచ్చట దిఙ్మాత్రముగ సూచింపబడుచున్నది

శ్రీమద్రామానుజులను గురించిన వాఙ్మయము సంస్కృతములో, తెలుంగులో, అరవములో విశేషముగ నున్నది. అందు ముందు - బృందారక భాషలో శ్రీ రామానుజులవారి యవతారమును, వారి పూర్వావతారములను, ఆ యా యవతారములలో నిర్వహించిన కృత్యములను మొట్ట మొదట వేదమే వివరించియున్నది.

## వేదములలో రామానుజ ప్రశంస

వేదములలోం జేరిన యుపనిషత్తులలో - అష్టోత్తర శతోపనిషత్తులు (౧౦౮) కలవు కదా! వానిలో కృష్ణోపనిషత్తు రెండవ ఖండమున —

"శేషోహ వై వాసుదేవాత్ సంకర్షణో నామ జీవ ఆసీత్. సోఽకామయత ప్రజాః సృజేయేతి. తతః ప్రద్యుమ్న సంజ్ఞక ఆసీత్. తస్మాత్ అహంకార నామాఽనిరుద్ధో హిరణ్యగర్భో అజాయత. తస్మాత్ దశ ప్రజాపతయో మరీచ్యాదయః స్థాణు దక్ష కర్దమ ప్రియవ్రతోత్తానపాదపాయవో వ్యజాయన్త. తేభ్యః సర్వాణి భూతాని చ తస్మాచ్చేషా దేవ సర్వాణి చ భూతాని సముపద్యన్తే. తస్మిన్నేవ ప్రలీయన్తే స ఏవ బహుధా జాయమానః సర్వాన్పరిపాతి. స ఏవ కాద్రవేయో వ్యాకరణ జ్యోతిషాది శాస్త్రాణి నిర్మమాణో బహుభి ర్మముక్షుభి రుపాస్యమానో ఽఖిలాం భావమేకస్మిన్ శీర్షి సిద్ధార్థవ ద్ధ్రియమాణః సర్వైర్మునిభిః సంప్రార్థ్యమానః ప్ర శిఖసహ

రాజి మేరోః శిరోభి రావార్యమాణో మహా వాయ్వహంకారం నిరాచకార. స ఏవ భగవాన్ భగవంతం బహుధా విప్రీయమాణః అఖిలేన స్వేన రూపేణ యుగే యుగే తేనైవ జాయమానః స ఏవ సౌమిత్రే రైక్ష్వాకః సర్వాణి ధానుష శాస్త్రాణి బహుధా వి ప్రీయమాణో • శాంపే సర్వాణి విసిష్టం శ్చాతుర్వర్ణ్య ధర్మాన్ ప్రవర్తయామాస. స ఏవ భగవాన్ సన్నికాలే శారదాభ్ర సన్నిభాశో రౌహిణేయో వాసుదేవః సర్వాణి గదా ద్యాయుధ శాస్త్రాణి వ్యాచక్షాణో నైకాన్ రాజన్య మణ్డలా న్నిరాచికీర్షుః భూభార మఖిలం నిచఖాన. స ఏవ భగవాన్ యుగే యుగే తురీయేఽపి బ్రహ్మకులే జాయమానః సర్వా ఉపనిషదః ఉద్దిధీర్షుః సర్వాణి ధర్మ శాస్త్రాణి విస్తారయిష్ణుః సర్వా నపి జనాన్ సంతారయిష్ణుః సర్వా నపి వైష్ణవాన్ ధర్మాన్ విజృంభయన్, సర్వానపి పాషణ్డాన్ నిచఖాన. స ఏవ జగద న్తర్యామీ. స ఏవ సర్వాత్మకః. స ఏవ ముముక్షిభి ర్ధ్యేయః. స ఏవ మోక్షప్రదః. ఏవం స్మృత్వా సర్వేభ్యో పాప్మభ్యో ముచ్యేత త న్నామ సంకీర్తయన్ విష్ణు సాయుజ్యం గచ్ఛతి. త దేతత్ దివా అధీయానః రాత్రి కృతం పాపం నాశయతి. నక్త మధీయానో దివసకృతం పాపం నాశయతి. త దేత ద్వేదానాం రహస్యః త దేత దుపనిషదాం రహస్యం, ఏత దధీయమానః సర్వక్రతుఫలం లభతే, య ఏవం వేద దేహబన్ధా ద్విముచ్యతే ఇత్యుపనిషత్' - ఇతి ద్వితీయః ఖండః.4"

పైఁ బేర్కొనబడిన ఉపనిష ద్వాక్యములకు పూర్తిగా నిట తాత్పర్యము వ్రాయుట గ్రంథ విస్తర మగును. కావున, ప్రకృతాంశమును ప్రస్ఫుటింపఁజేయు పంక్తులకు మాత్రమే తాత్పర్య మిప్పట్టున వ్రాయఁబడుచున్నది :-

" .. క్రద్రూపుత్రుఁడైన ఆ యాదిశేషుఁడే, వ్యాకరణము, జ్యోతిషము మున్నగు శాస్త్రములను నిర్మించుచున్నఁవాడై పలువురు

4 ఈ కృష్ణోపనిషత్తు - అడయార్ పుస్తకాలయాధ్యక్షులైన శ్రీ అ. మహాదేవశాస్త్రివారు సంపాదకులుగ, ఉపనిషద్బ్రహ్మయోగి ప్రణీత వ్యాఖ్యలతోటి, అడయార్ పుస్తకాలయార్థము 1923లో ప్రచురించిన అష్టోత్తర శతోపనిష ద్గ్రంథ సంపుటములో - 'వైష్ణవోపనిషదః' అను సంపుటమున ౨౯ - ౩౦ - ౩౧ పుటలలో చూడ వగును.

మోక్షకాములచేత నుపాసింపఁబడుచు, సిద్ధించిన కార్యములు గల వాఁడై, సమస్త మహీ మండలమును నొక్క పడగ మీఁదఁ దాల్చుచున్నవాఁడై, అందఱు మహా మునులచేతనుఁ బ్రార్థింపఁబడుచున్నవాఁడై, వాయుదేవుని యొక్క గొప్పది యైన పొగరును నిరాకరించెను షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైన ఆ యాదిశేషుఁడే, షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైన శ్రీ మహావిష్ణుదేవుని అధికముగ సంతసింపఁ జేయుచున్నవాఁడై, సమస్తమయిన తన స్వరూపముతో - ప్రతి యుగమునందు ఆయనతోడ నవతరించుచు, ఇక్ష్వాకు మహారాజవంశమునం దుద్భవించినవాఁడై, సుమిత్రా పుత్రుఁడై, సకలము లయిన ధను ర్విద్యలను, అస్త్ర శాస్త్రములను పలు రకములఁ బ్రీతి చెందించుచు, సమస్త దానవులను దునుముచు, నాలుగు కొలములవారి ధర్మ (అనుష్ఠాన) ములను ప్రవర్తింపచేసెను. ఆ భగవంతుఁడే ద్వాపర యుగ - కలియుగ సంధికాలమునందలి మొగుళ్ళతో సమానుఁ డయిన (తెల్లనివాఁడయిన) రోహిణీ తనయుఁడు వసుదేవ నందనుఁడునై, గద మున్నగాఁ గల సమస్తములైన ఆయుధ శాస్త్రములను మిక్కిలి చెప్పుచున్నవాఁడయి, పెక్కండ్రైన రాజకుమారుల గుంపును కూల్చుచున్నవాఁడై, సమస్తమైన భూమియొక్క బరువును పోనాడెను. భగవంతుఁడైన ఆ యాదశేషుఁడే, నాల్గవ యుగమైన కలియుగమునందు - బ్రాహ్మణ వర్ణమునఁ బుట్టుచున్నవాఁడై, సమస్త జనులను తరింపఁజేయఁ గోరినవాఁడై, వైష్ణవ ధర్మముల నన్నిఁటిని యభివృద్ధి పఱచుచున్నవాఁడై, పాషండ మతములవారి నందఱను పరిమార్చి వేసెను". 'స ఏవ మోక్ష ప్రదః' (ఆయనయే మోక్ష మొసంగువాఁడు.) అనుటచేత, 'సర్వ సంశయ విచ్ఛేత్రి - విష్ణులోక ప్రదాయకః' అని ఆంధ్రపూర్ణ రచిత - శ్రీ రామానుజాష్టోత్తర శత నామస్తోత్ర మందలి విశేషణము ధ్యేయము ఈ మంత్ర భాగము.

## ధర్మ శాస్త్రములలో రామానుజ ప్రశంస

హారీత స్మృతిలో :-

"బ్రహ్మన్ కలియుగే ప్రాప్తే ధర్మే నష్టే శ్రుతీరితే
మద్భక్త స్సర్వ ధర్మజ్ఞ స్తవ గోత్ర సముద్భవః
శారీరక మహాభాష్య గ్రంథకర్తా జితేంద్రియః
తస్య సంబంధిన శ్శిష్యా స్సురాణా మతి దుర్గమామ్
మహా ప్రాప్యైవ తే సర్వే గమిష్యన్తి పరాంగతిమ్
ఏవం భగవతే నోక్తం తం హారీత స్మృతావపి."

ఓ బ్రహ్మా! కలియుగమున ధర్మము క్షీణింపఁగా నా భక్తుడు, సర్వ ధర్మముల నెఱింగినవాఁడు - బ్రాహ్మణ కులమునఁ బుట్టి జితేంద్రియుఁడై, శారీరక మహా భాష్యమును రచించి, ఆయనకు సంబంధించిన శిష్యు లెల్లరును దేవతలకుగూడ దుర్లభమైన నా కటాక్షమున పరమ పదమును పొందఁగలరు' అని, భగవానుఁడు పలికెను.

## పురాణములలో రామానుజ ప్రశంస

తొట్ట తొలుత వ్యాస మహర్షి - మహా పురాణములుగా ప్రసిద్ధి గాంచిన బ్రహ్మాండ పురాణమునందును, బ్రహ్మవైవర్త పురాణమునందును, పద్మ పురాణమునందును, స్కాంద పురాణమునందును, భవిష్య పురాణమునందును, నారద పురాణమునందును శ్రీ రామానుజ ప్రభావమును తెలిపియున్నారు. (ఉప పురాణ కర్తలు భార్గవాది పురాణములందును శ్రీ రామానుజ ప్రశస్తిని తెలిపియున్నారు.)

౧. బ్రహ్మకైవర్త పురాణములోని మంగళాద్రిక్షేత్ర మాహాత్మ్య ఖండమునందలి 29- వ అధ్యాయములో -

"అనంత గరుడాదీనాం సూరీణాం నిత్య యోగినామ్
అంశోద్భూతా మహాభాగా జాయంతే హి మదాజ్ఞయా
కాసారో భూతయోగీ చ మహదాఖ్యః కృతే యుగే
విష్ణుచిత్తో భక్తిసార స్త్రేతాయాం కులశేఖరః
భక్తాంఘ్రిరేణు ర్ద్వాపరే మునివాహః పరాంతకః
పరాంకుశ కవి ర్మిశ్రః కలౌ రామానుజో మునిః
ఏతే చాన్యే నిత్యసూరా మద్భక్తా స్సంగ వర్జితాః."

౨. పాద్మ పురాణమునందు ఇవే శ్లోకములు ఇంచుక మార్పుతో నున్నవి. ఈ రెండు పురాణ ప్రమాణములకు అర్థ మొక్కటియే. ఆ శ్లోకము లివి :-

"అనంత గరుడాదీనాం సూరీణాం నిత్య యోగినామ్
అంశోద్భవా మహా భాగా జాయన్తే హి మదాజ్ఞయా
కాసారో భూతయోగీ చ మహదాఖ్యః కృతేయుగే
విష్ణుచిత్తో భక్తిసార స్త్రేతాయాం కులశేఖరః
భక్తాంఘ్రిరేణు ర్ద్వాపరే మునివాహః పరాంతకః
పరాంకుశః కవి ర్మిశ్రః కలౌ రామానుజో మునిః[5]."

నా యనుజ్ఞచే నిత్యయోగులైన అనంతుఁడు, గరుడుఁడు మొదలుగాఁ గల వారియొక్క యంశములతో మహాభాగు లవతరింపఁ గలరు. వారు కృత యుగమున కాసార యోగి, భూత యోగి, మహా యోగులు; త్రేతాయుగమున విష్ణుచిత్త, భక్తిసార, కులశేఖరులు; ద్వాపరమున భక్తాంఘ్రిరేణు, మునివాహన, పరకాలురు; కలియుగమున పరాంకుశ, రామానుజులు అవతరింతు' రని ఆ శ్లోకముల తాత్పర్యము.

3. బ్రహ్మాండ పురాణ ప్రసిద్ధమగు బదరికాశ్రమ మాహాత్మ్యములో —

5. ఇది ఆచార్యసూక్తిముక్తావళిలోని పాఠము. మంగళాద్రిక్షేత్ర మాహాత్మ్యములో - 'ద్వాపరే' అని యున్నది.

"మన్నియోగా ద్భూతపుర్యా మహినా మీశ్వరః కలౌ
శ్రీరామానుజ రూపేణ జనిష్యతి సతాం ముదే
విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదన తత్పరం
భాష్యం నిర్మాతి వేదాంతసూత్రాణా మర్థ తత్త్వవిత్."

ఆదిశేషుఁడు కలి యుగములో భూతపురియందు సత్పురుషుల సంతోషము కొఱకు శ్రీ రామానుజ రూపమున నవతరించును. ఆ మహాత్ముఁడు వేదాంత సూత్రార్థ తత్త్వము చక్కగా నెఱింగిన వాఁడై, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదన పరమైన భాష్యమును నిర్మించు నని తెలుపఁబడినది.

౪. భవిష్య పురాణమునందును శ్రీ రామానుజ ప్రశంస 3 - వ ప్రతిసర్గ పర్వమున ౪ - వ ఖండములో ౨౧ - వ అధ్యాయమం దిట్లు పేర్కొనఁబడినది :-

"తోతారణ్యం చ సంప్రాప్త స్తదా రామానుజో మునిః
ఊర్ధ్వరేఖా ద్వయో ర్మధ్యే సూక్ష్మరేఖా చ పీతికా
లలాటే తు తథా కంఠే మాలా తులసికా తథా."[6]

అప్పుడు రామానుజుఁడు సుఖము గలవాఁడై, తోతారణ్యమునుఁ గూడ చేరెను. ముఖమునందు రెండు నిలువ గీతల నడుమ పచ్చని సూక్ష్మ రేఖయు, కంఠమునందు తులసి మాలయు ధరింపఁబడినవి."

6. ఈ శ్లోకములను మాతండ్రిగా రొక యుపన్యాసమునందు ప్రమాణముగా యెత్తి వ్రాసి యున్నారు. అర్థము చూడ నివి కథామాధుర్య ప్రతిపాదకములుగ నున్నవి. కాని, అంతకు ముందును, వెనుకను శ్రీ రామానుజ చరిత్రము ఆ యధ్యాయ మంతయు - లేక, ఇంకను కొన్ని యధ్యాయములలోనో ప్రతిపాదితమై యుండునని తెలియ నగును.

— వ్యాసకర్త.

౫. నారదీయ పురాణము ందలి యాదవగిరి మాహ
ప్రథమాధ్యాయములో నారాయణుడు మహర్షులతో
తెలిపెను :-

"తత్ర శేష శ్చ తనుతే శేషవృత్తిం యుగే యుగే
అశేష శేషిణే మహ్యం శేషాశనముఖై స్సహ
అనంతః ప్రథమం రూపం లక్ష్మణ శ్చ తతః పరం
బలభద్ర స్తృతీయ శ్చ కలౌ కశ్చి ద్భవిష్యతి."[7]

అచ్చటనే ౧౧ - వ అధ్యాయమున నారదుడు మహ

"విశేషాణాపి రూపేఽ సేవతే చ కృతే యుగే
లక్ష్మణాకృతి మాస్థాయ త్రేతాయా మప్యసేవత
సంకర్షణ స్తు భగవాన్ నిషేవే ద్వాపరత్యయే
సేవిష్యతే కలౌ చైవ తత్ర శేష శ్రియఃపతిమ్."

ఆ యాదవాచలమునందు ఆదిశేషుడు ప్ర
నందును గరుడుడు మొదలైనవారితో నాకు కైంకర్యమ
ఆయన తొలి రూపము అనంతుడు.[8] ఆ వెనుక లక్ష్మణుం
వాడు బలరాముడు. కలి యుగమునం దొకా నొకండు
నని నారాయణుడు మునులకు చెప్పుచున్నాడు. మఱి
అన్ని కృత యుగములందును స్వస్వరూపముతో అనం
రూపముతో విశేషముగ నన్ను సేవించును. త్రేతా యు
ణాకృతి దాల్చి సేవించెను. ద్వాపర యుగాంతమున

7 'త్రేతాయాం లక్ష్మణ స్తదా' 'ద్వాపరే బలభద్రస్తు', అని ఆచార్యసూ పారము. భజయతిరాజు స్తోత్రము 2 - శ్లోక తాత్పర్యములో - నాల్గవ పాదమున 'కలౌ రామానుజోఽభవత్' అని యున్నది.

8. అనంతుఁ డనగా - ఆదిశేషుడు.

దైన సంకర్షణుఁడై[9] సేవించెను. కలి యుగమునందును సేవించగలఁడు' అని మహర్షులకు నారదుఁడు తెలిపి యున్నాఁడు.

౬. స్కాంద పురాణము స్కందాగస్త్య సంవాద రూపమైన శ్రీ భూతపురీ మాహాత్మ్యము ౩ వ అధ్యాయములో నారాయణుఁడు హారీతుని తపంబునకు మెచ్చి, ప్రత్యక్షమై కట్లనును :—

"మదంశో యో మహా వీర్య శ్శేషాఖ్యో ధరణీధరః
జగతా ముపకారాయ తవ వంశే భవిష్యతి."

గొప్ప వీర్యముగలవాఁడు, పుడమిని దాల్చువాఁడును నైన శేషుఁ డను పేరు గల యే నా యంశ గలదో - అట్టి నా యంశ యైన శేషుఁడు లోకముల మేలుకై నీ వంశమున జనింపఁగలఁడు.'

౭. స్కాంద పురాణమునందే, ౨౩ వ అధ్యాయమున వైష్ణవ సంహితలో - స్కందాగస్త్య సంవాదమున భూతపురీ మాహాత్మ్యములో —

"బ్రహ్మర్షే ! త్వం సమాసాద్య స్మృతిం సాత్త్విక సేవితాం
భవ్యాం కురు మహాప్రాజ్ఞ స్తవ గోత్ర సముద్భవః
శారీరక మహాభాష్య గ్రంథకర్తా జితేంద్రియః
వేదాంత విత్తమః కశ్చి స్మస్కరీ బ్రాహ్మణోత్తమః
తేన త్వయా కృతా వస్య స్మృతి సాత్త్విక గామినీ
ప్రతిష్ఠాం పరమాం కీర్తిం గమిష్యతి మహీతలే
తస్య సంబంధిన శ్శిష్యా స్సురాణా మపి దుర్లభః
మాం ప్రాప్య ప్రాప్త నిర్వాణా భవిష్యతి కలౌ యుగే."

ఓ బ్రహ్మర్షీ ! నీవు సాత్త్వికి సేవితమైన స్మృతిని రచింపుము. నీ వంశమునందు జనించినవాఁడు శారీరక మహాభాష్య గ్రంథమును

9. సంకర్షణుఁ డనఁగా - బలరాముడు.

రచించినవాడు — వేదాంతమును చక్కగా నెఱింగినవాఁడు - బ్రాహ్మ ణోత్తముఁడు నైన యతి - ఈ భూత పురియం దవతరించగలఁడు. నీ యొనర్చిన సాత్త్వికమైన స్మృతి ఆయనచే కడు ప్రతిష్ఠ పొందఁగల దని చెప్పఁబడినది.

ర. బ్రహ్మాండ పురాణము తీర్థ ఖండమునందు భృగు నారద సంవాదాత్మక శ్రీ వేంకటాచల మాహాత్మ్యములో 11 వ అధ్యాయ మందు -

శ్రీ వేంకటాచలపతి - తన కత్యంత భక్తుఁడైన చక్రవర్తి యను చోళరాజ కుమారునికి 'సింహాదుఁ' డను ప్రబలుడైన రాక్షసునితో జరిగిన పోరునందు తనకు మారుగా తన పంచాయుధముల నొసంగ, వానితో నా రాజు ఆ యసురుని బరిమార్చి తిరిగి వచ్చి, ఆయుధ ములఁ బరిగ్రహింప వేడఁగా, భగవంతుఁడు గైకొనక, ఆ రాజ పుత్రునితోడను, ఆ యాయుధములతోను ఇట్లు పలికెను :-

"రాజ న్యదేచ్ఛసి జయ మజయ్యః సాంపరాయకే
త దేమా న్యాయుధా న్యుచ్చై స్సాహాయ్యం కుర్వతాం తవ
హే శంఖ చక్ర శార్ఙ్గాఽసే కౌమోదకి మహాగదే
రాజ్ఞోఽస్య కామదాః కాలే స్వస్వ తీర్థేషు తిష్ఠత
మానసామే స్త సద్యోఽహం ప్రత్యక్ష విగతాయుధః
కంచి త్కాలం వసిష్యామి తతః కేనాఽపి హేతునా
కలౌ కశ్చి న్మహాభాగ శ్శంఖచక్రే తు కృత్రిమే
కారయిత్వా స్థాపయితా విమానాదీం శ్చ మే పునః
తత స్తద్భక్తి వశగ స్సర్వ ప్రత్యక్ష గోచరః
ఆకల్పం నివసిష్యామి వరాభయద హస్తదః
ఊర్ధ్వాభ్యా మపి చాఽన్యాభ్యాం హస్తాభ్యా మతిసుందరే
దధాన శ్శంఖ చక్రేణ కల్పితే లోకతుష్టయే."

ఓ రాజా! (చక్రవర్తీ!) మానవులకు జయింప శక్యము కాని యుద్ధమునందు నీ వెప్పుడు జయము గోరుదువో, అప్పుడీ యాయుధములు నీకు గొప్ప సాహాయ్యము సేయుఁగాత! ఓ శంఖమా! ఓ చక్రమా! ఓ శార్ఙ్గమా! ఓ ఖడ్గమా! ఓ కౌమోదకీ! సమయము వచ్చినప్పుడు ఈ రాజుకు కామితములఁ జేకూర్చినవారై, మీ మీ తీర్థములందు నివసించుఁడు. మీ రిప్పుడు నా హృదయమున నుండుఁడు. నేను కొంత కాలము ప్రత్యక్షముగా విగతాయుధుఁడనై యుందును. తరువాత, కలియుగమునందొక కారణముచేత ఒకానొక మహాభాగుఁడు కృత్రిమములైన శంఖ చక్రములను చేయించి స్థాపించును. నాకు విమానాదులనుగూడ క్రమ్మఱ జేయించును. అది మొదలు ఆయన భక్తికి లోనైన వాఁడనై, నేను లోకానందముకొఱకు ఆయన చేయించి స్థాపించిన మిక్కిలి సుందరములైన శంఖ చక్రములను ఊర్ధ్వ హస్తములతో ధరించి, క్రిందను రెండు హస్తములతో, వరద అభయ ముద్రలం దాల్చి, సర్వ జనులకు గోచరుండనై, కలికాలమున వసించెదను."

ఇత్యాదిగను శ్రీ రామానుజ ప్రశంస విలసిల్లుచున్నది. ఈ నారద స్కాంద బ్రహ్మాండ పురాణ శ్లోకములలో నామ గ్రహణ మొనర్పఁబడకున్నను, ఆ చర్యలు ఈ యాచార్యవర్యుల వలననే నిర్వహింపఁబడుటచేతను, ముఖ్యముగా - 'అనుక్త మన్యతో గ్రాహ్య, మనెడి న్యాయముచే' పూర్వోక్త విశేష వచన ప్రామాణ్యముచేతను ఇచ్చట అర్థ భూతులు శ్రీ రామానుజులే యని పండితు లెఱింగిరి.

ఇట్లు శ్రీ భగవద్రామానుజులు బ్రహ్మాండ పురాణమునందును, బ్రహ్మవైవర్త పురాణమునందును, భవిష్య పురాణమునందును, స్కాంద పురాణమునందును, నారద పురాణమునందును, పాద్మ పురాణమునందును ప్రశంసితులై యొప్పిరి ఇందు - బ్రహ్మాండ

పురాణమునుండి రెండు తావులను, స్కాంద పురాణమునుండి రెండు తావులను ప్రమాణము లుల్లేఖింపఁబడినవి. అందుకు కారణము - ఒకటి -: మహా పురాణములలోనిది; రెండవది :- ఉప పురాణముల లోనిది యగుట. ఇంకయును, ఉప పురాణములలో నొకటి యగు భార్గవ పురాణములో - ఉత్తర ఖండమున, ఈ రామానుజ వృత్తాంతము 38, 39, 32, 30 అధ్యాయములలో మఱికొంత విస్తారముగఁ బ్రతిపాదితమై యున్నది.

నర నారాయణ సంవాదాత్మకమైన భార్గవ పురాణమునందలి ఉత్తర ఖండములో —

"సర్వేషాం సూరిణాం జన్మ కథ్యతే భూతలే త్వయా
శేషస్య శేషభూతస్య రూపభేదైర్ధరే స్సదా
కథ్యతే నాఽవతారస్తు నారాయణ మునీశ్వర !
ఇతి బ్రువతి దేవేశో నరో నారాయణో మునిః
కథా మేతాం ప్రవక్తుం మే సంతోషో జాయతే మహాన్
శ్రుణుష్వ సావధానేన వక్ష్యే పుణ్యకథా మిమాం
ద్రావిడే విషయే దివ్యే సర్వభూత మనోహరే
పుణ్యే పృథుతలే రమ్యే కాంచ్యా మనతి దూరగే
మహా సూర్యాన్వయే పుణ్యే కేశవస్య ద్విజన్మనః
వైష్ణవ స్యాభవ త్పుత్రోఽనంతాంశోఽనంత తేజసా
చైత్రే మాసే శుభార్ద్రాయాం శుభ లగ్నే శుభే దినే
తస్య రామానుజ ఇతి పితా నామాఽకరో న్ముదా."

నరుఁడు నారాయణుని ఇట్లడుగుచున్నాఁడు :- " ఓ నారాయణ మహర్షి ! నీ వలన భూ లోకములో సమస్త సూరు లవతరించి నట్లు చెప్పితివి. కాని, నారాయణుఁడవైన నీవు శేషభూతుఁ డగు ఆది శేషుని యవతార వైభవమును ఎన్నఁడు చెప్పియుండలేదు. ఈ

నరుని ప్రశ్నను నారాయణ మహర్షి, ఆదిశేషుని యవతార వైభవమును ప్రత్యుత్తరముగా నిట్లు చెప్పుచున్నాడు :-

"ఓ నరుఁడా! ఈ చరిత్రను నీకు చెప్పుటకై నాకు చాల సంతోషము గలుగుచున్నది. ఈ పుణ్య కథను చెప్పుచున్నాను. ఏకాగ్ర చిత్తుండవై వినుము. సకల జన చిత్తరంజకము - దివ్యము - పుణ్యము నైన ద్రవిడ దేశమున, కాంచీ పురమున కనతి దూరములో - పుణ్యమైన ఆసూరి వంశమున, కేశవాచార్యుఁ డను విష్ణు భక్తుఁడైన బ్రాహ్మణునకు, ఆదిశేషుని యంశము గల కుమారుడు మహా తేజముతో - చైత్ర మాసమున, ఆర్ద్రా నక్షత్ర శుభలగ్నమందు అవతరించెను తండ్రి సంతసముతో ఆ సుతునకు రామానుజుఁ డని పేరిడెను."

ఇత్యాదిగ ఈ కథ యిందు సవిస్తరముగాఁ జెప్పఁబడినది.

౩౮ - వ అధ్యాయములో - శ్రీరామానుజుల ఉపనయనము, వివాహము, విద్యా వ్యాసంగము, యాదవ ప్రకాశునివద్ద వేదాంత శాస్త్రాధ్యయనము, చోళరాజ పుత్రిక నావేశించిన బ్రహ్మరాక్షసుని మోక్షము వర్ణింపబడినవి.

౩౯ - అధ్యాయము లో - మహాపూర్ణులనుండి యామునాచార్య నిక్షిప్తములైన సకల రహస్యములను గ్రహించిన కథ అభివర్ణితము

౪౦ - వ అధ్యాయములో - శ్రీ వరదరాజస్వామి సన్నిధిని సన్న్యాస స్వీకారము, దాశరథి (ముదలియాండాన్) శ్రీవత్సచిహ్న మిశ్రులు (కూరత్తాళ్వార్) మున్నగువారు శ్రీరామానుజుల నాశ్రయించుట, పూర్వోక్త యద్వైతియైన యాదవప్రకాశుఁడును తుదకు

శ్రీ రామానుజుల నాశ్రయించి, శ్రీవైష్ణవుఁ డగుట, శ్రీ రామానుజులకు శ్రీరంగనాథుఁడు ఉభయ విభూతులపై ఆధిపత్య మొసంగుట, శాస్త్ర ప్రసంగములతో శారదా దేవిని సంతుష్టి గావించుట అను వృత్తాంతములు వివరింపఁబడినవి.

32, 33 అధ్యాయములలో - శ్రీ రామానుజుల భూప్రదక్షిణములు, వివిధ భగవదాలయముల వీక్షణములు, సర్వ దుర్మత నిర్మూలనము, శ్రీశైలపూర్ణుల సన్నిధియందు శ్రీమద్రామాయణ సంప్రదాయార్థముల నధిగమించుటలు వర్ణింపబడినవి. మఱియు, 33 - వ అధ్యాయాంతమున శ్రీ రామానుజులు అచ్చటచ్చట నుండు సమస్త విష్ణుమూర్తులను సేవించి, సర్వ మతములను జయించి, విష్ణు మతమును స్థాపించె ననియు, వారు నిండు దయకు నీరధివంటి వారు గనుక, సర్వజనులందును వాత్సల్యము గలిగి, వేద శాస్త్రములను వీడి అనేక పాషండుల కుయుక్తులతోఁ గల్పించిన ఆసుర శాస్త్రములతో సంకులమై నశించిన విష్ణుమయ మగు లోకము నుద్ధరించుటకై, రామానుజముని ఉత్తమమైన శ్రీభాష్యమును రచించి, పాషండ మతముల నన్నింటిని ఖండించి, నారాయణునకు ప్రియమును, మహత్తరమునైన వ్యాస మహర్షి మతమును విశ్వవ్యాప్తము చేసె ననియు, వేదాంత భాష్య కర్తయైన శ్రీ రామానుజ యోగికి సంబంధించిన ఈ చరిత్రమును ఎవ్వండు చదువునో, వినునో - అతఁడు ఉత్తమమైన భగవద్భక్తిని, సంపదను, బ్రహ్మ రుద్రార్చితమైన విష్ణువుయొక్క పదమునుఁ బొందు ననియు చెప్పఁబడి యున్నది. పారాశర్య పురాణమునందు నాలుగు శ్లోకములతో శ్రీ రామానుజుల యవతారమునకు సంబంధించిన ప్రసక్తి కలదు. కనుక, శ్రీ భగవద్రామానుజులు ఆఱు మహా పురాణములందును, నాలుగు ఉప పురాణములందును - మొత్తము పది పురాణములలో పురాణ కర్తృమహర్షి ప్రశంసను గాంచిరి.

ఇట్లు శ్రీ రామానుజ ప్రసక్తిని పురాణములనుండి నిరూపణఁ జేయఁగా, ఆధునికులు కొందఱు ద్వాపర యుగాంతమున రచితము అగు పురాణములలో - కలియుగమున 4119 సంవత్సరములకు అనఁగా- పురాణములు పుట్టిన 4119 సంవత్సరముల వెనుక సవతరించినవారి విషయ మెట్లుచెప్పఁబడె నని ఆశంకింతురు. కాని, పురాణములయందు కొంత భవిష్య స్మహా వృత్తాంతములను మహర్షులు యోగ దృష్టితో గ్రహించి, (ముందుగనే పురాణముల) చెప్పఁగల రను విషయములను ముఖ్యముగా గుర్తించవలఁ ను. అనఁగా - పురాణ రచన నాటికి జరుగని, రాఁబోవు కొందఱు మహా పురుషుల వృత్తాంతమును సంగ్రహముగాఁ జేర్కొనుట గ డు. పురాణములలో భవిష్య ద్రాజ వృత్తాంతములుగ చెప్పబడిన ఇట్టి వానిలో కొన్ని యిప్పటికి గడిచిపోయినవి. ఇంకను కొన్ని జరుగవలసి యున్నవి. ఈ రెంటికిని ఉదాహరణముఁ జూడుఁడు :-

విష్ణు పురాణము 4 - వ అంశమున 24 - వ అధ్యాయములో- కలి యుగమున 2779 సంవత్సరములు గడచిన పిమ్మట చాణక్యుని వృత్తాంతము :-

"తతశ్చ నవ చైతాన్నందాన్ కౌటిల్యో బ్రాహ్మణ స్సముద్ధరిష్యతి. ౨౬. తేషామభావే మౌర్యాః పృథివీం భోక్ష్యంతి. ౨౭. కౌటిల్య ఏవ చంద్రగుప్త ముత్పన్నం రాజ్యే ఽభిషేక్ష్యతి." ౨౮

"పిమ్మట యీ నవనందులను కౌటిల్యుఁ డను బ్రాహ్మణుఁడు నశింపఁజేయును. వారు నశించి పోఁగా, మౌర్యులు నేల నేలఁగల కౌటిల్యుఁడే తన నాశ్రయించిన చంద్రగుప్తుని రాజ్యమునం దభిషిక్తుని జేయును." ఇట్లాదిగ కౌటిల్యుఁడు నవ నందుల నున్మూలించి, చంద్ర

గుప్తు నభిషిక్తుఁ గావించుటయు సంగ్రహముగ ముందే పేర్కొనఁబడినది. ఇట్లే, అందు ౪ - వ అంశము ౨౧ - వ అధ్యాయము మొదలుకొని, ౨౪ - కల అధ్యాయాంతము వఱకు మొత్తము ౪ అధ్యాయములలో -

"శ్రీ పరాశరః - అతః పరం భవిష్యా నహం భూపాలాన్ కీర్తయిష్యామి యోఽయం సాంప్రత మవనీపతిః పరీక్షిత్తస్యాపి జనమేజయః."

"ఇంకమీఁద రాఁబోవు రాజులఁ దెలిపెదను. ఇప్పుడు భూమికి రేఁడై యుండు పరీక్షిత్తునకు జనమేజయుడు..." అని, ఆ పురాణ రచన జరుగుచున్న కాలములో భూమి నేలుచున్న పరీక్షిత్తు మొదలు కొని. ఆయన వెనుక వరుస వరుసగా, వందల - వేల యేండ్లలోఁ బుట్టిన రాజ వంశముల చరిత్రములు ప్రతిపాదితములై యున్నవి. వాటిలో - కొందఱు రాజన్యుల చరిత్రములను వారి వారి కాలములలో దాపున నుండి చూచిన విదేశీయులు, చరిత్రములు వ్రాయు వారు లిఖించి యుంచగా, అవి యిప్పుడు మన హిందూదేశ చరిత్రములలోని కెక్కి, పాఠశాలలలో జెప్పబడుచున్నవి. విష్ణు పురాణమును, హిందూదేశ చరిత్రమును రెంటినిఁ జదివిన, ఈ యంశము చక్కగా దెలియఁగలదు. ఇది - మహానుభావులైన మహర్షుల త్రికాలజ్ఞతకు ప్రబలమైన తార్కాణము.

అదియునుగాక, చంద్రగుప్తుని వంశావళి, దాని యంతము, దాని నంత మొందించిన సేనాపతి యగు పుష్యమిత్రుని వంశక్రమము చివరవాని నంత మొందించిన మంత్రి యగు కణ్వ గోత్రజుఁడు వసుదేవుడు మున్నగుఁ గలవారి వంశ వృక్షములు, ఆ యా వంశములలో నెన్ని తరములవారు భూతల మేలినదియు, ప్రతి వంశము భూమి నేలిన సంవత్సరముల సంఖ్యయు శ్రీ విష్ణు పురాణమునందు ప్రవచింపఁబడి యున్నది. విమర్శకాగ్రేసరులలో ప్రముఖులైన కొంద

రాజా వేంకట లక్ష్మణరావు పంతులు మొదలగువారు పెక్కురు ఆంగ్ల గ్రంథాది పర్యవేక్షణములో రచించిన 'హిందూ మహా యుగము' మున్నగు గ్రంథములలో - పురాణములందుఁ జెప్పఁబడిన రీతి ననుసరించియే వ్రాసి యున్నట్లు గ్రహింప నగును.

కలియుగాంతమున శ్రీ మన్నారాయణ మూర్తి కల్క్యవతార మును ధరించి యవతరించు వృత్తాంతము పురాణములలో జెప్పఁ బడుటయేగాక, ఆ యవతారమును గురించి ప్రత్యేకముగ 'కల్కి పురాణ' మను పేర నొక పురాణము రచింపఁబడినది. ఇందు పురాణ రచన నాటికి భవిష్యద్వృత్తాంతముగఁ జెప్పఁబడిన కౌటిల్య వృత్తాం తము ఈ కలియుగాంతమున జరుగవలసి యున్నది. శ్రీ రామాను జ వృత్తాంతము కూడ, పురాణ రచన నాటికి కౌటిల్యాది వృత్తాంత ముల వలె భవిష్యముగ ప్రతిపాదితమై, కలి యుగమున 4119 సంవ త్సరములకు గడచినది. ఇది ఆర్ష గ్రంథములలో నుండు శ్రీ రామా నుజులను గురించిన ఆశంకా - సమాధాన పూర్వకమైన ప్రశంస.

## భక్తుల రచనలలో రామానుజ ప్రశంస

*సంస్కృత గ్రంథములు :-*

భక్తకోటిచే రచింపఁబడిన గ్రంథములలో - శ్రీ భగవద్రామా నుజ సమకాలీనులును, గరుడవాహన పండితు లను నామాంతరము గలవారును, 'కవి వైద్య పుంగవ' బిరుదాంకితులు నగు శ్రీనివాసా చార్యులవారు రచించిన 'దివ్యసూరి చరితము' మొట్టమొదటిది. ఇది యొక మహా కావ్యము. అన్ని భాషలయందలి రామానుజ చరితా మృత ప్రతిపాదక గ్రంథములలో నిది ప్రథమ గణ్యమైనది. ఇందు - 16, 17 సర్గములలో శ్రీ రామానుజ చరిత్రము సులలితముగా

వర్ణింపఁబడినది. ఆంధ్రపూర్ణ వంశోత్తంసులైన అనంతాచార్యుల వారు రచించిన ప్రపన్నామృతములో మొదటి 62 అధ్యాయము లందును శ్రీ రామానుజ చరిత్రము వర్ణింపఁబడినది. ఆంధ్రపూర్ణ విరచిత మగు యతిరాజ వైభవమును, సురపురము వేంకటాచార్య విరచిత మగు యతిరాజ విజయ మనెడి 24 సర్గములు గల మహా కావ్యమునను శ్రీ రామానుజ చరిత్ర మభివర్ణింపఁబడినది. శ్రీ రామానుజ సుచరిత మను కావ్యము,[10] పంచబాణ విజయకర్త యగు శ్రీ రంగాచార్యులవారిచే రచింపఁబడిన శ్రీ రామానుజ చంపువు[11] - శ్రీ రామానుజ చరిత్రమును ప్రతిపాదించునవి. విక్రాల శేషాచార్య (నా) రచిత మగు శ్రీనివాస ప్రసాద మహా కావ్యము నందు 14 - వ సర్గలో - శ్రీరామానుజులు ప్రతివాదులకు వాదమునందు 'వేంకటేశ్వరుఁడు విష్ణువే' యని శాస్త్ర ప్రమాణము లతో ఋజువు పరచి, మఱల శంఖ చక్రములను చేబట్టించి, ఆ స్వామిని ప్రత్యక్షముగను, విష్ణువే యని ఋజువు చేసిన చరిత్ర మభివర్ణితము. అమ్మాళాచార్యు లను నామాంతరముగల వరదాచార్యుల వారిచే వేదాంత విలాస మను నామాంతరము గల యతిరాజ విజయ మను నాటకము రచింపఁబడినది. ఈ యెనిమిది గ్రంథములు కావ్య రూపములు. అనంతాచార్య గుంభితమైన శ్రీ వేంకటాచలేతిహాస మాలయందు శ్రీ రామానుజులు శ్రీ వేంకటాచలపతిని విష్ణువుగా ఋజువు పఱచి, ప్రతివాదులఁ బారద్రోలి, అచ్చటఁ జేసిన కట్టుబాట్లు మొదలగునవి యభివర్ణింపఁబడియున్నవి. ఇవి గద్య పద్యములు గల ఉపన్యాస గ్రంథములు. ఇఁక స్తోత్ర గ్రంథములఁ గాంచెదము.

---

10. మద్రాసు అడయార్ లైబ్రరీ సంస్కృత - ప్రాకృత భాషలలో వ్రాత పుస్తకముల జాబితా 1910 - వ సంవత్సరమున ముద్రణమైనది

11. పంచబాణ విజయభాణ ప్రస్తావనలో 12 - వ శ్లోకమున ఉదాహృతము.

యతిరాజ స్తోత్రములలో తెలియని ప్రార్థనా పంచకము (5 అనుష్టుప్ శ్లోకములు), సుక్తకములు (4 శ్లోకములు), రామానుజ సుప్రభాతము, శ్రీ రామానుజాష్టకము, శ్రీ రామానుజ చతుశ్లోకి అను మృదు మధురములైన స్తోత్రములు గలవు. ఆంధ్ర పూర్వులు శ్రీ రామానుజాష్టోత్తర శతనామస్తోత్రమును రచించిరి. శ్రీ రామానుజ సహస్ర నామము కలదు. ఇందలి విచిత్ర మేమనగా — ప్రతి నామము ముఖ మందలి ఒక్కొక్క యక్షరము నెత్తి చదువుచో — పదేసి నామములకు ఒక్కమాగువంతున, గ్రంథములో నూఱు పర్యాయము — శ్రీమతే రామానుజాయ నమః ' అని వచ్చును. శ్రీశైల అద్దంకి వేంకటాచార్య రచితమైన మఱి యొక శ్రీ భగవద్రామానుజాచార్య గురుచరణాష్టావింశతి సహస్ర నామస్తోత్రము, రామానుజ రహస్య త్రయము అనునవియును గలవు. తిరుక్కణ్ణపురం శౌరి రాజప్పెరుమాళయ్యంగారిచే రచింపఁబడిన రామానుజ చతుశ్శ్లోకీ వ్యాఖ్యాన రూపమైన మఱి యొక చతుశ్లోకియు గలదు. కర్తృ నామాంకము లేని భాష్యకార ప్రపత్తి, రామానుజ ప్రపత్తి యును నవియును కవు మణవాళ మహామునులు యతిరాజ వింశతిని, వేదాంత దేశికులు యతిరాజ సప్తతిని రచించిరి. కర్త పేరు లేని రామానుజ ప్రపత్తి యొకటి కలదు. సురపురము వేంకటాచార్యులు యతిరాజ దండకమును రచించిరి. శ్రీనివాసాచార్య లనఁబడు ఎంబారు స్వామి - శ్రీశైల కృష్ణమాచార్యులు శ్రీ రామానుజావతారాశీ వర్ణన మను పేరు గల శ్రీ రామానుజాష్టపదిని రచించిరి. వరవరముని పౌత్రులు సౌమ్యజామాతృదేశికులు యతిపతి దినచర్య రచించిరి. కర్తపేరు లేని వసంత తిలకాద్వయి యొకటి యున్నది. శ్రీనివాస వేదాంత యతీంద్ర మహాదేశిక రచితము కాఁబోలు - శ్రీ భాష్యకార మంగళాశాసనము కలదు. శ్రీనివాసకవి యతిరాజ దశకమును

నిర్మించెను. వీరరాఘవాచార్యులు రామానుజాతిమానుష స్తవమును రచించెను. నారాయణ యతిరాజ నిర్మితమైన మణి యొక్క చతుశ్శ్లోకియు, మణి యొక్క రామానుజ సుప్రభాతము, మణి యొక్క రామానుజ ప్రపత్తి, రామానుజ మంగళాశాసనము కలవు. కర్తృనామాంకములు కాని యతిరాజ ప్రార్థనా పంచకము, యతిరాజ మంగళము, యతిరాజ మంగళాశాసనము, యతీంద్ర స్తవము, యతీంద్రార్థా, రామానుజ దండకము, రామానుజ స్మృతి, రామానుజాష్టకములు కలవు. విశాల శేషాచార్య (నా) రచితములైన శ్రీ రామానుజ స్తవ రాజము, రామానుజ వేదపాద స్తోత్రములు కలవు. పురుషోద్దండ వేదాంత రంగనాథాచార్యులు భజయతిరాజ స్తోత్రమును రచించిరి. ఆంధ్రపూర్ణవంశోత్పన్నులగు మహారంగనాథాచార్యులవారు భజే భాష్యకార స్తోత్రమును రచించిరి. శ్రీ ఖన్మొడుంబ నరసింహాచార్యుల వారిచే రచితమైన శ్రీ రామానుజ స్తవము కలదు. తిరువరంగత్తమధనారుచే రచింపబడిన ఇరామానుశ నూత్తందాది యను ద్రవిడ గ్రంథమునకు ఆసూరి రామానుజాచార్యులవారు రామానుజ కారికలు రచించిరి. కావ్య నాటకము లెనిమిది. ఉపన్యాస గ్రంథము ఒక్కటి. స్తోత్రములు నలువదియైదు. వెరసి సంస్కృత గ్రంథములు యేబది నాలుగు.

*ఆంధ్ర గ్రంథములు :-*

వసుచరిత్రకృతి నందిన తిరుమలదేవరాయుని మేనల్లుఁడగు తిమ్మభూపాలునిచే రచింపఁబడిన పరమయోగివిలాస మను ప్రబంధము నందు శ్రీ రామానుజ చరిత్ర మభివర్ణింపఁబడినది. నంబూరి కేశవాచార్యరచితమగు ఆచార్యసూక్తిముక్తావళిలో భాగవతమునందు కృష్ణకథ వలె శ్రీ రామానుజ చరిత్ర మధిక భాగ మావరించి యున్నది. శేషభట్టర్ నృసింహార్యుని ప్రపన్న పదంబామృతమునందును, రామ

భద్రుని ఆచార్య విజయమునందును రామానుజ ప్రసక్తి కలదు. ఆంధ్ర శ్రీభాష్య - వేదార్థసంగ్రహాది గ్రంథకర్తలును, కావ్య రత్న - వేదాంత తీర్థ - వేదాంత వాచస్పతి బిరుదాంచితులు నగు కందాడై శేషాచార్యులు యతిరాజ వింశతికి ఆంధ్ర పద్యములను మధుర శైలిలో రచించిరి. యతిరాజ సప్తతికిని ఆంధ్ర పద్యములు రచింపఁబడినవి. మరింగంటి నారాయణాచార్యులుగారు చతురక్షరీ వివరణ చతుశ్శ్లోకికి ఆంధ్ర పద్యముల అనువాదము రచించిరి. ఇవి పద్యములు. కందాళ రాఘవాచార్యుని విష్ణుభక్తి చరిత్రమునందును శ్రీ రామానుజ ప్రసక్తి కల దని వినికి. ఇవి రెండును ద్విపద కావ్యములు. శశాంక విజయ కృతిపతి వంగల సీనయామాత్యుఁడు రామానుజ దివ్య చరిత్ర మను ప్రబంధమును రచించెను. శ్రీ కుమార ఆదివరాహాచార్యులవారు శ్రీమద్రామానుజ చరిత్ర మను పద్య కావ్యమును రచించిరి. కర్తృనామాంకితములుకాని రామాను జీయము, భాగవత చరిత్రము అను వచన కావ్యములందును శ్రీ రామానుజ చరిత్ర కలదు. సంస్కృతము నుండి అనూదితమైన దివ్యసూరి చరితము, ద్రవిడము నుండి అనూదితమైన గురుపరంపరా ప్రభావము అను వచన గ్రంథములందును శ్రీ రామానుజ చరిత్ర గలదు. పండిట్ : లక్ష్మణాచార్యుల వారి ఆళ్వారాచార్యచరిత్ర అను గ్రంథమునందును శ్రీ రామానుజ వృత్తాంతము కలదు. మఱియు, సరస్వతి రంగాచార్యులు, పెమ్మరాజు వేంకటాచలపతి యను వారలు వేర్వేఱుగా శ్రీ రామానుజ జీవితము గ్రంథముల రచించిరి. యస్. టి. వీరరాఘవాచార్యులవారు రామానుజ చారిత్రమును రచించిరి. కాట్రంబాకం కేశవాచార్యులవారి రామానుజ విజయములో — వి అప్పల నరసింహంగారి రామానుజులవారి చారిత్రములో శ్రీ రామానుజ చరిత్ర మభివర్ణింపఁబడినది. అయ్యనకోట పార్థసారథి శెట్టిగారి ప్రపన్న శిరోభూషణమునందు

శ్రీ రామానుజ విజయము పెద్దది. ఇది వచన వాఙ్మయము. ఇంక శత కాదిస్తోత్రములను పరిశీలింతము :-

ప్రౌఢ రచన గల శార్దూల విక్రీడిత పద్యములతో రామానుజ శతకము కలదు. వృత్తములతో మఱియొక రామానుజ శతకము శొంఠ లూరి తిరుమల కవిచే రచింపబడెను. 109 సీస పద్యములు గల యతి రాజ శతకము, మఱియొక యతిరాజ శతకము కలవు. హనుమ కొండయందు స్వయంవ్యక్తుడై వేంచేసియున్న స్వామిపై, తిరునగరి వేంకటాచార్యులవారు రచించిన హనుమద్గిరి యతిరాజ శతకము కలదు. సులభశైలి కంద పద్యములు గల భూతపురాధ్యక్ష శతకము, బొమ్మ రాజు నరసింహదాసుగారి యతిరాజ స్తవము కలవు. కర్తృనామాం కములుగాని రామానుజ దండకములు రెండు, యతిరాజ దండకములు రెండును గలవు. వచన గ్రంథములలో - గోపీనాథుని వేంకటకవి విర చితమగు శ్రీ రామానుజ చరిత్రము సంస్మరింపదగినది. శ్రీ భగవ ద్రామానుజ మహిమకల్పద్రుమము నామాంతరము గల శ్రీ రామానుజ చరిత్రమును నేఁబది అధ్యాయములు గల మహాగ్రంథము, శ్రీ బుక్కపట్టణం నరసింహాచార్యులవారి శ్రీ రామానుజ ప్రభావ కల్ప కము (౬౬ గుచ్ఛములు గలది.), రాజారావు రచితమగు శ్రీ రామా నుజ విజయమును ఉదయవరుల చరితమును పండితులు పఠింపదగినవి. కవిరత్న - కవిశేఖర - సుధీమణి - గుదిమెళ్ళ రామానుజాచార్యుల వారు 'యతిప్రభ' అను నాటకమున శ్రీ రామానుజ ప్రభావమును బహు రమ్యముగా వర్ణించిరి.

ఇట్లు శ్రీ భగవద్రామానుజ చరిత్రము సంబంధించిన పద్య గద్య నాటక రచనలే గాక, గేయ రచనలు గూడ అనేకములు కలవు. అద్దంకి తిరుమలాచార్యులవారు రామానుజ కీర్తనలను, వి. రాఘవా

చార్యులుగారు రామానుజ తిరునక్షత్రోత్సవ కీర్తనలను రచించిరి. నీల వీరరాఘవ దాసు శ్రీమద్రామానుజ సుచరిత్ర మను గేయమును, పూర్వోక్త కవిరత్న - గుదిమెళ్ళ రామానుజాచార్యులవారు శ్రీ యతిరాజ విజయ మను యక్షగానమును, బృందావనము లక్ష్మణా చార్యులుగారు తిరునామములు, సంగశతకరతులు రచించెను. కర్త పేరు తెలియని శ్రీమద్రామానుజ మేలుకొలుపు దశకము, శ్రీ రామానుజ విన్నపములును తెలియఁదగినవి. టి. కృష్ణమయ్యంగారు భక్తి రసమంజరియందు శ్రీ భగవద్రామానుజస్తుతి శతరత్నమాల (శ్రీ భగవద్రామానుజ గుణాభివర్ణనము) అను పాటలు రచించిరి. ఇంకను శ్రీ రామానుజ చరిత్రము హరికథలుగను, బుఱ్ఱ కథలుగను, అష్ట పదులుగను, రచితమై, సారస్వత రంగమున కొన్ని ఖ్యాతి గాంచి యొప్పుచున్నవి. శ్రీరామానుజులవారి కథా భాగీరథీ పూర మీ పగిది - కావ్య, నాటక, గేయ జగత్త్రియము నందును పూర్ణమై, సర్వజనులకు సంసేవ్యమై యశ్శీవింపఁజేయుచున్నది. ఇట్టి రామాను జీయ వాఙ్మయ మంతయు సంపుటములుగా వెలువడి, విద్వల్లోకము నానందభరితము జేయుఁగాత !

ఇట్లు శ్రీ భగవద్రామానుజులవారి జీనచర్యలు పది పురాణము లందు మహర్షులచే ప్రతిపాదితము లగుటయు, శ్రీవారి దివ్య చరిత్రము మహాకవులచే మహాకావ్యమున, చంపూకావ్య, గద్యకావ్య నాటక, స్తోత్రరూపమున రచిత మగుటయు మాత్రమే గాక, ఉపనిష ద్వ్యాఖ్యానములు (సుబాలోపనిత్తు మున్నగువానికి శ్రుతప్రకాశికా చార్యులచే రచింపఁబడినవి) భాగవతాది పురాణ వ్యాఖ్యానములు (వీర

రాఘువీయాదులు) వేదాంత గ్రంధములు (శ్రుత ప్రకాశికాదులు) స్వతంత్ర వేదాంత గ్రంథములు (బుక్కపట్టణము శ్రీనివాసాచార్యుల జ్ఞానరత్న ప్రకాశాదులు) పరిశీలించినచో - తొలుత మంగళాచరణము లందు శ్రీమద్రామానుజులు స్తుతింపబడియుండుట్లు తెలియఁగలదు. మఱియు, కూరనాథ శ్రీవత్సాంక) మిశ్రాదుల వైకుంఠస్తవాది భగవత్ స్తోత్రములయొక్కయు, రచనారంభమునందు పూర్వాచార్య, పూర్వకవుల స్తుతులతోఁబాటు, శ్రీ రామానుజుల స్తుతియు - ఒక్కొక్క శ్లోకములతోఁ గలదు. ఇట్లు గ్రంథాంతరముల నుండి యేర్చి కూర్చిన శ్రీ రామానుజ స్తుతి పరములైన శ్లోకరత్నములు రమారమి నూటయేఁబది లభించుచున్నవి. వాని నన్నింటిని, ఆకర ప్రదర్శనముతోఁబాటు, సుభాషిత రత్న భాండాగారమునందలి ప్రకరణముల వలె అనుష్టుబాది ఛందః క్రమమునఁ గూర్చి, ఒక గ్రంధ రూపమున రూపొందించవలసియున్నది. శ్రీ రామానుజుల వివిధ కవికృత స్తోత్ర గ్రంథములతో గూడ శ్రీ రామానుజ స్తోత్రజాలము శీఘ్రముగా ముద్రితమై, శ్రీరామానుజ భక్తబృందము నాన దబంధుర మొనర్పఁ గలదుగావుత !

ఇందు శ్రీరామానుజ విషయికమైన వాఙ్మయము యథావకాశముగ వివరింపఁబడినది. కాని,

"కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ."

ఈ కాలము అంతము లేనిది. పుడమియు పెద్దది కనుక, ఇంకను ఎందఱు భక్త కవులు శ్రీ రామానుజ విషయిక గ్రంథముల రచించి యున్నారో ! ఆ గ్రంథము లిచ్చటఁ బేర్కొనంబడమికి కారణము

ఎఱుంగమియేగాని, అనాదరము కాదు. మీఁద ఎన్ని రచింపఁబడగలవో! వానిని పరిశీలించు భాగ్యము తత్తత్కాలీనులకే.

పైఁ బేర్కొనబడిన సంస్కృత స్తోత్రములలోఁ గొన్నింటిని ఆనంద ప్రెస్‌వారు స్తోత్రార్ణవము 1 - వ తరంగములోను, బెంగుళూరు స్తోత్ర రత్నాకరములోను, ముద్రించి యున్నారు. మఱికొన్ని స్తోత్రములు నాల్గయిదు గ్రంథములుగా ప్రచారములో నున్నవి. భక్తి చేతను, కవితా సుధాస్వాదన తత్పరత చేతను, భక్తులకు, కవులకు స్తోత్ర గ్రంథము లవశ్య పఠనీయములని వానిని పఠించినవా రెఱుంగుదురు. కాన, శ్రీ భగవద్రామానుజ విషయకములైన స్తోత్రములు, కావ్య నాటకములు ఉభయ భాషలలో రచితములైనవి, ముద్రిత పూర్వము లైనవియు, అముద్రితములైనవియు, గ్రంథాలయముల నుండి సేకరింపఁబడి, శ్రీ భగవద్రామానుజ గ్రంథావళి వలె సంపుట సంపుటములుగా ముద్రితములై వెలువడి, విద్వజ్జన చకోరములకు అమృతశీతాయమానంబులు కావలెనని, అస్మదాదుల యాకాంక్ష.

ఆంధ్ర గీర్వాణ భాషలలోఁ గల శ్రీ రామానుజ వాఙ్మయమే ఇందు దుల్లేఖింపఁబడినది. ఇట్లే, వివిధ భాషలలో ఈ వాఙ్మయము విశ్వమున ప్రసరించి యున్నది. అది యంతయు ఆంధ్రీకృతమై వెలువడుట అత్యంతము ప్రయోజనకరము.

ఇందు - శ్రీ భగవద్రామానుజుల ను గుఱించి విద్వన్నిర్మితములైన వివిధ గ్రంథజాలము - అమర భాషలో నిర, ఆంధ్ర భాషలో

౨౨. వెరశి ౧౦౨. ఇట్లు శతాధికములైన ఈ సంస్కృతాంధ్ర గ్రంథములే గాక, పురాణ ప్రశంసలు కూడ అసంఖ్యాకముగా నున్నవి.

ఇంకను ఈ రామానుజ కీర్తి కౌముదీ మూలమున, శ్రీ భగవద్రామానుజులను గుఱించి, కవి కోవిద విరచితములైన వ్యాస, రత్నావళీ, తారావళీ, దండకాది వివిధ రచనా రత్నము లనేకములు సముద్భాసితము లయి, భక్త జనులకు, భాగవత శిఖామణులకు హృదయానంద సంధాయకము లగుగావుత!

"విద్వ చ్చకోరావళి పారణోచితా
విద్వద్వర శ్రీ వరదార్య చంద్రజా
అంత స్తమో హృ ద్విమలా మనోహరా
భాభాతు రామానుజ కీర్తి కౌముదీ."



# కవి పండిత పరిచయము

## శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు



వీరి జననము - పరీధావి నిజ ఆషాఢము. ( ది. 27-7-1912. ) జన్మ స్థానము - సుబ్బమ్మపేట. టెక్కలి తాలూకా. శ్రీకాకుళము జిల్లా. జననీ జనకులు :- చూడమ్మ, శఠగోప రామానుజాచార్యులు గారలు. ప్రస్తుత నివాసము - సీతాఫల్‌మండి, సికింద్రాబాదు.

అభ్యసించిన భాషలు :- తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు, హిందీ, అరవము. ఉపాధ్యాయ వృత్తి : - చిట్టిగూడూరు, హైదరాబాదు, సికింద్రాబాదులలో. బిరుదులు :- సహజ కవి, విద్యారత్న. ముద్రిత రచనలు :- (1) పురుషోత్తముడు ( 1945 ఆంధ్ర విశ్వ విద్యాలయ పాఠ్యము ) (2) రామాయణ కల్ప వృక్ష విమర్శ ( 1967 జులై - భారతి ) (3) ఆంధ్ర ముకుందమాలా - కులశేఖర చరిత్రలు (1964) (4) ఆచార్య జగదీశ చంద్రబోసు ( 1971 సంవత్సరమున న్యూ ఢిల్లీలో - కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖవారి అవార్డు పొందినది ) అముద్రితములు :- (1) ఆచార్య జగదీశ చంద్రబోసు (గద్యము) (2) కళాశాల ( సికింద్రాబాదు సంస్కృత మహాబూబ్ కాలేజీ చరిత్ర ) (3) భారత హృదయము (గీతా కావ్యము - ఆంధ్ర భగవద్గీతలు) సమ్మానము :- మాజీ మంత్రివర్యులు - ఆంధ్ర విశ్వవిద్యాలయ మాజీ ఉపాధ్యక్షులు నగు శ్రీ యం అప్పారావు గారి అధ్యక్షతన వివేకానంద పరిషత్తు వారిచే ఘన సన్మానము.

# ప్రముఖుల దృష్టిలో

## శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

చిలకపాటి విజయ రాఘవాచార్యులు, M. A. నాగార్జున సాగర్.

ఆంధ్ర దేశంలో - శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యుల వారు - సాంప్రదాయిక ధార్మిక, సాహిత్య నిర్మాణ నిర్వహణా రంగంలో లబ్ధ ప్రతిష్ఠులు, బహు ముఖ ప్రజ్ఞావంతులు, సకల కళాభిజ్ఞులు.

ఆచార్య : యస్వీ జోగారావు, M. A; Ph D. వాల్తేరు

శ్రీమాన్ వరదాచార్యులవారు వైష్ణవ తేజో విరాజితులు. భక్తి భావ ఘంటాపథ మహారథులు శ్రీ రామానుజ కీర్తి కౌముదీ విలసనమునకు రాకా మహాపాత్రములు పెట్టి, వైష్ణవ ధర్మ ప్రబోధమునకు బద్ధకంకణులైన మహాభాగులు. వైదుష్య సంపన్నులు. వాఙ్మయ ధురంధరులు. పరమ భావుక పట్టభద్రులు.

కోగంటి సీతారామాచార్యులు గుంటూరు

శ్రీమాన్ వరదాచార్యులవారి రచనలు వక్తవ్యాంశమును ప్రస్ఫుటింపజేయుచు, సముచిత రీతితో నడచుచుండును గంభీరమై రస స్ఫోరకమై, భక్తి భావ సముత్తేజక మగు కమ్మని నుడికారము వీరికి ఆజన్మసిద్ధమై యున్నట్లు, నా యనుభవమున తోచుచున్నది.

మాడభూషి అనంతశయనం అయ్యంగార్, తిరుపతి

శ్రీమాన్ వరదాచార్యులవారు సంస్కృతాంధ్రములందే గాక ద్రావిడ దివ్య ప్రబంధములందును గొప్ప పండితులు.

కొల్లూరి చంద్రమౌళి, B Sc. గుంటూరు.

శ్రీమాన్ వరదాచార్యులవారు గొప్ప పండితులు. బహు భాషా వేత్తలు. ఉభయ వేదాంత విశారదులు. మంచి వక్తలు. విద్వత్కవులుగా సుప్రసిద్ధులు. వీరికి శ్రీ వైష్ణవ సంప్రదాయము నందు గల అభినివేశము అసామాన్యమైనది.

జమ్మలమడక మాధవరామ శర్మ గుంటూరు

శ్రీమాన్ వరదాచార్యులు తన సంప్రదాయమునకు సంబంధించిన ధార్మిక, ఆధ్యాత్మిక సారస్వత గ్రంథముల పరిచయము కల వారి పరిచయమును సంపాదించిన చయనశీలి.

వంగవోలు ఆదిశేషశాస్త్రి నాగండ్ల

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ వ్యవహర్త యైన శ్రీమాన్ వరదాచార్యులు - భక్తి ప్రపత్తులయం దత్యంత గాఢమైన ప్రత్యయము గల ఉత్తమ వ్యక్తి. సంస్కృతాంధ్రాది భాషలందే గాక, ద్రావిడమునందును వ్యుత్పన్నుడై, తత్సాహిత్య కళా రహస్యములను ఆమూలాగ్రముగ ఆకళించుకొన్న విదగ్ధ శిఖామణి. సులభ సుందర మధుర కవితా విశారదుడు సుబోధక వచన రచనా ప్రావీణ్యము గల ఉపన్యాసక రత్నము.

వానమామలై వరదాచార్యులు చెన్నూరు

శ్రీమాన్ వరదాచార్యులవారు సాహిత్యోపాసకులు చారిత్రక పరిశోధకులు. వీరి రచనా పద్ధతి - పండిత పామర సుబోధకమై సులలిత సుందర పద యుక్తమై, శ్రుతి సుఖావహమై, చదివిన కొలది - ఇంకను చదువ వలె ననుతమకమును ఇనుమడింపజేయును.

డాక్టర్ : రత్నాకరం శ్రీనివాసాచార్యులు, సత్తెనపల్లి

శ్రీమాన్ వరదాచార్యులవారు బహు భాషా కోవిదులు పండిత ప్రకాండులు నగుటయే గాక, భావ మధురముగ కవిత్వము వ్రాయగల సమర్థులు. వక్తృత్వ ప్రావీణ్యమును స్ఫుటముగను, స్పష్టముగను నొక్కి వక్కాణింప గల మహోపన్యాసకులు.

రాగం అంజనేయులు గుంటూరు

శ్రీమాన్ వరదాచార్యులవారు బహు భాషా కోవిదులై మృదు మధుర మగు శైలిలో – భక్తి ప్రబోధక గ్రంథము లనేకములను రచించుటే గాక, దేశమున పలు తావులలో పర్యటించి, తమ గంభీరోపన్యాసముల మూలమున భక్తి ప్రచారము గావించిన వైష్ణవ ప్రముఖులు.

పైడిపాటి సుబ్బరామశాస్త్రి, B.A; P O.L విజయవాడ

శ్రీమాన్ వరదాచార్యులవారు బహు భాషా వేత్తలుగా' బహు గ్రంథ కర్తలుగా, శ్రీ రామానుజ కీర్తికౌముదీ సంపాదకులుగా లోకమునకు సుపరిచితులు.

మోచర్ల రామకృష్ణయ్య కవి B. A; B. L. నెల్లూరు

శ్రీమాన్ వరదాచార్యులవారు విద్వల్లోకమున సుప్రసిద్ధులు రసజ్ఞ శిరోమణులు. ఎంతో వాఙ్మయసేవ చేసినవారు.

చక్రవర్తుల నారాయణాచార్యులు, M. A. హైదరాబాదు

శ్రీమాన్ వరదాచార్యులవారు బహు భాషా కోవిదులు. విద్వత్కవి శేఖరులు. శ్రీ పాంచరాత్ర శాస్త్ర పారంగతులు.

డివి లక్ష్మీ నరసింహాచార్యులు గుంటూరు

శ్రీమాన్ వరదాచార్యులవారు నా కెంతో ప్రియ సుహృన్మణులు. ఆనువంశికముగకూడ రసవత్పాండితీ శౌండులు. చక్కని కవితను ఉభయ భాషలయందును వెలయింపదిట్టలు. మంచి వక్తలు. బహు గ్రంథకర్తలు

కె. కృష్ణమాచార్యులు, M. A; B Ed. మధిర

శ్రీమాన్ వరదాచార్యులవారి ఆళ్వారుల సేవ అద్భుతము. వారు ధన్య జీవులు వైష్ణవ సంప్రదాయ గ్రంథములలో వారికి గల అపార విజ్ఞాన సంపత్తి, కవితా సౌందర్యము, విషయ గ్రహణము, విమర్శనా శక్తి, భాగవత సేవ, పారమార్థిక చింతన అపూర్వములు. వారు పన్నిద్దరాళ్వారులలో - ఒక అంశరూప మని నా మనస్సునకు స్ఫురించుచున్నది.

*పూజ్యశ్రీ - త్రిదండి: శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి*



పూర్వాశ్రమమున వీరు తూర్పు గోదావరి జిల్లా - అర్తమూరు గ్రామ వాస్తవ్యులై, 'చిలకమర్తి శ్రీమన్నారాయణాచార్యులు' అను పేర వ్యవహరింపబడుచుండెడివారు.

వీరు బహు భాషావేత్తలు న్యాయ - తర్క శాస్త్ర పండితులు. దేశసేవా ధురంధరులు. భాష్య భగవద్విషయాది సంప్రదాయ గ్రంథములందలి విశేషములను బాగుగా ఆకళించుకొన్న

వారు. 'శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారక సంఘము' నొక దానిని నెలకొల్పి, ఆసేతు శీతాచల పర్యంతము విశిష్టాద్వైత మత ప్రచారము గావించున మహనీయులు.

బదరికాశ్రమమున తపస్సు చేసి, వాసమామలై జీయరు స్వామివారి వద్ద యత్యాశ్రమమును స్వీకరించి, 'త్రిదండి - శ్రీమన్నారాయణ రామానుజ జీయరు' అను పేర వ్యవహరింపబడిరి.

ఆశ్రమ స్వీకరణానంతరము బదరికాశ్రమములో - అష్టాక్షరీ కోటి హవన మహా క్రతువును నిర్వహించి, అచటనే క్రతు చిహ్నముగా - అష్టాక్షరీ క్షేత్రము నేర్పరచి, నూతన సత్సంగ సదనము గట్టించిరి. యాదగిరిలో - గాయత్రీ యాగము గావించిరి. భారత దేశమున - దివ్య క్షేత్రములందును, పుణ్య తీర్థములందును, పట్టణములందును, పల్లెసీమల యందును తొమ్మిది సంవత్సరములలో - నూట యెనిమిది పారాయణములతో గూడిన శ్రీరామ క్రతువులను నిర్వహించుటే గాక, ఆ యా తావులలో - రామకోటి స్వరూపము లైన నూట యెనిమిది స్తూపములను నిర్మించిరి. చివర 108 - వ శ్రీరామ కోటి మహా క్రతువు శ్రీ వేంకటాచలమున పూర్తి గావింప బడిన పిమ్మట, అచట తిరుమలలో - శ్రీభాష్య పీఠమును, శ్రీ రంగమున భగవద్విషయ పీఠమును నెలకొల్పిరి.

ఇదుపరి - బదరికాశ్రమమున బ్రహ్మ యజ్ఞము గావించిరి. దేశమున అనేక జీర్ణ దేవాలయముల నుద్ధరించిరి. శ్రీ పాంచరాత్ర శాస్త్రముల కొసంగంటికి పునర్ముద్రణ భాగ్యమును గల్గించిరి.

శ్రీ వేంకటాచలమున - శ్రీ లక్ష్మీ నారాయణ సహస్ర హోమకుండ మహా క్రతువును నిర్వహించిరి. హైదరాబాదులో - శ్రీ భాగవత సప్తాహ యజ్ఞము గావించిరి. తిరునారాయణ పురములో -

స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞము గావించి, అచటి తిరునారాయణస్వామి ఆలయములో - నిత్యారాధనాది కైంకర్యములు నిరంతరాయముగ జరుగుటకై భక్తులనుండి కొంత ద్రవ్యమును సేకరించి, దాని నొక బ్యాంకులో డిపాజిట్ చేసి, దానిపై వడ్డీ డబ్బు వచ్చు యేర్పాటు చేసిరి.

అటు పిమ్మట - నైమిశారణ్యమున 88 వ స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞము గావించిరి. ఆంధ్ర ప్రదేశమున అనేక ప్రాంతములలో దేవతా ప్రతిష్ఠలను, స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞములను చేసిరి. చివరిదగు 108 - వ స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞము తిరుమల క్షేత్రమున వేయి కుండములతో, అయిదు వేలమంది ఋత్విక్కులతో సప్తాహ దీక్షగా నిర్వహింప సంకల్పించినవారై, భారత దేశమం దంతటను ప్రచారము గావించుచున్న తరుణమున, శ్రీ జీయరుస్వామివారు అస్వస్థతకు గురియై, 30-12-1979 తేదీన పరమపదించిరి వీరికి దేశమం దంతటను వేలకొలది శిష్యు లున్నారు.

*శ్రీ డాక్టర్: గూడ సుందరరామయ్యా*



వీరి జననము 5-8-1938. జన్మ స్థానము చీరాల. జననీ జనకులు :- రాజేశ్వరి, శంకర శర్మ గారలు.

డాక్టరు: సుందరరామయ్యగారు మహాసారస్వత సంపన్నులు.

భారతీయ వేదాంత, తర్క-శాస్త్ర పారంగతులు, ప్రాచ్య పాశ్చాత్య వేదాంత పారీణులు.

విద్యార్థిగా శైశవమునుండియు స్నాతకోత్తర (Post Graduet) పరిశోధనా స్థాయి వఱకును తర్క- వేదాంతములు ప్రధాన అధ్యయనములుగా - సర్వోత్తములుగా ఉత్తీర్ణతా పరంపరను సాధించిన మహా మనీషి మూర్ధన్యులు.

1960 సెప్టెంబరు 6వ - తేదీన ప్రత్యేక బోధకులుగా - ఆంధ్ర విశ్వకళా పరిషత్ శాస్త్ర విభాగమున నియమింపబడి, 5-2-79 నుండి ప్రాచార్యులు (Reader) గా, స్నాతకోత్తర పరిశోధన విభాగమునకు ఆచార్యులుగా. పర్యవేక్షకులుగా, పరీక్షకులుగా వ్యవహరించుచున్నారు ఇతః పూర్వము ఆంధ్ర విశ్వ విద్యాలయ తత్త్వశాఖాధ్యక్షులుగా (1979 - 82), స్నాతకోత్తర మండలి అధ్యక్షులుగా, అనేక విశ్వ విద్యాలయములకు అధ్యాపక నియామక సంఘ సభ్యులుగా, తదితర విశిష్ట పదవులందును వీరు విలసిల్లిరి.

'శంకరాద్వైత తత్త్వము, భారతీయ వేదాంతమున ఆత్మస్వరూప లక్ష్యములు' అను విషయముపై పరిశోధన గావించి, 1978 లో - డాక్ రేట్ పట్ట భద్రులైరి.

వీరి పర్యవేక్షణమున పదిమంది పరిశోధక వ్యాసములను సంపాదించుట గమనార్హము.

'ప్రపంచ తత్త్వ విచార రీతులు' - 'శంకర, రామానుజుల తత్త్వముల పోలికలు' - 'తర్క శాస్త్రీయ పద్ధతులు - వేదాంత వాదములు' - 'వేదాంత పద్ధతులు' - 'సంఘము - రాష్ట్రము' వంటి ఉత్తమ పాఠ్య, పరిశీలక గ్రంథములతో పాటు, స్వకీయములైన పరిశోధనా

వ్యాస గ్రంథములను రచించి ప్రచురించిన మహా సాహితీ సంపన్నులు డాక్టర్ : సుందరరామయ్యగారు.

వీనినేగాక, ఇంకను 25 పరిశోధక వ్యాసములను వివిధ పత్రికలందును, సంచికలందును వీరు ప్రచురించిరి. మద్రాసు, ఉజ్జయిని, హైదరాబాదు, న్యూఢిల్లీ, మదురై, చండీగర్, కలకత్తా పట్టణములలో - జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో జరిగిన ఇరువదియైదింటికి పైగా - సంచికా కార్యక్రమములందును, సమావేశములందును, - ప్రాచ్య ప్రాశ్చాత్య తత్త్వశాస్త్ర విషయములపై తమ పరిశోధన పత్రములను సమర్పించిన తత్త్వ శాస్త్రవేత్త, ప్రవక్త, ప్రయోక్త శ్రీ సుందర రామయ్యగారు.

బోధన, సాధన, పరిశోధన వ్యాసంగములు - త్రివేణీ సంగమముగా మూర్తీభవించిన వీరి వ్యక్తిత్వము, క్రమశిక్షణ, నిష్ఠ, ఆధ్యాత్మికలతో మేళవించిన ఒక మహా స్రవంతి.

*శ్రీమాన్ టి.కె.వి.యన్. సుదర్శనాచార్యులు*



వీరి పూర్తి పేరు — తిరుమల కుమార వేంకట నరసింహా సుదర్శనా చార్యులు. తెలుగు సంస్కృతము ప్రాకృతము, తమిళము, కన్నడము, మలయాళము, హిందీ, ఆంగ్లము మున్నగు భాషల నభ్యసించిన మేధా సంపన్నులు వీరు. 'సాహిత్య శిరోమణి', 'న్యాయ శిరోమణి', ఉభయ వేదాంత విద్వాన్' అను డిగ్రీలు పొందిన మహా మహులు.

సంస్కృతాంధ్ర సాహిత్యము లందును, ద్రవిడ సాహిత్యము నందును, ఉభయ వేదాంతము లందును ఉద్దండ పండితులుగా విఖ్యాతి వహించి, 'దర్శన సార్వభౌమ', 'మహోపాధ్యాయ' మున్నగు బిరుదములు సంపాదించిన ప్రతిభావంతులు శ్రీమాన్ సుదర్శనాచార్యుల వారు.

వీరు వివిధ భాషలలో — వివిధ శాస్త్ర విషయములపై, అనేక గ్రంథములు రచించిరి ఆళ్వారాచార్యులచే రచింపబడి ప్రపన్న పారిజాతముగా పేరు గాంచిన 'నిత్యానుసంధానము'నకు — ప్రతిపద టీకా తాత్పర్యములతోఁబాటు, 'పరిమళోల్లాస' మను పేర సులభ సుందర మగు శైలిలో — విపుల మగు నొక వ్యాఖ్యానమును సుధా మధురముగ విరచించి విఖ్యాతి వహించిరి.

వివిధ విషయములపై, వివిధ భాషలలో వీరిచే వ్రాయఁబడిన వ్యాసము లనేకములు — ప్రముఖ పత్రికలలో ప్రకటింపబడినవి పెక్కు గ్రంథములకు వీరు పీఠికలు వ్రాసి, ఆ గ్రంథముల విలువను ఇనుమడింపఁజేసిరి.

అనేక మహా సభలలో - వివిధ విషయములపై మహోపన్యాసము లొసంగి, ఘన సమ్మానము లందుకొనిరి.

తిరుమల తిరుపతి దేవస్థానముల పక్షమున, ప్రతిసంవత్సరము వేసవిలో — నాల్గు వారములపాటు జరుగు శ్రీ వేంకటేశ్వర హిందూ వేదాంత వసంత పాఠశాలను దాదాపు మూడు దశాబ్దముల వఱకు ఎంతో సమర్థముగా నిర్వహించి, శ్లాఘింపఁబడిరి.

శ్రీమాన్ సుదర్శనాచార్యులవారు తిరుపతిలో - శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయమున 1953 ప్రాంతములో- శ్రీవైష్ణవ

గ్రంథమాల సహాయ సంపాదకులుగా, సంపాదకులుగా పదవుల నధిష్ఠించి, సంప్రదాయ రహస్యముల నెన్నింటినో వెలువరించి, శ్రీవైష్ణవ లోకమునకు మహోపకారము గావించిరి. వీరిపుడు పరమపద వాసులు.

## శ్రీమాన్ విక్రాల శేషాచార్యులు



వీరి జననము రాక్షస సంవత్సరం నిజ వైశాఖ బహుళ సప్తమీ శుక్రవారము (4–5–1915.) జన్మస్థానము కలికివాయ అపుడు నెల్లూరుజిల్లా, ఇపుడు ప్రకాశము జిల్లా జ. నీ జనకులు :— శ్రీరంగనాయకమ్మ, రామచంద్రాచార్యులు గారలు.

శ్రీమాన్ శేషాచార్యుల వారు వేదాధ్యయన తత్పరులు. సంస్కృతాంధ్ర భాషావేత్తలు. సాహిత్య, వ్యాకరణ శాస్త్ర పండితులు. ఉభయ భాషలందును - చిత్ర కవిత్వ, బంధ కవిత్వము లలో సిద్ధహస్తులు. 'మహాకవి - చతుర్విధ కవితా చతురానన — సుధీమణి' బిరుదాలంకృతులు ప్రకాశము జిల్లా రచయితల గౌరవాధ్యక్షులు.

రచనలు :— సంస్కృతములో — (1) శ్రీనివాస ప్రసాదము (మహాకావ్యము) (2) భాగవత సంగ్రహము (3) పురాణ నీతి (4) శ్రీ రామానుజ పంచాశత్ (5) శ్రీ హయగ్రీవ పంచాశత్ (6) సంవాదము (7) పితృ ప్రశంసా (8) శ్రీ వేంకటేశాష్టకము (9) శ్రీ లక్ష్మీ నారాయణ సుప్రభాతము (10) శ్రీ కోదండరామ సుప్రభాతము (11) శ్రీ సత్యనారాయణ సుప్రభాతము (12) శ్రీపాదరేణు శతకము మున్నగునవి. (13) వీరి సంస్కృతాంధ్ర (శేష) నిఘంటువు - ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారిచే ప్రచురించబడినది.

సమ్మానములు :– సంవత్సరమునకు వేయి నూట పదారు (1,116/–) రూప్యముల చొప్పున, ప్రభుత్వము వారిచే వార్షిక సత్కారము. ఒంగోలు – ఎట్టిన పీఠమున, జిల్లా కలెక్టరు వారిచే దుశ్శాలువతో నూటపదారు రూప్యములతో ఘన సమ్మానము.

ప్రసంగ ప్రశంసలు :– 'సంస్కృత భాషాయాం నిఘంటు నిర్మాణమ్' ఇత్యాది విషయములపై, విజయవాడ రేడియో కేంద్రము నుండి, అమరవాణిలో ప్రసారమైన వీరి ప్రసంగములు – శ్రోతల ప్రశంసలకు పాత్రము లైనవి.



# ముద్రణ స్ఖాలిత్యములు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 19 | కడు గడు | కడు గడు |
| 10 | 2 | యి ద్రాజుల | యింద్రాజుల |
| 17 | 3 | రె డు | రెండు |
| 22 | 7 | భావి చిరి | భావించిరి |
| 23 | 5 | మ డలమున | మండలమున |
| ,, | 7 | కృపా సి ధు | కృపాసింధు |
| ,, | 8 | వ సి వచ్చెను. | వలసి వచ్చెను. |
| ,, | 9 | విచిత | విచిత్ర |
| 27 | 11 | ప్రబంధము లో | ప్రబంధములలో |
| 29 | 3 | యు యు | యునియు |
| 30 | 7 | వర్ణి రి. | వర్ణించిరి. |
| 43 | 6 | విశ్వ తాణాయ | విశ్వత్రాణాయ |
| 45 | 3 | రె డును | రెండును |
| 72 | 7 | శితులను | గతులను |
| ,, | 8 | గ స్త్రులు | శ స్త్రులు |
| 90 | 13 | పన్యసించి | నుపన్యసించి |
| 120 | 5 | తరువుళ్ళము | తిరువళ్ళము |
| 124 | 13 | చేతిలా | చేతిలో |
| 151 | 20 | స్తోత | స్తోత్ర |
| 161 | 11 | వెస్టు | వెస్తు = |
| 163 | 18 | వే కటా | వేంకటా |
| 167 | 4 | యాన్లసకును | యాన్లకును |
| 179 | 6 | ఉప ష | ఉపనిష |
| 180 | 4 | వలెన న్న | వలెనన్న |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 180 | 6 | గ్ర థ | గ్రంథ |
| ,, | 8 | సూచి ప | సూచింప |
| ,, | 9 | గుఱి చిన | గుఱించిన |
| ,, | 12 | పూ రా | పూర్వా |
| 182 | 25 | ఆ ధ్రపూర్ణ | ఆంధ్రపూర్ణ |
| 184 | 28 | ద్వ్యాపరే | ద్వ్యాపారే |
| 185 | 1 | 158 | 185 |
| 186 | 10 | రూపే | రూపేణ |
| ,, | 16 | తొలి | తొల్లి |
| 187 | 5 | భూ పురీ | భూతపురీ |
| 189 | 17 | ప్రశ స | ప్రశంస |
| 190 | 3 | ఇడినవి | బడికని |
| 194 | 15 | హి దూ | హిందూ |
| 195 | 8 | ప్రతే కముగ | ప్రత్యేకముగ |
| ,, | 11 | రామా జ | రామానుజ |
| 200 | 10 | పురా దక్ష | పురాధ క్ష |
| 201 | 11 | చరిద్రము | చరిత్రము |
| 202 | 6 | కూ నాధ | కూరనాధ |
| ,, | 9 | గ్రంథా తము | గ్రంథాంతము |
| ,, | 16 | నాన ద | నానంద |
| ,, | 18 | యధావ | యధావ |

— o —

## సప్తమి సంపుటములో

# రామున్న రచనలు

1. శ్రీనివాస స్తుతి
   శ్రీమాన్ బృందావనం రంగాచార్యులు
2. అవతార తత్త్వము - దశావతారములు
   శ్రీమాన్ వేదాల వేంకట సీతారామాచార్యులు
3. దివ్య ప్రబంధములు - సంగీత సాహిత్యములు
   శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు
4. శ్రీ రామానుజ వైభవము
   శ్రీమాన్ కందాడ శ్రీనివాసాచార్యులు
5. శ్రీ మద్రామానుజోదాహరణము
   శ్రీమాన్ వెలమచెర్ల రంగాచార్యులు
6. శ్రీ మద్రామానుజులు - భక్తి తత్త్వము
   శ్రీమాన్ చింతావట్టణం శ్రీరంగాచార్యులు
7. శ్రీ యతిరాజ వైజయన్తి
   శ్రీమాన్ తిరుమల నరసింహాచార్యులు

### శుభాకాంక్ష

మానిత సుప్రసాద పరిమండితమై, విధు సుప్రసాద భావానఘమై, లసత్కువలయ ప్రియమై, మతిమచ్చకోర సంతాన సుఖప్రదంబయి, నితాంత జగత్తిమిరఘ్నమైన 'రామానుజ కీర్తికౌముది' - సమస్త దిశల్ వెలుగొందఁ జేసెడున్.

— కరి నారాయణాచార్యులు